శ్రీరస్తు

# కావ్యాలంకారచూడామణి

విన్నకోట పెద్దయ మహాకవి ప్రణీతము

తృతీయముద్రణము.



వేదము, వేంకటరాయ శాస్త్రి చేత

ముద్రితము.

చెన్నపురి

కేసరిముద్రాక్షరశాల

1929

వెల రు. 1.

స్వాశ్రితరాజనీతి యథవీకృతభూవరభూతి సర్వలో
కాశ్రయచక్రవర్తి సమరారిచమూసమవర్తి శూరతన్. ౬

సీ. లక్ష్మీధరిత్ర్యుపలాలనప్రౌఢిమ రాజనారాయణప్రథ వహించి
హవ్యకవ్యార్థనిత్యప్రదానవ్యాప్తి సర్వలోకాశ్రయక్షమతఁ జెంది
త్రస్తశస్త్రాఖిలోద్ధరణక్రియాసిద్ధి ధరణీవరాహశబ్దమునఁ బేర్చి
గర్వితారాతివిఖండనోదారతఁ గరవాలభైరవఖ్యాతి వడసి

తే. కదనభీతులఁ బులు మేపి కాచి రాయ
గండగోపాలబిరుదసంగతిఁ దనర్చి
యవనిఁ బొగడొందు బహువిజయప్రవర్తి
చాగచాళుక్య విశ్వేశచక్రవర్తి. ౭

ఉ. ఎంచఁ జళుక్యవిశ్వధరణీశ్వరరాయకటారిసాళువ
స్యందన మొప్పఁ జెప్ప బహుపక్షబలంబునఁ గ్రంచఁ గెల్చి మి
న్నందినరాజసింహనివహంబులఁ బట్టి వధించి సస్తుతిం
బొందినధార్తరాష్ట్రకులపూగములన్ గణియించు నాజులన్. ౮

వ. మఱియును;

సీ. వేదశాస్త్రరహస్య విధు లెల్లఁ బరికించి సవిఁ జతుర్వర్గప్రశస్తి నొంది
రాజవిద్యాతంత్రరక్తి సంభావించి వర్ణక్రమంబుల వల నెఱింగి
ఖ్యాతిపాయుర్వేదసంగతి నెగడొంది సంగీతసాహిత్యసరణి నేర్చి
తురగేభగోహణాదుల విశ్రుతికి నెక్కు యాయుధవిద్యల నతిశయిల్లి

తే. యచట నచ్చట నున్న కావ్యాగములఁ
దెలఁగి సత్కవిసౌకర్యసిద్ధికొఱకు
నొక్కచోటను గూర్ప నుత్సహించి
సత్కళావర్తి విశ్వేశచక్రవర్తి. ౯

మ. ననుఁ గావ్యక్రమవేది నర్చితబుధానందాదరాలోకితున్
మనితశ్రీగిరిశేశపాదయుగళున్ మాన్యున్ గళాకోవిదున్
వినుతున్ గౌశికగోత్రుఁ బెద్దన సుధీవిఖ్యాతు రావించి స
ద్వినయం బొప్పఁగ నాదరించి తగ నావిశ్వేశ్వరుం డిట్లనున్. ౧౦

ఉ. భావరసప్రపంచమునఁ బర్వనలంకృతిలక్షణంబు, ఛం
దోవిచితిప్రచారము, గుణాగమలదస్ఫురదంధ్రదేశభా
షావివిధప్రసంగములచందము నందముగా నొనర్చి వి
ద్యావిధి గానిపించుటగదా చతురత్వ మనంగ మేదినిన్. ౧౧

క. అను నవ్విశ్వేశ్వరవిభు-ననుమతి యనునూత్నపోత మాధారము గా
ఘనరసరత్నాకరమునఁ-గనుఁగొని యొడఁగూర్చి యిత్తుఁ గబ్బపుమణులన్. ౧౨

## షష్ఠ్యంతములు

క. లక్ష్మీపుత్త్రునకు నుపేం-ద్రక్ష్మావరనందనునకు ధర్మజ్ఞునకున్
లక్ష్మవిభేదనలాఘవ-లక్ష్మణునకు సర్వశాస్త్రలంపటమతికిన్. ౧౩

క. సింధురసత్త్వునకు మరు-త్సింధు రస క్రీడ దోహిత తృప్తికునకున్
బంధురశుభానుభవునకు-బంధురమావృద్ధికరణ బహువిభవునకున్. ౧౪

క. చాళుక్యవిశ్వధరణీ-పాలునకు నమన్నృపాలపరిపాలునకున్
శ్రీలునకు సమరవిజయ-శ్రీలలనాశ్లేషసౌఖ్యశీలున కెపుడున్. ౧౫

వ. అభ్యుదయపరంపరల నకంపితస్థితి యావహిల్లునట్లుగా మద్విరచనీయంబగు కావ్యాలంకారచూడామణి యను నలంకార లక్షణంబునకుఁ బ్రథమావతరణం బెట్టిదనిన: ౧౬

చ. సరళవిరాజదుచ్చరణశస్తము వర్ణము, వర్ణపంక్తివి
స్తరము పదంబు, తత్పదవితానము వాక్యము, వాక్యభేదసుం
దరతర మర్థ, మర్థఘనతత్త్వవిబుద్ధము భావ, మట్టిభా
వరుచిరసుప్రసన్నవిభవంబు రసం బాడుఁ గూర్ప నేర్చినన్. ౧౭

## భావము

క. బహిరర్థాలంబనమై-విహరించు మనోవికార విలసితము సువి
హిత మగు భావ మన; నది-మహి విజ్ఞానంబు నా సుమతులం బరఁగున్. ౧౮

క. ఘనవిజ్ఞానం బాత్మకు-మనసున నే కలుగు నట్టిమనసున కబ్బున్
గనదింద్రియముల చేతన్-వినఁగా వీనులకు నాదము విషయప్రాప్తిన్. ౧౯

## భావభేదములు

తే. అట్టి విజ్ఞానకలితమై యమరుభావ
మాత్మఁ బ్రవ్యక్తమై విభావానుభావ
సాత్త్వికవ్యభిచారి సంజ్ఞలఁ దనర్చు
నాల్గుతెఱఁగుల రసనిదానంబు గాఁగ. ౨౦

క. నవరసవిస్ఫుటకరణ-ప్రవణము లగు నుచితరుచివిభావము లెల్లన్
వివిధ స్త్రీపురుషులయం-దవిరళముగఁ బొడముఁ దెలియు నను గవీంద్రుల్. ౨౧

## విభావములు

ఆ. అవ్విభావ మొప్పు నాలంబనంబు ను
ద్దీపనంబు నాఁగ ద్వివిధ మగుచు
నిఖిల రస విబోధ నిర్మాణకరణంబు
లిత్తెఱంగు లెల్ల నెఱుఁగ వలయు. ౨౨

### ఆ లం బ న వి భా వ ము

క. ఆలంబనంబు నాఁగ ర-సాలంబన మైనరూపయౌవనకాంతి
శ్రీలావణ్యాదిక; మఱి-మూలము తద్వ్యక్తికిన్ బ్రమోదప్రద మై. ౨౩

ఉ దా హ ర ణ ము.

చ. సెలవుల నిండుచన్నుఁగవ నిక్కును, గామునితూపుకైవడిన్
వెలిఁగెడు రూపవిభ్రమము, విస్మయదుదారతఁ దేజరిల్లుఁ జూ
పులజిగి, సొంపు వెట్టనివిభూషణ మై మెయి నంతకంతకున్
బలియుఁ, జళుక్యవిశ్వజనపాలునిమన్ననఁ గన్నయింతికిన్. ౨౪

### ఉ ద్దీ ప న వి భా వ ము

క. చలియింపక రస మింపుల-నొలయుచు నెవ్వానిచేత నుద్దీపించున్
గలఁగొన బుధులకు నవి యి-మ్ముల నుద్దీపనవిభావములు నాఁ బరఁగున్. ౨౫

క. ఆలంబనోక్తగుణములు-నాలంబనచేష్టితములు హారాలంకా
రాళియు నుత్సవశీలలు-నోలిన్ జతురాహ్వయంబు లుద్దీపనముల్. ౨౬

సీ. రూప లావణ్య తారుణ్యాది శారీర గుణము లాలంబనగుణము లరయ,
నంగ నోచిత భావ హావ హేలాది కాంతతియుఁ జేష్టితము గా సంచరించు,
హార కేయూర మంజీర కంకణ కంఠికాదు లలంకరణాఖ్యఁ గొను,
నుపవన జల చంద్రికోత్సవ వాస్తవశీల లాత్మ విహారంబు లనఁగఁ బరఁగు;
తే. నిట్టి యుద్దీపన విభావ హిత వినోద
విధవములఁ గాంచుఁ జాళుక్యవిశ్వవిభుఁడు
అలరువిల్తునిభంగి జయంతుకేల
ధ్రువచందమున నలకూబరునిపగిది. ౨౭

### అ ను భా వ ము లు

శా. భ్రూ తా రానన రాగ దృగ్విలసనంబుల్ సాత్త్వికాదాంగ వా
క్చాతుర్యంబులు నోష్ఠకంపనము నాఁగం జెప్పు చేష్టాసము
ద్భూతం బై యనుభూతి నై రసము సొంపుం జెందఁగాఁ జేసి వి
ఖ్యాతం బై యనుభావ మొప్పు లలితవ్యక్తాకృతిన్ నాఁచుచున్. ౨౮

చ. వదనవికాసముల్, బొలయు వాలికచూపులు, లేఁతనవ్వులోఁ
బొడలెడితారకల్, బొమల పొల్పునపోకలు, మోవికెంపుపైఁ
గదిగెడుచిన్నినవ్వు, చెలికత్తెల కందము సేయుమాటలున్,
సుదతి చళుక్యవిశ్వనృపసుందరుఁ గాంచుటఁ జెప్ప నొప్పునన్. ౨౯

### సా త్త్వి క భా వ ము లు

తే. సత్త్వ మన మనోవృత్తి, తజ్జంబు లైన
భావములు సాత్త్వికము లష్టభావితములు,

## వైవర్ణ్యము

క. మద రోష విషాదులఁ-గదిరెడుసహజాంగరుచివికల్పమునకుఁ బే
రొదవును వైవర్ణ్యం బన-నది వర్ణవ్యత్యయమున నగుఁ దెలియంగన్. ౪౩

క. సారమతి విశ్వనృపతిని-గోరిన సమకూఱకున్నె కోర్కులు ధరణిన్?
గౌరయశస్స్మరణంబున సారూప్యపదంబు గలిగెఁ జామకు నొడలన్. ౪౪

## స్వేదము

క. దయితాలింగనసురత-ప్రయాసకలనములఁ జెమరు వాటిల్లు మిథః
ప్రియదంపతులకు, నది గా-త్రయుతార్ద్రత్వమునఁ దెలియఁ దగుఁ జతురులకున్.

క. ఇల విశ్వనృపతిచంద్రుని-లలితకరస్పర్శనములఁ లలన గరంగెన్,
దలపోయ దీనియొడ లి-మ్ముల నలవిధి చంద్రకాంతమునఁ జేసెఁ జుమీ. ౪౬

## సంచారిభావములు

తే. స్థాయిభావంబునందు నిత్యత్వ ముడిగి
వ్యభిచరించుచు నబ్ధిభంగాళివోలె
నోలిఁ బొడముచు నడఁగుచు నుంటఁ జేసి
యొసఁగు సంచారిభావంబు లెఱుఁగవలయు. ౪౭

సీ. గ్లాని నిర్వేద శంకా మదాసూయలు నాలస్య దైన్య శ్రమాహ్వయములు
స్మృతి మోహ చపలతా చింతలును విషాద సుప్తి విబోధ కౌత్సుక్యములును
నావేగ గర్వ హర్షామర్ష నిద్రలు మత్యపస్మార కోన్మాదములును
త్రాసోగ్రతా జడతా వితర్కంబులు నవహిత్థ ధృతి మరణాభిధములు

తే. వ్యాధియును వ్రీడయును ననవరుసఁ గృతుల-సాగు ముప్పదిమూఁడు సంచారిభావ
చయము వాని నెఱుంగక జరుగ దండ్రు-రసవివేచనచాతుర్యరంజనంబు. ౪౮

## గ్లాని

క. మానస మెరియఁగ మేనికి-నానాదౌర్బల్యకారణం బై యొంటన్
మానని పశ్చాత్తాపము-గ్లాని యనఁగఁ బరఁగు సుకవికల్పనవిధులన్. ౪౯

క. శ్రీకరుఁ డగువిశ్వేశ్వరు-భీకర ధరణీవరాహ బిరుద భరాత్మున్
జేకొని మది ధరియించిన-యీకోమలి క్లేశ ముడుప నింతులతరమే? ౫౦

## శంక

క. ఇదియును నదియును నట్లయి-యొదవెడునో కో యనఁగఁ బొడము నూహాపోహా
స్పద మై చనుననుమానము-మది శంక యనంగ బుద్ధిమంతుల కెక్కున్. ౫౧

క. స్తనితము తత్ప్రతినినదము-విని ధాటీపటహనాదవిభ్రాంతి మెయిన్
వెనుకకు ముందటిదెసకును-జన శంకింపుదురు విశ్వజనపతిశత్రుల్. ౫౨

## నిర్వేదము

క. దుర్విఫలత నీ త్యాగుల-దుర్వారప్రతిభ గలిగి తోఁపమి మొదలై
వర్విదుచిత్తవ్యథచే-నిర్వేదం బావు సోష్ణనిశ్వాసనమై. ౫౩

క. ఈనోములేల నోముఁగ? నీ నవశశిగోపచార మేటికి? తెలుఁతా
మానుప విశ్వేశ్వరుఁడే; నానాఁటికి మనుప రాజనారాయణుఁడే. ౫౪

## మదము

క. మదిరాకృతమోహము సం-పదుదితహర్షము గళాదిసాటవమును స
మ్మదమున నుదయింపఁగ నా-స్పదములు, తెలియంగవలయు భావజ్ఞు లిలన్. ౫౫

క. కించిత్కంప దవిర్యో-దంచిత మదిరా మదావిలాత్ముల నేర్పుల్
మించుఁ బురాచరితులవుల, నించునె విశ్వేశ మేటి నీశ్వరుసభలోన్? ౫౬

## అసూయ

క. పరబలమునివిద్యాసుం-దరతలకు సహింపలేక తలు పగదోషా
చరణము గల్పించుటచే-గరయ ననూయాభిధాన మైనెగ దొంగన్. ౫౭

క. ఈమహి విశ్వేశ్వరుచే-శ్రీమహిమన్ గన్నకవిగరిష్ఠు లసూయల్
వేమఱు భావింతురు చిం-తామణి సురధేను కల్పతరువులతోడన్. ౫౮

## ఆలస్యము

క. పొందుగ నిజకృత్యంబుల-మందోద్యోగంబు చేసి మసలుటయు కదా
గొందును నాలస్యం బీ-చందం బతిప్రీతి నెఱుఁగ జనుఁ జతురులకున్. ౫౯

క. చాళుక్యవిశ్వవిభుతో-నాలమునకుఁ గడఁగువిమతు లలసు లగుటయున్;
జాలఁగ వన్నెలు వెట్టక-యాలస్యము చేసి రచట నవురాంగనలున్. ౬౦

## దైన్యము

క. విపదార్తి విత్తహరణ-స్వపతినిరాకృతుల నుద్భవంబయ్యెడు త [౬౧
త్కృపణత్వము దైన్యం-బగుఁ గృప కాస్పదమగుచుఁ జూడఁ గృతపుణ్యులచేన్.

క. పరగండభైరవునియు-ద్ధురధాటీపటుత యెట్టిదో రిపుభూభృ
త్పురమాపురంధ్రిముఖముల-సరి నొక్కట దైన్య మంద్రు జను లరయంగన్. ౬౨

## శ్రమము

క. సురతక్లేశాయాసా-తురనిరమనాదికములఁ దోచెంచు శ్రమం;
బరసి తెలియంగవలయును-దరశ్వాసాది ఘర్మకణవిదర్శనలన్. ౬౩

క. అడవులకై యద్రులకై-యడుగడుగున సలఁతి వొడము నడలుచుఁ జని రీ
పడఁతుకలు పతులు మనుగడ-వడరఁగ గరవాలభైరవార్భటు సేయన్. ౬౪

## స్మృతి

క. అమరఁ బురాకృతసుఖదుః-ఖములం దలపోసి పోసి కనుఁగొనుటకు నై
నమితోన్నమితాననముగ-నెమకుట సంస్మృతి యనంగ నెలకొనుఁ దలఁపన్. ౬౫

ఉ. "ఈసుగచాపదీప్తులకు నీడు సుమీ మన సాలరత్నవి
న్యాసము, శీతటిల్లతలయచ్చు గదా మన లాసికాతనూ
ల్లాసము, శీఘనోపలములం దెగడున్ మన మౌక్తికావళీ
భాసము," లంచు విశ్వజనపాలవిరోధి దలంచుఁ గానలన్. ౬౬

## మోహము

క. భయదుఃఖావేశమహో-మయచింతనవిధుల నెఱయ మునుఁగొను మూర్ఛో
దయ మగు మోహం బనఁజను నయుక్తమవివేకసరణి నమఁ దెలియంగన్. ౬౭

ఉ. అద్దముఁ జూచి బిట్టులుకు, నానతిఁ జేసిన సంచలించు, న
మ్ముద్దియ విశ్వనాథునుపయి ముచ్చట చేసినయంతనుండి; యి
క్కద్దె నెఱింగి చంద్రునిఁ గానఁగ నీయ, పికంబు గూయ న
న్నిద్దపుబ్రామ మాన్పుదురు, నెచ్చెలు లిచ్చ యెఱింగి నిచ్చలున్. ౬౮

## చపలత

క. రాగద్వేషాదులచే-సాగెడు చంచలత పేరు చపలత, నిజనా
థాగోవిస్ఫురితతికా రాగవి నెఱుఁగంగవలయు నంభ్రము రసజ్ఞుల్. ౬౯

ఉ. నెయ్యపుబోటి మున్ను చెవి నించినవార్త తెఱుంగ కున్న యా
తొయ్యలి విశ్వభూవిభుని యారమునం గని రాగసక్తయై
తియ్యపునవ్వు వాతెఱకుఁ దెచ్చె, వడి న్గుచమండలంబుపైఁ
బయ్యెద చక్కఁ జేర్చెఁ, బొలపంబు నమర్చెఁ గటాక్షవీక్షలన్. ౭౦

## చింత

క. తనయ దనిష్టాగమనం-బన నగు తలపోఁత పేరు వో చింత యనన్;
మనసున నెలకొనుదానిన్-గనునది సంతాపసోత్సుకధ్యానమునన్. ౭౧

ఉ. తిగముగ విశ్వభూవిభుఁడు చేర్చినఁ దేరక ట్రోచి పిమ్మటన్
దరుణి తన్నిశతో వేస మదంబునఁ జన్నమనంబుఁ గ్రిప్పఁగా
చెర వతీ చింతనొంద, పృథివీతల మూరక వ్రాయు, బోటులన్
బరువడిఁ జూచి నివ్వెపడుఁ, బాయనిచింతనె మారు బుద్ధిలోన్. ౭౨

## విషాదము

క. అబ్బెఁ దగులాభ మని మది-నుబ్బెడుచో నంతరాయ మొనఁగూడుటయున్
బ్రబ్బికొను వెఱగుపా టని-నిబ్బరపువిషాద మనఁగ నెగడుం జూడన్. ౭౩

క. 'ఇనుఁ డరిగెఁ, దిమిర మది కను-కని పర్విడు, విశ్వనాథుకడ కేఁగద నే'
వని యొకమానిని దలఁపఁగ-ఘనకరములు నిగుడ ధరణికరుఁ డుదయించెన్. ౧౪

## సుప్తి

క. లీనేంద్రియ మై విషయ-ధ్యానంబునఁ గొలలునంతరంగములోనన్
గానఁబడు కలల కెల్ల ని-దానం బగు సుప్తి, దానిఁ దనుఁ దెలియంగన్. ౧౫

క. నుత్యచరిత విశ్వేశ్వర-కృత్యము సంకల్పసుప్రకీర్ణము నగు సా
హిత్యమును మరగి సుప్తికి-నిత్యత్వము గలుగఁ గోరు నెలఁతుక యొప్పున్. ౧౬

## బోధము

క. ఇంద్రియములు చిత్తమున క-తంద్రత లో నగుటఁ జెప్పఁ దగు బోధముగా,
రంద్రవికారవిలోచన-సాంద్రవికారముల నెఱుఁగఁ జనుఁ దజ్జ్ఞులకున్. ౧౭

క. విశ్వేశ్వరుండు పాలిత-విశ్వంభరుఁ డనుచు బుధులు వేదప్రముఖా
నశ్వరవిద్యలయందున్-శశ్వత్ప్రతిబోధసిద్ధిఁ జాటిరి జగతిన్. ౧౮

## ఔత్సుక్యము

క. గురుబంధు ప్రియ ధరణీ-వరవనితాలోకనాది వాంఛలచేతన్
బరు వగు నౌత్సుక్యము త-త్వరత విలంబమునఁ గానవచ్చుఁ జెలియా. ౧౯

క. ధరణీవరామలక్ష్మణుఁ-డరిలక్ష్మి వహింప వచ్చునప్పుడు నగరీ
తరుణులు తొడవులు పెట్టడఁ-బోరిఁ దొడిగెడు కౌతుకంబు పొల్పుగఁ జూడన్ ౨౦

## ఆవేగము

క. అమితవిచిత్రాలోచన-సముదాయంబుల సంభ్రమించుసంభ్రమ మావే
గము నాఁబడు; ననుచిత ని-ర్గమనస్థలనాటికములఁ గనుఁగొనవలయున్. ౨౧

క. సొబగారువిశ్వభూవరు-ప్రబలజయశ్రీలఁ జూడఁ బఱతెంచు తఱిన్
గబరీకుచజఘనంబుల-నిబిడత నసియాడెఁ బురము నెలఁతలనడుముల్. ౨౨

## గర్వము

క. రిపుతర్జనవాచాటము-విపులాత్మోత్కృష్టకథనవికటము రణలో
లుపమును నగుభుజదర్పము-నిపుణులు గర్వం బనంగ నెగడుచునుండున్. ౨౩

క. బాణకళాగర్వమునఁ గృ-పాణాహంకారగరిమఁ బాటిరె సమర
శ్రేణీవిహరణవికట-క్షోణీశులు రాయగండ గోపాలునకున్. ౨౪

## హర్షము

క. దయితాలోకన విభవో-దయ కరవ స్తుతులవలనఁ దగ నుదయించున్
బ్రయూతముదము హర్షం బం-గయుతప్రస్వేదపులకకలితం బగుచున్. ౨౫

క. కరవాలభైరవాంకుని-కరవాలభుజంగి పోరఁ గడు హర్షించున్
బరువడిఁ బరభూపాలక-సరసప్రాణానిలముల సరిఁ జవిఁ గొనుచున్. ౭౬

## అమర్షము

క. అపరాధులపై మనమునఁ-గుపితాత్మున కుద్భవించు కోప మమర్షం
బుపగతమత్సరపాప-వ్యపదేశంబులను నెఱుఁగ నగుఁ జతురులకున్. ౭౭

క. పరబలములఁ గనుఁగొని జము-కరణిం గనుఁగొనల నగ్నికణము లురులు నీ
వరగండభైరవునిభట-వరుల యమర్షంబు పొగడవశమే పోరన్ ౭౮

## నిద్ర

క. అలవున నలసత సురతా-కులతన్ బ్రణయోపపన్నతోపాగులచే
నలవడు నిద్దుర, యది యి-మ్ముల ముకుళితనయనమాత్రమున నెఱుఁగఁబడున్.

చ. చెలువ చళుక్యవిశ్వనృపుచే మరుతాపుల నెల్లఁ గల్చి యీ
ప్పుల సుఖనిద్ర సేయుతతి బోటులచూపుల కింపొనర్చె న
య్యలికముఁ బోఁడఁ బ్రాలునలకొళ్ళయుఁ దిన్ననియూర్పుతావికిన్
గలఁగడు తేంట్లనన్ గొలిచి సేయుచుఁ గొండొక సేపు శయ్యపై. ౮౦

## మతి

క. సహజార్థతత్త్వసంశయ-మహితవినిర్వహణశక్తి మతి యనఁ బరఁగున్
మహనీయస్ఫూర్తప్రతిభా-విహరణమున నెఱుఁగఁ దగు వివేకప్రౌఢిన్. ౮౧

ఉ. సాయక కొల్చువారల సుపర్వులఁ జేయుట, వైరులం బలో
పాయసుదర్శనాంచలవిధగ్నులఁ జేయుట, సర్వరాజనా
రాయణుఁ డంట, నిశ్చయమ యంచు సుధీంద్రులు విశ్వమేదినీ
నాయకు సత్ప్రభావకథనంబు మహిన్ బచరింతు రెప్పుడున్. ౮౨

## అపస్మారము

క. భూతావేశక్లమమో-హాతురవికృతులఁ దనర్చి యాత్మలయం బు
ద్భూత మగు నపస్మారము- చేతోగతి నెఱుఁగవలయుఁ జేష్టాదులచేన్. ౮౩

క. భేరీరావంబులు విని-వైరులు కరవాలభైరవభ్రాంతి నప
స్మారులగతిఁ దూగులుచుఁ దల-దీఁగ తెలుంగరు భయోపచితి యుట్టిడియూ. ౮౪

## ఉన్మాదము

క. చిత్తప్రియవనితాహృతిఁ-బిత్తోద్రేకమునఁ గలుగుఁ బృథున్మాదం
బిత్తెఱఁ గెఱుఁగుడు కల్యా-యత్తా చేతన సచేతనాములయందున్. ౮౫

మ. హరిణశ్రేణిఁ గురంగమప్రతతిగా నర్పించి మేఘంబులన్
గరులన్ జేసి ద్రుమంబులన్ భటులఁగాఁ గల్పించి పోరాటకున్

క. చాళుక్యవిశ్వవిభుచే-క్రీడం దనరారుబుధులు చేకొన రతనీ
పాలానీతపటీరను-కాలాగురుచంద్రగంధకోటుల నైనన్. ౧౦౮

## మ ర ణ ము

క. గర శౌనల గో గాయుధ-విరహాదులవలన నగు వివేకింపంగా
మరణము, నయననిమీలన-విరళశ్వాసాంగవర్త్మవిధిఁ దెలియ నగున్. ౧౦౯

క. కరవాలభైరవుని యని-నరి చావక చచ్చినట్లు దయటు పడి యుండెన్
పోరి నూర్పు లణఁచి ఱెప్పలు-మరలింపక గాజువాతి ప్రమాన్పడి భీతిన్. ౧౧౦

## వ్యాధి

క. జ్వరమున నైనను విరహ-జ్వరమున నైనను దనర్చుసంతాపము వి
స్ఫురితవ్యాధి యనంబడు-శరీరసాదాదివిధులఁ జనుఁ దెలియంగన్. ౧౧౧

క. కేలెరియు నొడలు దడివినఁ-గోలంబను లూర్పు లేశఖుల మండిపడున్,
చాళుక్యవిభునిఁ జూచిన-శాలికపరితాప మెన్నఁ బని లేదింకన్. ౧౧౨

## వ్రీడ

క. మెయిచెలువులు పరికించుచు-నయితునిఁ గట్టెదుటఁ జూచి తల వంచినను
ద్వయసాబగు వ్రీడ యగుఁ గుఁడు-నయనచ్ఛాదనదర్శనప్రసరములన్. ౧౧౩

ఉ. వేడుక విశ్వనాథనృపవీరసుందరు బిట్టు చూచి లో
న్తోడన సిగ్గు దట్టముడుఁ గొంగలి ఱెప్పలకప్పలోనఁ జి
ట్టాడెడుమాడ్కి నొప్పఁ గుసుమాయుధశాతముఖుండనందు నా
టాడెడుపువ్వుఁదూపు లన నంగనకుం బరికింపుఁగాయలన్. ౧౧౪

## స్థా యి భా వ ము లు

తే. ఉత్పసంభావితవిభావకానుభావ
సాత్త్వికవ్యభిచారిసంజ్ఞలఁ బెనర్చు
భావములచేత సువ్యక్తి గాంచు నట్టి
వాని రసికులు స్థాయిభావంబు లండ్రు. ౧౧౫

క. గతి హాస శోక క్రోధము-లతులోత్సాహంబు భయసమాఖ్య జుగుప్సా
కృతి విస్మయ శమములు నా-సలతెరఁగ స్థాయిభావసంపద నొందున్. ౧౧౬

## ర తి

క. సంభోగావాప్తికృతా-రంభస్పృహసొంపు పేరు రతి యనఁ బరఁగున్
సంభృతచేతఃకుతుకవి-జృంభణమున నెలుఁగఁ దగు రసికముఖ్యులకున్. ౧౧౭

క. మంగళరూపవిలాసిని-తాంగనఁ దనువిశ్వనాథునందు మెలఁగు నీ
యంగనకౌరిక సతతము-శృంగారస్థానజాతచేష్టాంగక మై. ౧౧౮

## హాసము

క. అతివికృతదర్శనాభా-షితచేష్టాగతులచేతఁ జేపడుహాస
ప్రతిపాదన; మెఱుఁగం దగుఁ-జతురులు చేతోవికారరసరసతచేతన్. ౧౧౯

క. చాళుక్యవిభునిఁ దలఁచిన-హేలలు నీనుమతిచేత నెఱిఁగిరి మనుజుల్
లీలాహాసమునకు నా-వాలము గావించె నింతి వచనోదరమున్. ౧౨౦

## శోకము

క. శోకం బనఁగను మదిలో-నాకస్మికవిపదవాప్తి నడరెడుగుంభ
వ్యాకులత, దాని నెఱుఁగుఁడు-చేకొని రసభేదసిద్ధి చేయుటకొఱకున్. ౧౨౧

క. ఈకోలభృద్భూ నని పెను భోకులచే నణ్ణుఁగడుపుఁ బాలిసినయరినా
రీకులము నెరయ శోకం-బాకారము దాల్చినట్ల యంగిం బులలోన్. ౧౨౨

## రోషము

క. పరకృతధర్షాద్యాహ్వా-రాముల-నగు పగకలుషంబు రోషమనఁగాఁ జేర్చున్
పొరిఁబొరిఁ గనలుచునుండెడు-పగిసున నెఱుఁగంగవలయు భావజ్ఞులకున్.

క. ఏపారిలోన నైనను-నేపారు చళుక్యవిభుని యొకకపురూపా
టోపము దీపించుఁ గడున్-రూపింపఁగఁ గల్పసముదయరుద్రాకృతియై. ౧౨౪

## ఉత్సాహము

క. మత్సరమగ్గనమును ప్రజ-గత్సాంశ రిపును నైనకడిమి నడరు నా
సత్త్వహసప్రయత్నం-బుత్సాహం బనఁగఁ బరఁగు నరు తెలియునదే. ౧౨౫

క. శంకింపక సురవనితా-శంకరు లగువిశ్వవిభుని సమరధటులకున్
బింకముగ మేను లుబ్బెనఁ-గంకణములు విరసి శౌర్యగరిమాల్చ స్థితి. ౧౨౬

## భయము

క. భయ మనఁగఁ బారుషత్వ-వ్యయకరణం బనుచు నంతరంగమునందున్
క్షయమునకు వెఱచు వెఱపది-నియతం బగుచుండుఁ బ్రాణినికరంబులకున్.

క. కరవాలభైరవునికర-కరవాలప్రథిలసాగు గలుగుటనె కదా
పరికింపఁగ నెచ్చటఁ బగ-ధరణీశతమోగుణంబు తలచూప దిలన్. ౧౨౮

## జుగుప్స

క. హేయాపాదకవస్తుని-కాయశ్రవణావలోకకథనంబులచే
నాయత మగురోఁత మది-యేయెడలఁ జుగుప్స యనఁగ నింపులఁ జెలుచున్.

క. ఓరుదములు పెట్టుకొని తుది-పిరుదాగము నింప లేనిబిరుసున్నపులకున్
బరికించి రోయు నని మొన-నరు దగఁ బరగండభైరవాంకుఁడు లీలన్. ౧౩౦

## విస్మయము

క. శ్రవణాలోకాపూర్వ-ప్రవరచమత్కారమైన బంధురకృత్యం
బవని నగు విస్మయం బనఁ-బ్రవీణు లెఱుఁగంగవలయుఁ బ్రచురప్రతిభన్.

క. అసముఁ డగువిశ్వభూవిభు-నసిధారాశీతజలను లరినారీదృ
గ్విసరములఁ దొరఁగుచున్నవి-కసుగందక విస్మయంబు గాదె తలంపన్.

## శమము

క. దూరీకృతసంసారవి-కారము శమ మనఁగ నిగమసారం బై పెం
పారు నది గలిగెనేని వి-చారము గదు నొప్పు నెపుడు చతురుల కెల్లన్.

క. చాళుక్యవిశ్వవిభుఁడు మ-హీలలనాపాలనమున నెసక మెసఁగుచో
నోలి యతీంద్రులు మనముల-నాలవపురుషార్థసరణి ననిచిరి మిగులన్.

మ. ఇది నానావిధభావబోధపటిమం బేరాజు రాజత్కళా
సదనం బై విహరించు నాతఁడుగదా సంగీతసాహిత్యసం
పదత్రోవం జనఁ జాలుఁ, జాలిన భవాపాయంబుఁ దూలించు స
మ్మదలీలన్ గృతకృత్యుఁడై నెగడు సమ్యగ్రాజతేజోనిధీ! ౧౩౫

ఉ. సోమకులాబ్ధిచంద్రుఁడు యశోధవళీకృతదిగ్గజేంద్రుఁ డు
ర్వీమహిళాభిరాముఁడు నవీనభుజాబలరాముఁ డంగనా
రామవసంతుఁ డున్నమితరాజజయంతుఁడు వైరిఘోరసం
గ్రామధనంజయుండు రిపుకాననదావధనంజయుం డిలన్. ౧౩౬

కం. కంఠీరవశూరుఁడు శ్రీ-కంఠపదస్మరణవిగతకల్మషుఁ డసుహృ
త్కాంతగ్రహఖడ్గుఁడు వై-కుంఠపరాక్రముఁడు కదనకోవిదుఁ డెపుడున్. ౧౩౭

## మాలిని

అతులవిభవశక్తిం దక్షసంపన్నచక్రుం
డతిసుగుణగరిష్ఠుం డాత్రవిద్యావరిష్ఠుం
డతినుతతనువిలాసుం డంగనాళీవికాసుం
డితరనృపతిపూజ్యుం డిష్టరాజ్యుండు నిలన్. ౧౩౮

## గద్యము

ఇతిశ్రీసుకుమారమణి చరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోటపెద్దయనామధేయవిరచితం బైన కావ్యా
లంకారచూడామణి యను నలంకారశాస్త్రంబున భావప్ర
పంచప్రకటనసముద్దేశ్యం బనఁ బ్రథమోల్లాసము.

---

# ద్వితీయోల్లాసము

క. శ్రీలుఁడు ప్రణతావనిపతి-మౌళిమణిద్యుతిసమేతమంఘ్రియుఁడు తే
జోలంకారుఁడు ధృతిసుర-శైలుఁడు చాళుక్యవిశ్వజనపాలుఁడిలన్. ౧

శా. శ్రీ నిండారఁగ లోకరక్షకొఱకై సింహించుటంజేసి ల
క్ష్మీనాథుం డనునయ్యుపేంద్రుఁ డిటు లేఁగెన్ గాన నీనాఁటిన
కృష్ణాఖ్యుం డగు విశ్వనాథునకు శృంగారాఢ్యనాథత్వ మెం
తే నొప్పం బ్రబలింప నంచుఁ గవు లుత్ప్రేక్షింతు రెల్లప్పుడున్. ౨

క. కావున నుపేంద్రునకుల-క్ష్మీవనితకు దనయుఁడైన శ్రీవిశ్వేశ
క్ష్మావరునకుఁ బ్రియకరముగ-భావితశృంగారరసముఁ బ్రబలింతుఁ దగన్. ౩

క. ఉక్తవిభావాదులచే-వ్యక్తనవస్థాయిరూపభావంబులు సు
వ్యక్తములై నిజగుణసం-సక్తములై రసము లన రసత్వము నొందున్. ౪

తే. స్థాయిభావంబులకు ననుసారులైన
తద్విభావాదులను రసత్వంబు గలుగఁ
బనిలే దెన్నఁడుఁ బాకసంప్రాప్తిఁ జేసి
తగుఘృతత్వంబు గలుగు నందమున నెపుడు. ౫

క. వినువారికిఁ గనువారికి-ఁ బసరువిభావానుభావ దర్శనమునన్
ఘనరసపోషకములు నాఁ-జనుఁ గవితా నాట్యములఁ బ్రసన్నాకృతులన్. ౬

తే. ప్రౌఢులకుఁ గావ్యములయందుఁ బొందు రసము,
ప్రేక్షకులకు నాట్యములయందుఁ బనరు రసము,
స్ఫుటవిభావానుభావసంఘటనచేత
సాత్త్వికవ్యభిచారిసంసక్తిచేత. ౭

క. రస మారోప్యం బగుటన్-బొసఁగు నాట్యములయందుఁ, బొల్పుగ దత్త
త్ప్రతిసరస్మరణముచేతన్-వెస సామాజికులయందు వేడ్కకు నెలవై. ౮

## శృంగార రసము

క. అతులానందాత్మిక యగు-రతిరొ విభావానుభావరంజనముల సం
వృత యై శృంగారరసా-కృతిఁ జెందు మనోనురాగకీలితగతులన్. ౯

క. ద్వివిధం బగు శృంగారం-బవిరళసంభోగసంభవాత్మకమును నై
తవవిప్రలంభజము నన-యువతిప్రియజనులవలన నుదితం బగుచున్. ౧౦

## సంభోగ శృంగారము

క. అనులాపాలింగన దర్శన చుంబన మోదన ప్రసాధన విధులన్
వనితలుఁ బతులున్ దమలోఁ-జెనయుట సంభోగజనితశృంగార మగున్. ౧౧

మ. లలితస్విన్నకపోల మానసము, హేలాలోల మాలోకనా
వలనం, బుల్లసదంగ ముత్పులకసంవాసంబు, వృత్తస్తన
స్థలి మాల్యావృత, రంజితాధరము లజ్జాహాసభావంబు, నె
చ్చెలి కీసొంపు చళుక్యవిశ్వవిభుఁ డిచ్చెన్ జూచితే నిచ్చలున్. ౧౨

తే. పంచవిధభావకలితప్రపంచ మెల్లఁ
గలసి శృంగారరసపోషకంబ యండ్రు;
క్రమముతోడఁ బ్రయోగసంగతి యెఱింగి
కావ్యనాటకములఁ గూర్పఁ గనుట యొప్పు. ౧౩

తే. ఇందు శృంగారరసమును నెసఁగఁ జేయు
వివిధభావాదికక్రియావింశతియును
నెఱుఁగఁబడు భావకుల మది కేర్పడంగఁ
గవిత లక్షణలక్ష్యప్రకారములను. ౧౪

క. అంగనలకు యౌవనగుణ-శృంగారరసోపపన్నచేష్టలు నానా
భంగులయి యొప్పు నిరువది-యింగితములఁ దత్ప్రకార మెఱుఁగఁగవలయున్, ౧౫

క. ఆవింశతిలో భావము-హావము హేలాభిధయును ననియెడు మూఁడున్
భావింప నంగజాతము, లావిధ మెఱుఁగంగవలయు నయ్యాయి గతులన్. ౧౬

తే. అలరు శోభయుఁ గాంతి దీప్తులును మధుర
తయుఁ బ్రగల్భత్వమును సదౌదార్యతయును
ధీరతయు నాఁగఁ జేర్చిన తెఱఁగు లేడు
పరఁగు సతుల కయత్నసంభవము లగుచు. ౧౭

తే. చెలఁగు లీలావిలాస విచ్ఛిత్తి విభ్ర
మాహ్వయంబులు గిలకించితాభిధంబుఁ
గొగలు మోట్టాయితంబులు గుట్టమితము
నెసఁగు బిబ్బోక లలిత విహృతులు వరుస. ౧౮

క. పదియును నైసర్గికములు-విదితము లన్నియునుగూడి వింశతి యయ్యెన్;
వదలక తల్లక్షణములఁ-దదుదాహరణములు నెఱుఁగఁదగుఁ దజ్జ్ఞులకున్ ౧౯

## భావము

క. అతినిర్వికారచేతో-గతవృత్తివిశేష మరయఁగా సత్త్వము, త
త్ప్రతిపాద్యక్రియ భావము-సతతాలంకారకారి, చనుఁ దెలియంగన్. ౨౦

ఉ. ఆలిజనోపభోగవచనార్థములం జెవిఁ బెట్టి, సిగ్గుతోఁ
గ్రాలెడువింతచూపు కడగన్నులయం దిడి, మున్నుపోలె నై
మాళపుటాటకున్ జొరదు మారుఁడు గల్గుట లో నెఱింగి, యీ
బాల చళుక్యవిశ్వజనపాలునిఁ జూచుట నిక్కువంబ పో, ౨౧

### హావము

క. భావము యించుక వదన-వ్యావళితవికాస మైన హావము, శృంగా
రావిర్భావనివాసము;- భ్రూవల్లీ మందచలనమున నెఱుఁగఁబడున్. ౨౨

చ. అరవిరితమ్మిలో వెడలునమ్మధుపమ్ములఁ గ్రేణి సేయుచున్
గరము విలోచనాంతములఁ గ్రాలెడుమాధ్యుల దండడించున
మ్మరుఁ డెడకాఁడుగా నొకతె మక్కువఁ గన్గొనె సిగ్గు ముందఱన్
దిరుగఁ జళుక్యవిశ్వనృపతిన్ జెలిచాటుననుండి వేడుకన్. ౨౩

### హేల

క. హావము సువ్యక్తి విలా-సావహ మగునేని హేల యనఁగాఁ బరఁగున్.
భావింపఁగ శృంగారము-నై వాలుచు నాఁగఁబారఁదనరుటచేతన్. ౨౪

శా. భ్రూతారావలనంబు ఘర్మపులకాభోగంబు రాగంబునున్
జేతోజాతుఁడు తన్ను జోకటఁ బ్రశంసింపన్ బ్రసన్నోదిత
ప్రీతిన్ జూచెఁ బయోజనేత్ర కుతుకశ్రీపుష్టదృష్టిక్రియా
చాతుర్యంబులు చంద్రికన్ దెగడఁగాఁ జాళుక్యవిశ్వేశ్వరున్. ౨౫

ఈమూఁడును అంగసముద్భవములు.

### శోభ

తే. రూప యౌవన లావణ్యరూఢి సొబగు
సుందరుల కెల్ల గనికులు శోభ యండ్రు;
కలరు నన్యోన్యతుల్యగాత్రములయందుఁ
గడఁగి పెట్టని తొడవయి కానఁబడుచు. ౨౬

ఉ. కోరి చళుక్యనాథుకడకున్ జనునింతికి రత్నకాంచనా
కారము లైనభూషణనికాయములం దడవంగ నేల; యీ
సూరెలఁ గ్రాలునంగములసోయగ మెంతకు లేదు చూడుఁడా
మారునిపూవుఁదూపులకు మాఱటరూప మనంగ నొప్పెడున్. ౨౭

### కాంతి

క. ఆశోభయ రంజనగుణ - పేశలయై మించుగలిగి పెరసిన విద్యా
కౌశలులు కాంతి యండ్రు ప్ర-కాశప్రతిభాప్తి నెఱుఁగఁగాఁ దగు బుద్ధిన్. ౨౮

చ. కలపపుఁబూఁతలోన వెలిఁ గ్రమ్ముచుఁ బయ్యెదచీరమీఁద ను
జ్జ్వల యగునంగకాంతి గరువంపునడం బొలుపారెఁ జూచితే
పొలఁతి కుపేంద్రపుత్త్రిపరిభోగమతిన్ జనుచోట నెంతయున్
బలుచనివారిదంబు వెలిఁబర్వు శశిప్రభతోడ సాటియై. ౨౯

### దీప్తి

క. శస్త మగుకాంతికల్పిత - విస్తారము దీప్తి యనఁగ విలసిల్లు శరీ
రస్తుత గభస్తివిభవ ని-రస్తాలంకారకరణ యగు సతి కొప్పున్. ౩౦

మ. బలవద్విశ్వనరేంద్రరుద్రధాటి మదిలో భావించి యుగ్రాచలా
చలితధ్వాంతగుహాంతరంబులఁ బ్రవేశం బొప్పఁ గావింతు ర
స్ఖలితాంఘ్రిప్రసరంబులన్ బ్రియవధూకాలీకభూరిప్రభా
వలనంబుల్ కరదీపికావళులుగా వైరిక్ష్మావల్లభుల్. ౩౧

## మాధుర్యము

క. పొగ డొందనివస్తువులోఁ - దగిలియుఁగడు హృద్య మగుటఁ దా మాధుర్యం
బగు నప్రసిద్ధమండన - లగనంబున నెఱుఁగఁ దగు విలాసకరం బై. ౩౨

ఉ. లాలితసింధువారముకురంబుల పేరులు కర్ణకీలితా
లోలశిరీషపుష్పములు లోధ్రరజంబును మేనఁ జెంది సు
శ్రీలఁ దనర్పఁ గ్రొవ్విరులఁ జేసినకానుక యిచ్చి సొంపుతో
బాల చళుక్యవిశ్వజనపాలుని మ్రోల వెలింగె నిగ్గునన్. ౩౩

## ప్రాగల్భ్యము

క. ప్రేక్షోదితభయముక్తిన్ దగ - వీకుట ప్రాగల్భ్య మనఁగ వెలఁగుల కొనరున్
ప్రౌఢతనం బై విద్యా - మేడితసంక్రీడనముల మెలఁగెడు నెడలన్. ౩౪

మ. ఇల విశ్వేశ్వరచక్రవర్తిసభలో నీముగ్ధ భావింప ని
శ్చలలజ్జావతి యయ్యు నుం దగు నెడన్ సంగీతసాహిత్యవి
ద్యల విద్వన్నుతి కెక్కినట్టిదిగదా తర్కింప నత్యాశ్రయ
స్థలదత్యాదృతసిద్ధులన్ విధకళాచాతుర్య మొప్పం జూపిమా. ౩౫

## ఔదార్యము

క. లలి సురతాయాసాదుల - నలసియు విలసిల్లు కడఁక యౌదార్య మగున్
లలనకుఁ దగ మగుడని వే - డ్కల నొసఁగున్ దయితకౌతుకప్రదచేష్టన్. ౩౬

ఉ. కన్నులచెన్ను హల్లకవికాసములోఁ బురణింప, బింకపున్
జన్నులమీఁది పెంజెమట సాలమి నెన్న, మృదుప్రచారము
త్పన్నపుసోలముం దెలుప, భామకు లోఁ దమకం బొకింతయున్
సన్నము గాక విశ్వనరనాథునిపైఁ దగులంబు చూపెడున్. ౩౭

ఈయాఱునొకటియు అయత్నసంభవములు.

## ధైర్యము

క. రూపింపఁ జిత్తసంభృత-చాపల్యముచేతఁ బుష్పచాపాస్త్రములచే
నోపమిక యుండుటాలిమి - చూపట్టును ధైర్యమనఁగ సుస్థిరబుద్ధిన్. ౩౮

మ. పతి విశ్వేశుఁడు నాకు; నవ్విభుఁడు చెప్పన్ సర్వలోకాశ్రయుం
డతఁ డేలాగుదలంచినన్ దలఁపనీ; ప్రాణంబు నిత్యంబె? మా
రుత మాకంద మనోజ మాధవ మహారోషంబు సైరింప సం
స్తుతి సామాన్యమె? మాన మాభరణమై శోభిల్లదే యుల్లెడన్? ౩౯

లీల

క. గతివచనాలోకన మి - త్రితచేష్టలఁ బ్రియుని ననుకరించుటయ కదా
మతిఁ దలఁప లీల యనఁ జను - సతతమనోరంజనప్రసాదం బగుచున్. ౪౦

ఉ. చేరి చళుక్యవల్లభుని చెప్పినయట్లన సేయు నుత్తమ
స్త్రీరమణీసరస్వతులచేఁతలు చిత్రము; లన్నరేంద్రుఁ డె
వ్వారికి నేపదార్థము లవారిగ నిమ్మను నట్లు యిస్తు; ర
న్నారులకున్ బ్రియానుకరణం బుయధర్మము కాదె యెప్పుడున్. ౪౧

విలాసము

క. బిట్టు నిజప్రియు నంగన - కట్టెదురన్ జూచి యంగకంబులపోఁదన్
బుట్టించినయొయ్యారము - చిట్టాడుట యది విలాసచిహ్నం బరయన్. ౪౨

ఉ. పయ్యెదఁ జక్కఁ దీర్చు కరపల్లవముం, గడమూఁడ్కలోన నిం
పయ్యెడు సిగ్గుఁ, గుంతలము లల్లన వీనులపొంతఁ జేర్చిన
త్రియ్యపుఁ జెయ్వు, మన్మథుని తేజపుబీజము లై తనర్పఁ గాఁ
దొయ్యలి చూచెఁ గోరికలు దొత్రిల విశ్వనరేంద్రచంద్రునిన్. ౪౩

విచ్ఛిత్తి

క. సురతాంగులయెడ నల్పా - భరణంబై మెఱయుచున్న భావము లగ కుం
దరులకు విచ్ఛిత్తి యనం - బరఁగు నిజప్రథమాగసవిభాసక మగుచున్. ౪౪

ఉ. మంచివిభూషణావళులు మాని నవాంశుకశాటకంబునుం
గొంచెపుహారముల్ చెలువుఁ గోరి ధరించినయింతి కామినీ
పంచశరాంకు విశ్వజనపాలునిఁ జూచి తనర్చెఁ జూడ్కికిన్
బంచషపల్లవప్రసవభాసిని యయ్యెడు తీఁగచాడ్పునన్. ౪౫

విభ్రమము

క. కడుఁ గౌతుకాతిశయమునఁ-దొడవులుఁ బూఁతలును దప్పఁ దొడుగుటచే న
య్యెడు సంభ్రమంబు విభ్రమ - మడరుం బ్రియదర్శనాదులం దెల్లపుడున్. ౪౬

మ. ఒకనేత్రంబునఁ గజ్జలంబు నిడి వేఱొక్కంట సర్పింప నొ
ల్లక యొక్కర్తు జయాంగనాపరిణయాలంకారవిశ్వక్షమా
పకునిం జూచె విలోచనప్రభలు విభ్రాజిల్ల నిద్దంబులై
వికచేందీవరపద్మతోరణగతిన్ విస్ఫూర్తి యొప్పారుచున్. ౪౭

## కిలకించితము

క. లలనునిదెసఁ బ్రియ కచ్చెడు – నలుకయు నెలనగవు గద్గదాలాపములున్
గలరుదితము ననియొడ్డనివి - కిలకించిత్త మనఁగ, బరఁగుఁ గేళిగతులన్. ౪౮

చ. అలుగు, విలోకనాంతముల నశ్రువులం బరఁగించు, చిన్నన
వ్వులు చిలికించి చేరి చనవుం దగవుం దలు కొత్త గద్గదో
క్తులు నిగిడించు, నిక్కముననుం బులకించుఁ జెమర్చుఁ, జూడుఁ డ
న్నెలఁత విశ్వనాథునుపయి నెక్కొనుకూరిమిచందమెట్టిదో! ౪౯

## మోట్టాయితము

క. పతికిం దనపైఁ దలఁప - ద్భుత మని విని వనితమేను పొంగుట మోట్టా
యిత మండ్రు భావసూచన - గతులం దెలియంగవలయుఁ గాముకు లెల్లన్. ౫౦

ము. ప్రమదం బారఁ జళుక్యవిశ్వవిభుకుంభద్దానధారాజలా
ఘుముచేఁ బొంగుచు నంబరాభరణరంగత్కీర్తులం దాల్చుచున్
కుమనోవిస్ఫురదుత్తమాంగరుచులం జూపట్టు భూదేవి ని
త్యము నాథుం డభిగామి యైన వలదా తత్తద్విజృంభక్రియల్. ౫౧

## కుట్టమితము

క. పరిరంభణాధరక్షత - పరిపీడాదులసుఖంబు పటుదుఃఖముగా
దురపిల్లుట కుట్టమితం; - బరయఁగ నుపచారవిధుల నగుఁ దెలియంగన్. ౫౨

మ. వనితా, నేఁడు చళుక్యనాథుని మరున్ వారించుటన్ బీవర
స్తనకుంభాధరబింబమధ్యమున నా సౌగంధిక శ్రేణిచేఁ
జన నర్పించెదు నీవు నీసుభగతాసంధాత విశ్వేశ్వరుం
డనియో కాక యుపేంద్రపుత్త్రుఁ డనియో యాచందముం జెప్పుమా. ౫౩

## బిబ్బోకము

క. రాగమున నొండె, గర్వ - భోగంబున నొండె, మొఱఁగిపోవుట నొండెన్,
వేగాదరణము పతిపై - సాగమి బిబ్బోక మనఁగఁ జను నంగనకున్. ౫౪

ఉ. బుద్ధిమహీరమాసతులపొత్తున నుండక సత్ప్రతాపసం
బద్ధసఖిత్వ మొప్పఁ జని భాసురకీర్తి దిగంతరంబులన్
వృద్ధగుణానురక్తుఁ డని విశ్వనృపాలు నుతించు నెప్పుడున్
శుద్ధపతివ్రతాత్మికల సోఁకునె యెందు ననాదరక్రియల్. ౫౫

## లలితము

క. వాసితవర్తనమున సౌ - వకవర్తనమునను రచితవచనములరయుడన్
సుకుమారాంగన్యాసము - ప్రకటితమగు లలిత మండ్రు భావజ్ఞు లిలన్. ౫౬

చ. కనుఁగొన నొప్పు కంఠమున గానముఁ, బాణులఁ మంజులార్థక
ల్పనమును, దృగ్విశేషమున భావములుం, జరణక్రమంబులన్
దలరు లయప్రపూర్ణమగు తాళముఁ, గ్రాలఁగఁ బాత్ర యోర్తు రం
జనముగ నాడె నింపు వెదచల్లుచు విశ్వనృపాలుసన్నిధిన్. ౫౪

## విహృతి

క. చెప్పఁ దగుమాట సిగ్గునఁ-జెప్పక వెడ గప్పిపుచ్చుచేష్టాదులచే
నొప్పునది విహృతి, రసికుల-కప్పుడు తగు దెలియ నింగితాకారములన్. ౫౮

ఉ. డెందము విన్న నయ్యె, నొకడిల్లఁదనం బొడఁగూడె మోముపై,
ముందటిలాగు గాఁ దొడలు, ముచ్చటమాటల కాస చేసె, దీ
చందముఁ జెప్ప మన్న వెడసన్నపుసిగ్గున మ్రొగ్గమోడ్కిచే
సుందరి చెప్పె విశ్వవిభుఁ జూచిన కాముఁడు తన్ను సోఁకుటల్. ౫౯

ఈపదియును సాత్త్వికములు.

## విప్రలంభశృంగారము

క. లలితశ్రవణాలోకన-కల హానూయాప్రవాసకలనల చేతన్
గలిగెడు దశావిశేషము-చెలువారఁగ విప్రలంభశృంగారమగున్. ౬౦

సీ. అదియుఁ జక్షుఃప్రీతి యన, నంతఁ జిత్తసంగంబు నా, మఱియు సంకల్ప మనఁగ,
నటఁ బ్రలాపంబు నా, నవల జాగర మన, నటుమీఁదఁ గార్శ్యసమాఖ్య మనఁగ
వెండియు విషయవిద్వేషంబు నాఁ ద్రపాసంత్యక్తి మనఁగ, సంజ్వర మనంగ,
నున్మాద మనఁగ- మూర్ఛాపగమం బన, మరణంబు నా, నిట్లు మానినులకు

తే. ననుగతద్వాదశావస్థ మై తనర్చుఁ;
బదియ దశలంద్రు కొందఱు ప్రౌఢజనులు;
పరఁగు లక్షణములు నుదాహరణములును
వరుసఁ జెప్పెదఁ దెలియంగవలయు నిందు. ౬౧

## చక్షుఃప్రీతి

క. చక్షుఃప్రీతి యనం జను-నక్షీణ విలాసగుణసమగ్రుని శ్రీలన్
వీక్షించుకుతుక; మది మరు-నిక్షుధనుర్దండమునకు నెక్కిక్కించున్. ౬౨

ఉ. ఉల్లముఁ జూపుచూపు, లన నొల్లనియగ్గలు, విచ్చుసిగ్గులున్
బెల్లుగఁ జేరుఁబోఁడికలుఁ, బెక్కులు మక్కువచక్కడంబులున్,
మెల్లనె జాఱుపయ్యెదయు, మిం చొలయం బులకించు మేను, రం
జిల్లఁ జెలువ విశ్వనృపశేఖరుఁ గన్గొనుపువ్వుఁబోఁడికిన్. ౬౩

## చిత్తసంగము

క. చిత్తాసంగం బన నా-యత్తం బగుఁ బ్రతికృతి ప్రయత్నాదిసుఖో
త్పత్తికి నెల వగుచింతన, మత్తఱిఁగు మనోవికీర్ణమై విలసిల్లున్. ౬౪

ఉ. మానినిమాపులం దొరలి మానుగ విశ్వనృపాలుఁ డేపులో
నానఁగఁ గారుకొన్న మనమా మన మారట నాదరింప మిం
పూన నుపేంద్రపుత్త్రుఁ డతఁ డున్నపదం బని కౌఁద యక్కునన్
నూనపటీరపంకములు సొం పలరారెడు సారెసారెకున్. ౬౫

## సంకల్పము

క. చిత్తములో ననిశంబును-మొత్తము లగుతలఁపుఁగూటములఁ బొందెడిచో
నొత్తిల్లు చెమరుపులకల-యొత్తుడు సంకల్పదశను నొనరినచిన్నెల్. ౬౬

చ. అకట తలంచి చొక్కుఁదగ దక్కులయిక్కుల నున్న నున్నగా
లికి నెల వైనపువ్వుఁబొదరే పొదరేపులకింప నేల మి
న్నక యెలనాఁగ నాగరజనప్రియుఁ డయ్యెడు విశ్వనాథు శ
య్యకుఁ జనవచ్చు వచ్చుమరునమ్ములు వమ్ములు చేసె నంతటన్. ౬౭

## ప్రలాపము

క. ఇంతికిఁ బ్రలాప మనఁగాఁ-గాంతగుణాలాపకథనకల్పన; యదియున్
సంతసము చేయు నుచితా-ర్థాంతరరచనావిశేషణాదులచేతన్. ౬౮

ఉ. ఈగతిఁ జాతురే! తగులరే తగులే తగులేము సీధరన్ ?
రాగముఁ దైనవిశ్వనృపరాకయ పో తగురాక నాకు, లో
లో గమి గొన్నమాపుఁదొగలున్ దగ తై విలసిల్లు ; దానిచే
సాగెడు నన్నరేంద్రునకు సద్ద్విజరాజకళాధరత్వమున్. ౬౯

## జాగరము

క. వల్లభుఁ డెట్లును నబ్బమి-మొల్లం బనుచింతఁ గన్ను మోడ్పక మదిలో
నల్లల నుడుకుచు నుండెడు-తల్లడ మది జాగరాభిధానం బయ్యెన్. ౭౦

చ. నెలగలమేలు లేలు చెలినిద్దరకుం బగ లయ్యెఁ, బెల్లుబె
ల్లులఁ గొనువేడ్క లీనుపగలుం బగ లయ్యెను, దాన దీనిఁ గం
గలువలు కన్ను లంటయును దైవడి విశ్వనృపాలచంద్రు నిం
పలరఁగఁ జూచుటం గువలయప్రియుఁ డంటయు నిక్క మిక్కడన్. ౭౧

## తనుకార్శ్యము

క. అంగనకు నెట్లు ప్రియువిర-హంగిలి యౌరు మై నఁ గామసంతాపముచే
నంగములు డస్సిపోయిన-భంగి తనుత్వంబు నాఁగఁ బరగుం జూడన్. ౭౨

చ. అటమట మేల? యేలికొను మంగన; నంగదభంగు లయ్యె న
క్కట కటకంబు లింతి! కడకత్తెలు నీకడ నాడి పాడిరే
విటతతివింటకుంపడనువింటఁ దొరంగుట నీగుణంబు లిం
తటఁ జల మేది మేదినిఁ బొదల్పుము విశ్వనృపాలమన్మథా! ౬౩

## విషయద్వేషము

క. సద్వస్తువు లొల్లక విల-సద్విద్యావిహరణంబు చాలించి వివే
కద్వారము గానమి విష-యద్వేషము తెలియవలయు నప్రీతిమెయిన్. ౬౪

ఉ. నీరనురాగ ముప్పతిల నీరమణీ రమణీజయంతుపైఁ
గూరిమిఁ గూరి మిక్కుటపుఁగోరిక పేరికరత్తఁ బల్కు తిం
పార నపారధీరగుణుఁ డారయ నాపతి విశ్వనాథుఁ డా
మారుఁడు మారుతంబు నెలమావియుఁ గ్రించులు మించు లేటికిన్. ౬౫

## త్రపానాశము

క. పొలఁతుక నిజదయితుని కై-కలమానధనంబు చాల గజిబిజి గాఁ దా
నిలువడియును గులగతియును-దలఁపమికు త్రపావినాశదశ యనఁ బరఁగున్ ౬౬

ఉ. క్రొన్ననగొన్న సిగ్గుదలగొన్న తలంపు నలంపకున్న నీ
నన్నుఁ జళుక్యవిశ్వ నరనాథుఁడు మన్ననలం బొదల్చి నీ
పన్నిదఁగూడినం జెలుల పాటొసఁగొ టటుగాక యొట్లు నే
వెన్నెల నిట్టు రేట్టు నవవిట్టు నదల్పుఁ జికొదిసేసలన్. ౬౭

## సంజ్వరము

క. శీతకరమదనకృతమును-శీతలకరశోపచారజృంభితమును నై
యేతెంచుతాపభర మది- నాతికి సంజ్వర మనంగ నలు వెడలించున్. ౬౮

ఉ. వేచని విశ్వనాథు గుణవిశ్రుతుఁ దోకొని వత్తు మంచు ము
న్నీ చెలు లెల్ల నన్ను పలు కెల్లగఁ జూచితి నో మి దేల నా
కీ చలిమందు లేమిటికి నీవల నావలఁ దావలంబు నై
త్రోచి మొగంబుపైఁ దిరుగుతు మ్మెద యూరడుఁ గాక యింతటన్. ౬౯

## మోహము

క. విరహవశవికలచేత-శ్చరితోన్మాదంబు మోహసంజ్ఞం బగయున్,
సారిది నచేలనచేతన-పరిచితి సరి యగుట నెఱుఁగఁబడుఁ జతురులకున్. ౭౦

ఉ. ఆతురపాటులో నిలువుటద్దముదీప్తులు మాటుసేయుచో
నాతరుణీలలామ మనయాసలు గన్గొని 'వట్టిజాలి యీ
గోతుల కేల కేలఁ గొని క్రొన్నెల వెన్నెల మాయ యొప్పనే
యాతత' నన్న చిన్నిపలు కెన్నరు విశ్వనృపాలుసన్నిధిన్. ౭౧

## మూర్ఛ

క. అవయవము నెమ్మనమునఁ బా-యనిసొమ్ముల పేరు మూర్ఛ యనఁగాఁ బరఁగున్,
దనరెడు నింద్రియగుణవ-ర్తన వైకల్యమున నెఱుఁగఁ దగుఁ దజ్జ్ఞులకున్. ౭౨

చ. మృదులత నెన్ని యన్నమును మెచ్చఁడు విశ్వనరేంద్రశేఖరుం
డది యొకతేఁటిజోటి నడయాడెడు నింతియ యింతిమోమునన్
వదలక నోమి నోమి యదనం గడ గానఁగ లేమ లేమకై
మదిఁ బడదే కదే కరుణ పూరుఁడు మారుఁడు కాఁడె యెప్పుడున్. ౭౩

## ద్వాదశదశ

క. ద్వాదశదశయుం గలుగుఁ ద-లోదరికిం బ్రియుఁడు బహువిధోపాయములన్
సాదరుఁడు గాక తక్కి-న నాదశ యున్నట్లు చెప్పి రార్యులు కృతులన్. ౭౪

చ. తలిరులు తమ్ములుం గలువదండలు మాటికిఁ బాటి సేసె నా
వల వలరాజుతూపు లనవచ్చుట యెచ్చటఁ దోఁప దక్కునన్
జిలికిన చందనద్రవము చిక్కఁగ నిక్కడ కేఁగుదెంచితిన్
జలముల మేల మేల సతిచక్కటి విశ్వనృపాల, యుత్తటిన్. ౭౫

చ. పొలఁతుక చూచురా యబలపోకలు తోకలు విచ్చి, చన్నుఁగ్రే
వలఁ బలుమాఱు గప్పెడు, నవస్మిత మొప్పఁగ దర్పణంబులోఁ
బొలుచులలాటరేఖ గని బొట్టిడి సోలెడుఁ, గ్రాలువాలుఁజూ
పుల మరుతూపులం దెగడఁ బూనెడు విశ్వనృపాలుప్రాపునన్. ౭౬

ఇది విప్రలంభశృంగారద్వాదశకము.

క. ఇప్పుడు చెప్పిన వన్నియు-నొప్పగు శృంగారరసమునకుపకరణము లై
చెప్పఁబడుచుండుఁ బలుకుల-చొప్పున భావములు గలుగఁ జూపఁగవలయున్.

## న వ ర స ము లు

క. క్రమమున శృంగారము హా-స్యముఁ గరుణము రౌద్ర వీర సంజ్ఞంబులు ఘో-
రము బీభత్సము నద్భుత-సమాఖ్య శాంతములుఁ ననఁగఁ జను నవరసముల్. ౭౭

తే. అందు శృంగారరసవిశేషాంతరములు
వితతములు గాఁగ మున్నె భాషితము లయ్యె
నింక హాస్యాదిరసముల నెనిమిదింటి
వరుసఁ జెప్పెదఁ దెలియంగవలయుఁ గవులు. ౭౯

## హాస్యము

క. దృష్టవిభావాదులచేఁ-బుష్టం బగుహాస మందముగ హాస్య మగున్,
శిష్టాలంబన మరయ వి-శిష్టవిదూషకజనాదిచేష్టిత మగుచున్. ౮౦

ఉ. కల్పకుజంబులం దెగడుఁ, గామగవిం బ్రహసించు, వట్టిసం
కల్పపురాయి నవ్వు, శిబి కర్ణులచాగము నేవగించు, న

స్వల్పవదాన్యవిశ్వజనవల్లభుచే సిరి నొందు యుత్కరా
ట్కల్పవిమానకప్రతతి గర్వితరాజసభాంతరంబులన్. ౯౧

తే. రూపభాషితవికృతు లుద్దీపనములు
ముఖవికాసాదు లనుభావములు దలంప
నశ్రువైవర్ణ్య విస్వరతాదికములు
సాత్త్వికంబులు నాఁగ హాస్యమున కమరు ౯౨

తే. అశ్రుసంపాత చపలతా హర్షణాదు
లడరు సంచారిభావంబు లనుసరించి;

## హాస్యభేదములు

హాస్య మాఱుప్రకారంబు లై తనర్చు;
తత్స్వరూపంబు లెఱిఁగింతుఁ దగు నెఱుంగ. ౯౩

క. స్మితమును హసితము నను వి-స్మితమును నుత్తమము నాఁగ దీపించుఁ దగన్;
స్మితము వికాసికపోలము-మితదర్శితదశన మైన మెఱయు హసిత మై. ౯౪

క. విహసితమును బ్రహసితము - న్నిఁక రెండును మధ్యమములు మఱిఁ బరికింపన్;
విహసితము మృదులనినదము - ప్రహసితము శిరఃప్రకంపపరిమిత మరయన్. ౯౫

క. అపహసితము నతిహసితము - నెప్పుడును నధమంబు లనఁగ నేపారు; శిర
శ్చపలము నశ్రుయుతంబును - నపహసితము, మేను గదల నతిహసిత మగున్. ౯౬

## కరుణము

క. శోకము విభావముఖభా-వాకలనము చేతఁ గరుణ మను రస మయ్యెన్;
శోకాతిన యతులితవిప-దాకులితాలంబభావ మనఁగాఁ బరఁగున్. ౯౭

మ. తనరం బుత్త్రకళత్రమిత్రమిళితాగారస్వాంతుఁ డై శాత్రవుం
డని భర్త్రిన్ బ్రణమిల్లినన్ బ్రకటరాజ్యశ్రీలు ప్రాపించుఁ జ
క్కని విశ్వేశ్వరచక్రవర్తికరుణన్; గావున్న నవ్వైరి మా
త్సర్యనిచ్ఛందంబునఁ బాంధ్యభంగి ప్రవిశస్త్రీశుభావంబునన్
జను దీనుం డయి హీనుఁ డై కృపణుఁ డై సంతప్తుఁ డై లుప్తుఁ డై. ౯౮

తే. అనిశకృతఖేదపర్యటనాదికములు
వరుస నుద్దీపనవిభావపరికరములు;
రూక్ష పరిదేవన శ్వాస రోదనములు
పరఁగు ననుభావములు నాఁగఁ గరుణమునకు. ౯౯

తే. స్తంభ వైస్వర్య బాష్పము లా సాత్త్వికములు;
మరణ సంభ్రమ దీనతో న్మాదములును
జాడ్యచింతాదులును నపస్మారగతియుఁ
బటువిషాదంబు సంచారిభావదశలు. ౧౦౦

## రౌద్రము

క. క్రోధము రౌద్రరసం బగు-సాధువిభావాదికముల సంపుష్టం బై;
ద్వైధం బగు మాత్సర్య వి-రోధంబులఁ; దెలియఁ దగు నిరూపణవిధులన్. ౧౦౧

## మాత్సర్యరౌద్రము

మ. అని రోషించిన వీరభద్రుకరణి న్వ్యాపించుఁ, బ్రాపించి చ
య్యన రుద్రోద్ధతిఁ జెందుఁ, జెంది వికటోగ్రాటోపమున్ జూపుఁ, జూ
పి నటత్త్ర్యంబకలీలఁ బేర్చుఁ, బిదపన్ భీమాకృతిన్ జేకొనున్;
బను నే మార్గాన మత్సరాహితులకుం జాళుక్యవిశ్వేశ్వరున్. ౧౦౨

## విద్వేషరౌద్రము

శా. దృక్కేళిం గరవాలభైరవుఁడు విద్వేషించి విద్వేషులన్
జెక్కున్, జక్కడుచున్, బలంబు నెఱపుం, జెండాడు, ఖండించు, ను
ద్రేకించుం, బడవైచు, నెంచుఁ, బొడ పూయించున్, బిశాచావలిం
జొక్కించు న్భటఘోటకామిషకృతస్థూలోపహారంబులన్. ౧౦౩

క. క్రమమున మాత్సర్యద్వే-షము లాలంబన మనంగఁ జనుఁ, దద్భాషా
సముచితచేష్టాదికములు-గమనీయోద్దీపనములు రౌద్రంబునకున్. ౧౦౪

క. అనుభావంబులు వికృతన-యనరాగాధరవికంప నాదులు; ఘర్మ
స్వన గద్గద వైవర్ణ్య చ-లనములు సాత్త్వికము లంద్రు లక్షణవేదుల్. ౧౦౫

క. అయుత మద చాపల్యా-సూయా గర్వములు హర్ష సులభోత్సాహ
స్థేమాభావోగ్రతలును-బాయక సంచారు లనెడుభావము లరయన్. ౧౦౬

## వీరము

క. విహితవిభావాదులచేఁ-బ్రహితోత్సాహంబ వీరరస మనఁ బరఁగున్,
బహువితరణకరుణారణ-మహిమంబులఁ ద్రివిధ మగుచు మలయుం గృతులన్.

## దానవీరము

క. అతివితరణశూరతచే-నతులబహిఃప్రాణమైనయర్థము నర్థి
ప్రతతికి నొసఁగెడుసద్గుణ-చతురత యిల దానవీరసంజ్ఞం బడయున్. ౧౦౭

శా. అల్పార్థిం బొడ చూచినంతటనె విశ్వాధీశ్వరుం డిచ్చు సం
కల్పార్థంబులకంటె నర్థము నసంఖ్యాకంబుగా నున్నమ
త్కల్పానోకహకామధేనువులకుం గల్పించు జల్పాకవా
క్స్వల్పఖ్యాతి నడంచి యల్పమని యౌదార్యం బవార్యంబుగన్. ౧౦౮

## దయావీరము

క. అసువిలయంబున నైనను-బస గల్గ నుదారసారభాషాదుల సా
హస రచనయు కరుణాత్మక- రసవీరం బనఁగఁ బరఁగు రసికోత్సవమై. ౧౧౦

చ. చతురచళుక్యనాయకుని చారుతర త్త్రరవారిధార న
ద్భుతపద మొంద వల్లభుఁడు పోయెడుఁ బోడనె కూడఁ బోయెదన్,
సుతు లనిశ స్తనంధయులు సుస్థిని దాదికిఁ జెప్పి ప్రజ్వల
చ్చితిశిఖియంకపీఠమును జెందె నరాతివధూటి పోరిలోన్. ౧౧౧

## యుద్ధవీరము

క. పేరుకొని పోరిలోన న-పారపరాక్రమము నుభయబలములు ప్రోగన్
దోరంబుగ విహరించు ను-దారత గణవీర మనఁగఁ దనరుం గృతులన్. ౧౧౨

మ. అరుదారం బరగండభైరవుఁడు వీరాకారుఁ డైద్రైరిభూ
వరుఁ ద్రుండించి ఘృతాచికిం బ్రియునిగా వావించు, విద్వేషిము
ష్కరు దూలించి తిలోత్తమావిటునిఁ గాఁ గల్పించు, నత్యంతమ
త్సరు రంభారమణీయుఁ జేయు ననిచే సంగ్రామరంగంబునన్. ౧౧౩

ఆ. దానవీరమునకుఁ దగుపాత్రములు, దయా
వీరమునకు దీనపూరుషుండు,
యుద్ధవీరమునకు బద్ధవైరంబు నా
లంబనములు భూతలంబునందు. ౧౧౪

క. చూన స్తవసంబులుఁ బలు-దీనాలాపములు సమగదృప్తభటాహ్వా
న్వానంబులు వరుసను సం-స్థానోద్దీపన విభావసంఘము లరయన్. ౧౧౫

ఆ. పటుముఖప్రసాదబాష్పశస్త్రాదులు
వరుసఁ దదనుభావవర్గ మండ్రు;
సాత్త్వికములు పులకసంఘాత వైవర్ణ్య
ఘర్మబిందువితతి క్రమముతోడ. ౧౧౬

క. క్షితి దానదయారణ సం-గతులకు సంచారికములు గర్వస్థైర్య
కృతి హర్షంబులు మొదలగు వితతయథోచితనియోగవిధి నెలుఁగఁ దగున్.

## భయానకము

క. ఉక్తవిభావాదులఁ బ్ర-వ్యక్తం బగుభయమయగు భయానక మహిలో
ద్రిక్తవ్యాఘ్రాదులు ని-రిక్తాలంబనము లనఁగ నియతము లయ్యెన్. ౧౧౭

చ. వితతభయానకం బయినవిశ్వనృపాలుపతాకపోలె మ
త్పతియు వరాహలాంఛనము దాల్చిన నున్నతి కెక్కె దండభా
సతయును నంబరాభరణసంపదయు న్గని యుగ్రసైగులన్
కులి గరళించు నఘు వెతఛాయ గనస్తుదు భీరు లగ్రులన్. ౧౧౮

తే. వెలయు నుద్దీపనవిభావవర్గ మరయ
సత్త్వగజహయపటహనిస్వనము లండ్రు
కలుగు ననుభావములు సాత్త్వికములు దలఁప
భయ విమోహాదిసంచారిభావచయము. ౧౨౦

## బీభత్సము

క. వరుసవిభావాదులచేఁ-బెరుఁగు జుగుప్సయ తలంప బీభత్స మగున్
బరువడి రెండగు హేయా-చరణమున విరక్తివలనఁ జను నెఱుఁగంగన్. ౧౨౧

## జుగుప్సాబీభత్సము

చ. జరపక విశ్వవాసునకు సత్యము దప్పినరాజు రాజ్యసం
హరణము నొంది దీనుఁ డయి గాత్రి పెనంగొను మేనిపుండ్లనుం
బురు వగుగర్తపూరముల బ్రుంగి పయింబయి నంతకంతకున్
దొరఁ జెడిపుర్వులం గిలికి తోఁచుచు వేఁడును రచ్చపట్టులన్. ౧౨౨

## వైరాగ్యబీభత్సము

ఉ. ఎప్పుడుఁ గాఱుచొంగలకు నెత్తినచిప్పయుఁ బోని మోవియున్
జిప్పిలి కోఁతగాఁ గడుపుచీలినకప్పయుఁ బోని యప్పటున్
దప్పక సొమ్ముగాఁ దనరఁ దప్పుల మాటల కర్జమంచు నో
నొప్పులు పల్కు శాత్రవుల నొల్లఁడు విశ్వసరేంద్రుఁ డూఁకొనన్. ౧౨౩
తే. అతిజుగుప్సితములు నప్రియంబులును నా
లంబనములు, మగిక లాగు గాని
పూతిగంధవర్గములు తదుద్దీపనా
ఖ్యములు నాఁగ నెంచు నతిశయిల్లు. ౧౨౪
క. వదనాక్షి ఘ్రాణ రద చ్ఛ-ద కూణన విధుల పేరఁ జను ననుభావా
స్పదము లనంగాఁ, దనుచిత-సదమలపులకాదికములు సాత్త్వికము లగున్. ౧౨౫
తే. అందు సంచారిభావంబు లనఁగఁ బరఁగు
సముచితోద్వేగనిర్వేదశంకనములు
భయ విషాదానుసూయాప్రభృతికములు
చతురు లెఱుఁగింగఁ దగు నండ్రు సత్కృతుల సరఁగు. ౧౨౬

## అద్భుతము

క. జనితవిభావాదులచే-ననుగత మగు విస్మయంబ యద్భుత మనఁగాఁ
జను, నాలంబన మద్భుత-వినుతచమత్కార మనఁగ విద్భుత మయ్యెన్. ౧౨౭
మ. శశికాంతంబులు సంతతార్ద్రతఁ గనుం జక్రోపలాగ్రంబునన్,
బ్రకమం బొందు నితాంతసంతమసముం బాతాళగేహంబునన్,

భృశసంఫుల్లతఁ జేకొనుం గుముదినీబృందంబు మందాకినిన్,
విశదంబైన చళుక్యభూవిభుయశోవృద్ధిప్రభావంబునన్. ౧౨౮

తే. వరుస నుద్దీపనవిభావవర్గ మంద్రు
మేదురాశ్చర్యతరవర్ణనాదికములు,
చక్షు రానన గండ విస్ఫారణాదు
లదరు ననుభావములు నాఁగ నభిమతములు. ౧౨౯

క. పులక స్వేద ప్రముదము-లలవడు సాత్త్వికము లనఁగ, హర్షావేగా
దులు సంచారులు గాఁ జను-నలవడ యోజింపవలయు నద్భుతగతులన్. ౧౩౦

## శాంతరసము

క. శమము విభావాదులచే-నమరం బరిపుష్టమైన నది శాంత మగున్,
సమకొను నాలంబన మన-సతులము శాశ్వతము నైనయాజపద మరయన్. ౧౩౧

శా. డంభాచారము లుజ్జగించి రిపుగాఢక్రీడ నిర్జించి లో
కుంభద్విద్యలఁ జేర్చి సద్గుణములన్ శోభిల్లి సత్కీర్తి యా
రంభం బొప్పఁగ రాజయోగవిభవైశ్వర్యప్రబోధస్థితిన్
శంభుశ్రీచరణార్చలం బ్రబలు విశ్వేశ్వరుం డెప్పుడున్. ౧౩౨

క. వేదాంతచతురసంభా-షాదితకౌతూహలంబు లుద్దీపనముల్
ఖేదేతరసమదర్శన-వాదము లనుభావములు శివప్రసగంబుల్. ౧౩౩

క. రోమాంచ స్తంభాదులు-నేమపు సాత్త్వికము లంద్రు, నిర్వేదము వి
ద్యా మతి ధృత్యాదులు సభి-రామవ్యభిచారిభావరచనం జెందున్. ౧౩౪

సీ. శృంగార ముత్పలాంచితము విష్ణుఁడు దై. తెలుపుహాస్యము గణాధిపుఁడు రేఁడు,
కరుణ కపోతాభంబు కాలుఁడు పతి, రౌద్ర మవ్యక్తరక్తంబు రుద్రుఁడు విభుఁడు
వీరంబు గౌరంబు వృత్రారి పతి, భయానకము ధూమ్రము మహాకాలుఁ డీశుఁ,
డసితంబు బీభత్స మధిపతి నంది, యద్భుతము హేమాభ మంబుజభవుండు.

తే. భర్త, శాంతంబు నిర్మలస్ఫటికనిభము
పరఁగునధిదైవతము పరబ్రహ్మ మంద్రు;
వివిధరసశాస్త్రవేదులై వెలయునట్టి
కవుల కివి యెల్ల నెఱుఁగుట కర్జమెపుడు. ౧౩౫

ఆ. ప్రథమరసము సామభవము వీరంబు ఋ-గ్వేదసంభవంబు, వెలయు రౌద్ర
రస మధర్వనిగమరచితంబు, బీభత్స-మాది యజుఃప్రసూత మంద్రు బుధులు. ౧౩౬

తే. ఆది శృంగారజాతంబు హాస్యరసము, రౌద్రజాతంబు కారుణ్యరసము,
పుట్టె వీరంబువలన నద్భుతరసాఖ్య, మరియు బీభత్సమునను భయానకంబు. ౧౩౭

క. శాంతము సర్వోత్తరరస-మంతం, బప్పగిది నైదరసములు దే, వి
చింతన మెఱుఁగనికవి కవ-సంతత్వం బగదె రసవికాసప్రతతిన్. ౧౩౮

తే. మున్ను శృంగారబీభత్సములకు నొంట;
దరులు తమలోన వీరభయానకములు;
సమవిరోధంబు రౌద్రాద్భుతముల కెపుడు;
హాస్యకరుణంబులకుఁ బగ యనుదినంబు. ౧౩౯

చ. తమతమవంగడంబులకుఁ దప్పనిభావకడంబకంబుచే
నమరు రసంబు; లంగికము లన్నిటికంటెఁ బరిస్ఫుటాకృతిన్
బ్రమద మొనర్చు నెద్ది యది ప్రత్యయ మంగి; రసప్రవృద్ధికిన్
గ్రమమున నిద్దెలం గెలుఁగు కల్పన మొప్పఁ గవిత్వసిద్ధికిన్. ౧౪౦

క. సుఘటితపదార్థభావా-లఘుతరరసవత్ప్రబంధలంపటుఁ బలి భూ
మఘవుఁ డని నుతి యొనర్తురు-రఘురామునిఁ బోలెఁ బరశురాముం బోలెన్.

ఉ. శ్రీయజమిత్రతేజు గుణశోషవివేకనవీనభోజు వి
ద్యాయన కంటకారసికహర్త మహారణఖెవిహర్త గో
పాయితబంధువర్గు బలభిన్నపరాచలసన్ని మన్నను
ద్రాయకటారిసాళువనృసింహధరుం డత్ఫలవస్సుసుంధరున్. ౧౪౧

క. నారీజనమారుఁ జమూ-వారీవినిపతితవైరివారణు నానా
రిసూహితవితరణగుణున్-గౌరీపతిచరణకమలగంధానందున్. ౧౪౩

మాలిని. సకలనిగమవేదీ జారుసంగీతవాదీ
సకరుణదృష్టిసృష్టిః స[illegible]సంజాతపుష్టిః
నికటనిగమసమాజుండు నిత్యసంపన్నిధి [illegible]
సుకవిజనవిధేయుఁడు సుందరాంగ [illegible]. ౧౪౪

గద్యము — ఇది శ్రీమత్కుమారస్వామిపదారవిందవందన గోవిందామాత్యనందన వివిధ
బుధవిధేయ విన్నకోట పెద్దన నామధేయ రచితంబైన కావ్యాలంకార
చూడామణి యను నలంకారశాస్త్రంబునందు రసప్రపంచప్రకటన
సముద్దేశంబన్న ద్వితీయోల్లాసము.

---

# తృతీయోల్లాసము

---

క. శ్రీలోలాభీలాయత-కోలధ్వజుఁ గపితయువతికుసుమధ్వజుఁ జి
న్మూలస్థిత వృషభధ్వజుఁ-దాలధ్వజు నుగ్రసమర తత్పరకేళిన్. ౧

శా. శృంగారాదిరసోదయంబునకు సంస్థానాస్పదం బైన త
ద్రంగన్నాయకనాయికానిచయముం దత్తద్గుణశ్రేణిచేఁ
జెంగార న్వివరింతు నేర్పడ సముద్యత్ప్రబోధాత్ము లె
ల్లం గేడింపక యాదరింపుఁడు, తృతీయోల్లాసంబు శ్లాఘిల్లెడున్. ౨

## నాయకుఁడు

సీ. శిష్టకులీనత శీలంబు శాస్త్రార్థ వేదిత ప్రజ్ఞావివేకములు
యౌవన ముత్సాహ మాత్మస్థిరత్వంబు వినయంబు సుకృతి వితరణంబు
శౌచంబు శౌర్యంబు జనతానురాగంబు సత్యంబు స్థైర్యంబు సత్ప్రియోక్తి
మానంబు తేజంబు మాధుర్యవృత్తంబు వాగ్మిత బహుకళాంశసంప్రాప్తి

తే. స్మృతి కృతజ్ఞత సూనృత మేధనంబు
ధార్మికత్వంబు సౌభాగ్యదశ యనంగ
వెలయుగుణములు విశ్వవిభుఁడపోలెఁ
దనరుభూపతి నాయకత్వము వహించు. ౩

## నాయకభేదములు

క. ధీరోదాత్తుండును మఱి-ధీరోద్ధతసంజ్ఞకుండు ధీరలలితుఁడున్
ధీరప్రశాంతుఁడును నెం-పారెడు నాయకులు నలుగు రస్మ్యాగతులన్. ౪

## ధీరోదాత్తుఁడు

క. ధీరుఁడు గంభీరుఁడు స-త్కారుణ్యుఁడు నస్వయంకృతస్తుతి నిరహం
కారుఁడు నగునాయకుఁ డిల-ధీరోదాత్తుండు నాఁగ ధృతిం బెంపారున్. ౫

ఉ. మ్రోయనివార్ధి నెత్తుమల బ్రుంగనిరాముఁడు వంకవిల్లుగాఁ
జేయని పైఁడికొండ తనుఁ జెప్ప మదింపని పెద్ద యొజ్జచోఁ
బాయనినిక్కువంబులకుఁ బట్టు ధరిత్రిఁ జళుక్యవిశ్వభూ
నాయకుఁ; డమ్మహాగుణసనాథు నుదాత్తత యొప్పు నెప్పుడున్. ౬

## ధీరోద్ధతుఁడు

క. అతికోపనుఁ డతిమత్సరుఁ-డతిగర్వసమేతుఁ డత్యహంకారబలా
న్వితుఁ డాత్మశ్లాఘోదయ-చతురుఁడు ధీరోద్ధతుండు చంచలుఁడు మఱిన్. ౭

మ. ధర సర్వంకషగర్వమున్ బిరుదమాత్సర్యప్రవిధ్వంసముల్
బరభూపాలపలాయనప్రకటన ప్రౌఢంబుఁ గ్రోధోదయా
కరముం గ్రూరము నై చళుక్యవిభు నుగ్రవ్యగ్రకేతుస్థితాం
బరఖేలత్కరవాలభైరవసురూపం బొప్పుఁ బోరాటలన్. ౮

## ధీరలలితుఁడు

క. స్మరభీతుఁడు మానవతీ-పరవశుఁడును భోగలోలుపవ్రతుఁడును సుం
దరుఁడును నయ్యేడు నాయకుఁ-డరయంగా ధీరలలితుఁ డన విలసిల్లున్. ౯

చ. అగు డగురాజ్యతంత్రము నయుప్రియుచేతికి నిచ్చి విశ్వ భూ
వరుఁ డఖిలాంగసుందరియు వారణయానయు నిత్యదృఙ్మనో
హరయును నై తనర్చువిజయాంగనతోడిద లోక మై నిరం
తరము సుఖించు మండు నవదర్పకుఁ డై సుధనత్వ మేర్పడన్. ౧౦

## ధీరశాంతుఁడు

క. సుభగుఁడు శుచియు వివేకియు-నభిమానియు మృదువు సద్విజాతులవంశ
ప్రభవుండును నగునాయకుఁ-డభిమతముగ ధీరశాంతుఁ డనఁ బొగడొందున్. ౧౧

ఉ. శ్రీయుతు లై యశేషసనుచేతను లై వివిధాగమాదివి
ద్యాయతనంబు లై రసికు లై సుఖు లై తరుణీవిహారపు
ష్పాయుధు లై చరింతురు ధరామరు లట్టుల కౌరె రాజనా
రాయణదేవుచేఁ బడిన నచ్చెరువే యభిరామసంపదల్. ౧౨

## శృంగారనాయకులు

క. ఈనలువురు రసనవకస-మానస్థానముల జనసమూహంబులకున్
మానుగ శృంగారరసా-ధీనులు మఱి నలుగు రండ్రు తెలియఁగ వలయున్. ౧౩

క. వనితావిహరణదశలం-దనుకూలుఁడు శఠుఁడు దక్షిణాఖ్యుఁడు ధృష్టుం
డును నన నలుగురు నాయకు-లనయము శృంగారమునకు నర్హులు చెప్పన్. ౧౪

## అనుకూలుఁడు

క. ఏకవధూరక్తుం డై-యేకాంతయు లేక సమసమీహితగతులన్
దైకొని మెలఁగెడు నాతఁ డ-నాకులుఁ డనుకూలనాయకాఖ్యం బడయున్. ౧౫

శా. సద్రాగాన్వితగా నొనర్చుఁ గరసంచారోపచారంబులన్
భద్రశ్రీపరిలిప్తఁ జేయు సుమనఃపర్యాప్తఁ గావించు న
త్క్రవ్యప్రతిపత్తిచే వసుమతిం గాఁ జాలఁ బాలించు ని
ద్ద్రప్రీతిఁ జళుక్యనాథుఁడు ధరిత్రీకాంత నెల్లప్పుడున్. ౧౬

## శఠుఁడు

క. ఒరు లెఱుఁగకుండ నప్రియ-కరుఁడు శఠుం డనఁగఁ బరఁగుఁ గడుఁ గపటకళా
కరుఁడు నిజప్రియవనితా-పరితాపప్రదుఁడు క్రియలఁ బరికింపంగన్. ౧౭

ఉ. వల్లభ యైనకీర్తిసతివార్తల నిమ్ముల వించు విశ్వభూ
వల్లభుఁ డర్థ మర్థులకు వావిరి నిచ్చుట కీరసంబు సం
ధిల్లదు లచ్చి కేయెడలఁ దీయపుఁజూపులలోనఁ గెంపు రం
జిల్లన కాక, ధీరలకుఁ జిత్తమునం దొకవింత కల్గునే. ౧౮

## దక్షిణుఁడు

క. పెక్కండ్రు ప్రియలయందున్-జక్కని మొగమోట యొక్క చందంబున నిం
పెక్కన దక్షిణనాయకుఁ-డక్కజ మెఱుఁగంగవలయు నని చతురులకున్. ౧౯

మ. అరు దెం దైనఁ జళుక్యవిశ్వవిభు నెయ్యం బొక్కచందంబునం
గర మొప్పారుచు నుండు సైంధవిపయిన్ గాంధారిపై నించు
ఘూర్జరిపై మాళవిపై వరాటికపయిన్ సౌరాష్ట్రిపై గౌడిపై
సరి నీమాట లరాతిరాజతనయా శంకామతిం జేయుచున్. ౨౦

## ధృష్టుఁడు

క. స్పష్టాపరాధపిశునుఁడు-దృష్టాన్యారచితరతుఁడు ధృష్టుం డగు; సం
దష్టాధరాదిదర్శన-పుష్టవధూకోపుఁ డభయభూతుం డెపుడున్. ౨౧

చ. ఒరసి చళుక్యభూపతికి నోడినవైరికిఁ గాననంబులోఁ
గరిమదగంధము ల్గుటిలకంటకరేఖలు ఘర్షితాంగమున్
సురత వికారలీలఁ దలచూపినఁ దత్సతి యల్కఁ జెందెఁ; ద
ద్వరుఁడును దేటగాఁ దెలిపె; వక్రత నమ్మర యెన్ని చెప్పినన్. ౨౨

## శృంగారనాయక సహాయులు

తే. పృథివి నేతత్సహాయులు పీఠమర్ద
విట విదూషక చేటక విదితనాము
లోలి నలువురు; వీరి యయ్యుచితగతులు
వలయుఁ దెలియంగఁ దగ్గుణవర్తనముల. ౨౩

తే. పీఠమర్దుండు దగుఁ గార్యపేశలుండు,
వాని కించుక తక్కువవాఁడు విటుఁడు,
తొడఁగి నవ్వించునేని విదూషకుండు,
చేటకుఁడు సంధికల్పనసిద్ధకరుఁడు. ౨౪

## నాయికలు

శా. శృంగారప్రథమప్రభాసకము లై చెన్నారుశోభాదులన్
బొంగారం బ్రకటిల్లు నాయికల యుద్భూతప్రకారంబులన్

రంగల్లక్షణలక్ష్యవ్యక్తిఁ గని లో రాగిల్లు టొప్పన్; మద
ర్వాంగస్వీరసవాదరోషములచేతం గల్గునే సౌఖ్యముల్. ౨౫

క. నాయికలు స్వకీయయుఁ బరకీయయు సాధారణియును గీర్తిత లగుదుర్,
పాయక వారలవలన గుణాయత్తార్థములు గలుగు; నవి యెఱుఁగఁ దగున్. ౨౬

## స్వీయ

క. పతియును శీలార్జవసంగతయుం గులవతియు నఖిలకల్యాణగుణా
న్వితయును లజ్జాళువు నగునతివను రసికులు స్వకీయ యందురు కృతులన్. ౨౭

క. కులవతియును శీలార్జవకలితయు పతియును నశేష కల్యాణగుణో
జ్జ్వలయును లజ్జాళువు నగునలినీలకచన్ స్వకీయ యందురు కృతులన్. ౨౮

చ. అలఘుచరిత్రలున్ శుభగుణాన్వితలున్ గురుబంధుమిత్రవ
త్సలలును దర్పహీనలును ధర్మవిధిజ్ఞలు రూపసంపదా
కలితలు నైనదారికలఁ గానిక లిత్తురు సంధివేళలన్
నలినహితేందువంశనరనాథులు విశ్వనరేంద్రధర్తకున్. ౨౯

## పరకీయ

క. పరకీయ రెండుతెఱఁగులు కరపరిణీతయును జేరుగలకన్యయు నాఁ
బరిణీత రాగరసములఁ బరికల్పిత గాదు సత్ప్రబంధములందున్. ౩౦

ఆ. కన్య పరిణయాభికాంక్షచే రాగాంగముగుట రసమునందు నగు నుతింపఁ
బిన్నయయ్యుఁ దనకుఁ బెండ్లి యౌమాట లాలించు వాలఁ గన్య పోలఁ బోలె.

ఉ. సాలకపాలభాగలును సంకురితస్తనబింబలున్ వికా
ల్పాలసబాలలీలలును నల్పవివేకలు నైననవ్వైరిభూ
పాలురముద్దుఁ గన్నియల భాగ్యము నెన్నుదు రర్థి విశ్వభూ
పాలునిరాజ్యలక్ష్మికి సపత్నిక లయ్యెద రంచుఁ బ్రాజ్ఞులుల్. ౩౨

## సాధారణనాయిక

క. సాధారణి యన గణిక కళాధారేయాత్మ కపటలంపటలీలా
మాధుర్యవిధాయిని దురగాధమనోవృత్తి దానిగలిఁ దెలియంగన్. ౩౩

చ. అనిఁ బరగండభైరవభుజాసివడిం బడి పుణ్యమూర్తు లై
వినుతిగతిం జరించు ఒలుపేరులఁ గైకొని యేపు మీఱ ము
న్ననఁగి పెనంగి కూర్చుసువిటావలులన్ దొలఁగించి రప్సరో
వనితలు; పైఁడిపెట్టి విలువం గలవే వెలయాండ్రకూరుముల్. ౩౪

## స్వీయాభేదములు

క. చతురస్వకీయగుణసంగతి ముగ్ధయు మధ్యయుం బ్రగల్భయు ననఁగా
రతిపతితంత్రంబులచేఁ బ్రతిపాదిత లై రి మూఁడుభంగుల వరుసన్. ౩౫

## ముగ్ధ

క. జవ్వనములోన నడుగిడ-మవ్వపుమది సిగ్గుచేత మరుని గెలిచి లో
నివ్వటిలఁ, గలద తెలియఁగని-యవ్వెలఁదుక ముగ్ధయనఁగ నభిమత యయ్యెన్. ౩౬

సీ. ఆత్మసేమంబున కత్తాడుచనుఁగవ యలఁతిపయ్యెదచాటు నాసపడఁగఁ
గన్నుఁగ్రేవలఁ గ్రాలఁగడఁగు వాలికచూడ్కి సొబగారుసిగ్గుతో సుడివడంగఁ
బొరిపొరి బొమలపైఁ బొలుపారునలకలు చేతికెంజాయతోఁ జెలిమిసేయ
నలకనైతోఁచు నెన్నడు మించునూఁగారు మాటున నొక్కింత మఱుఁగుపడఁగ

తే. నంగజుఁడు వేడ్క లోనఁ జెట్టాపి నడరు
ముగ్ధఁ డెందంబుఁ గనుఁగొని ముదము నొసఁగుఁ
జతురలీలల విశ్వేశచక్రవర్తి
యూష్మశరదాగమంబుల నుచితగతుల. ౩౭

## మధ్యనాయిక

క. సంపూర్ణయౌవనోచిత-సంప్రాప్తియుఁ గామినియును సమలజ్జయుఁ బ్రే
రింపఁగ మోహోత్తరరతి-లంపటయును మధ్య యనెడులలన దలంపన్. ౩౮

సీ. ప్రహసోన్నతసమాయతాంగి విస్ఫూర్తిపై నిబిడలావణ్యంబు నిట్ట్రోవ
నేపథ్యశృంగారనియమితరసనొప్పఁ దారుణ్యసంపత్తి దళుకులొత్త
మిళితరాగాభోగమృదుగల్లపాళిపై సమ్మదోద్రేకంబు జాలువాఱ
లాలితలజ్జావిలాసంబుపై సాంద్ర కందర్ప దర్పంబు కందళింపఁ

తే. గొమరు మిగిలెడు మధ్యఁ గోర్కులకు నెల్ల
నెల్లగై యొప్పు విశ్వేశవల్లభుండు
భావజక్రీడఁ గవఁ గూడి పరిణమించు
విమలహేమంతశిశిరకాలములయందు. ౩౯

## ప్రగల్భనాయిక

క. అతిరూఢవయోభిమతయు-నతికామావేశమతియు నంగజవిద్యా
చతురయు నతిలీనమనో-గతియును నగువనిత తగుఁ బ్రగల్భ యనంగన్. ౪౦

సీ. పయ్యెదకొంగులోపలఁ జిక్కటిల్లెడు నెవ్వఁగుఁజన్నులనింపుసొంపు
దళుకుతో లజ్జకుఁ దలవాటి క్రాలెడు నిడువాలుఁజూపుల నిశితగతియుఁ
బ్రణయానులాపసంపత్తిలోఁ గొంకక మున్నాడి యేతెంచు మొక్కలంబు
నాడికంపుఁజేఁతల యొఱ పెఱింగినవింత పీడ్పాటుపనిగల వెడఁగుఁదనముఁ

తే. గలిగి తమకించునెడలఁ బ్రగల్భఁ దగిలి
వేడ్క విహరించుఁ జాళుక్యవిశ్వవిభుఁడు
చారువర్షావసంతర్తుసమయములను
బాలితాఖిలరాజ్యవైభవ మెలర్ప. ౪౧

## ధీరాదినాయికాభేదములు

క. అరయ ముగ్ధయు వెలిగా-గారవమున మధ్యయును బ్రగల్భయు వరుసన్
ధీరయు ధీరాధీరయు-ధీరేతరయును ననంగఁ ద్రివిధాఖ్య లిలన్. ౪౨

### ధీ ర

క. తెల్లపుటపరాధము గల-వల్లభుఁ గని వినయమ్మృదుల వక్రోక్తులచే
నుల్లసము దోఁపఁ బలికెడు-నల్లలనకుఁ బేరు ధీర యండ్రు రసజ్ఞుల్. ౪౩

చ. లసితము లైన లేఁజెమరులన్ జెలువారెడి మేనితావియున్
బొసఁగ విలోచనాంతములఁ బొంపిరివోయెడువింతరాగమున్
వసుమతి గారవించుచు శ్రమంపడ కుండిన నేల కల్గు నిం
పెసఁగఁగ నంచుఁ బల్కెఁ దరళేక్షణ యొత్తు చళుక్యవల్లభున్. ౪౪

### ధీరాధీర

క. నేరమి చేసినపతిఁ గ-న్నారం గని లోచనముల నశ్రువు లొలుకన్
దోరపువక్రోక్తులఁ దగ-ధీరాధీరాఖ్య పలుకు ధృతి కడ కొదవన్. ౪౫

చ. చతురత విశ్వభూవిభుఁడు జాదులు మాళవి కిచ్చె, నిచ్చినన్
బ్రతిధ వహించి లాటి పిదపం దన కిచ్చినపాటలంబులం
బతిపయిఁ బాఱఁ జిల్కె నవబాష్పకణంబులు రాల రోషభా
షిత యగు చుండె; నత్తెఱఁగు చిత్తమునం బరికించెనో కదే. ౪౬

### అధీర

క. అపరాధి యైనపతిపై-నుపచితరోషమున నశ్రు లొలుకఁగ నుద్య
ల్లపితము లుల్లసములుగా-నెప మిడుచు నధీర పలుకు నెయ్యము కలిమిన్. ౪౭

చ. ఒడఁబడువేడ్కఁ దన్ను మును నూఱడఁ బల్కె మొఱంగి చన్న చ
క్కదనములు రోషబాష్పకణగద్గదభాషలచేతఁ జెప్పుచున్
ముదిత చళుక్యవల్లభునిమ్రోలఁ దనర్చుట చూచి నెచ్చెలుల్
మదనునిచేఁతకుం దరుణిమానము లేఁతకు నొచ్చి రిచ్చలన్. ౪౮

### ప్రగల్భధీర

క. అలుక దలమాపకుండెడు-పలుకులఁ జేఁతలును నచ్చుపఱుచుచు దయితున్
గలితాపరాధు మదిలో-నలయించుఁ బ్రగల్భధీర యర్హక్రియలన్. ౪౯

చ. కలి నపరాంగనాప్తుఁ డగువిశ్వనృపాలునిఁ బ్రీతి చూపుచూ
పుల నలరింపదయ్యె మణిపుత్రికఁ జూచుట గారణంబు గాఁ,
బలుకకు నత్తఱిం బదువు చెప్పకతంబునఁ బల్కదయ్యెఁ, దా
య్యాలి యొదు రేఁగదయ్యెఁ గలహాంసికి నెన్నడఁ జూపుచుండుటన్. ౫౦

## ప్రగల్భధీరాధీర

క. కినుకయుఁ దాలిమియును జెం-దిన మాటల నాప్రగల్భధీరాధీరాం
గన యుల్లసముల పెనఁగువ-తనముఁ బ్రసాదంబుఁ జూపుతగవరి దలఁపన్. ౫౧

మ. అతివా నాకుఁ జళుక్యనాథుచతురవ్యాపారముల్ విన్న సం
తతమోదంబు జనించు, నంతటన ధూర్తక్రీడ లాలించినన్
బ్రతిపన్నం బగుఁ గోప, మప్పు డటు సోత్ప్రాసోక్తికిం జొచ్చినన్
హితమందస్మిత మబ్బు మోమునకు ము, న్నీ కౌతుకం బెట్టిదో! ౫౨

## ప్రగల్భాధీర

క. కూరిమిపతి తన కోపము-వారించినఁ గ్రోచి పిదప వచ్చి యతనిఁ దా
నూరార్చునది ప్రగల్భా-ధీర యనం బరఁగు రసికదృష్టికి నరయన్. ౫౩

శా. ఆపంచాయుధుపెంపు నాహిమకరాహంకార మాకోకిలా
టోపంబుం దరియింప లేక సతి నిందుంగూర్మితో ధైర్యసీ
మాపర్యాప్తికి నెగ్గ గా మణిగణన్మంజీరపుంజీకృత
త్విట్ప్రవ్రాతకిరీటు మ్రొక్కి నిలిచెం జాళుక్యవిశ్వేశ్వరున్. ౫౪

క. జ్యేష్ఠయు మధ్యాఖ్యయు న-నిష్ఠయు ననఁ గృతులఁ బరఁగు నెలఁతలకును నీ
నిష్ఠితగుణములు వరుసఁ బ్ర-తిష్ఠితములు సరసగతులఁ దెలియఁగవలయున్. ౫౫

## అష్టవిధనాయికలు

తే. కలరు స్వాధీనపతికయు ఖండితయును
బ్రోషితప్రియయును విరహోత్కలికయు
నాల నభిసారికయుఁ గలహాంతరితయు
సంప్రవాసిని వాసకసజ్జికయును. ౫౬

క. ఈయెనిమిది శృంగార వి-ధాయి దశాకలిత స్త్రీనటిరుఁబుల తెఱఁగుల్
పాయక లక్షణలక్ష్య-పాయంబులఁ దెలియవలయుఁ బ్రోషప్రతిభన్. ౫౭

## స్వాధీనభర్తృక

క. మధురానువర్తి యగు తన-యధిపతిచే నెప్పు డర్పితాభరణాసన్
బ్రథిత యగుచుండు కోమలి-కథితస్వాధీనభర్తృకాసంజ్ఞ యిలన్. ౫౮

మ. ప్రతిపత్తిప్రతిపాదితక్షితులు చూపన్ జెప్ప లే వెన్నఁడున్
బ్రతికాలస్వకృతోత్సవాభరణభద్రశ్రీవిమిశ్రక్రియా
చతురత్వం బలరారుచుండు నెపుడున్ జాళుక్యవిశ్వేశ్వరుం
డతిగా నోచిన రత్నగర్భయనులాభం బొప్పఁబో పృథ్వికిన్.

## ఖండిత

క. వేరే యెల్ల నన్యసురత-శ్రేయస్కుఁడు కృతమనోజచిహ్నుఁడు నగున
న్నాయకుని వీడ నాడెడు-నాయంగన ఖండితాఖ్య యగుఁ బరికింపన్. ౬౦

శా. చారుస్పర్శసమీరసూచితతనూసౌరభ్య మింపారఁ గా
శ్మీరీసంగమశంసి స్తనఁ గని గాసిల్లెం బ్రకాశాంగజా
కారుం డై విలసిల్లువిశ్వవిభుఁ గర్ణాటి గాశ్మీరితో
నారాజన్యుఁ డెఱుంగు టచ్చెరువె తద్వ్యామోహ ఖేదంబులన్. ౬౧

## ప్రోషితభర్తృక

క. పతి పరదేశాంతర పరి-గతుఁ డై క్రమ్మఱక యచటఁ గడు మసలుటయున్
మతిఁ దుంకుడుకుం జెందెడు-సతిఁ బ్రోషితభర్తృక యనఁ జను నండ్రు బుధుల్.

ఉ. శ్రీకుఁ జళుక్యవిశ్వధరణీశు భజింపఁ దలంచి చన్న యా
త్మేశుఁడు వచ్చునంతకుఁ బురంధ్రికకుం బ్రభవించెఁ దోడుతో
నాశలమాలుపాటు మలినాంబరభావము నంగవర్ణసం
క్లేశవికారముల్ నిరవలేపతయున్ సుమనోవిముక్తియున్. ౬౩

## విరహోత్కంఠిత

క. వరుఁ డనురక్తుం డయ్యు ని-తర మగు పని గలిగి రాక తడయుటయు విభా
వరియందు నడలుపొలఁతుక-విరహోత్కంఠిత యనంగ విశ్రుతి కెక్కున్. ౬౪

చ. నవరసగీతవాద్యనటనంబు రుచించిన రాక తక్కెనో,
వివిధకవిప్రబంధరసవీచులఁ దేలి తలంపఁడయ్యెనో,
నవ యువరాజకజ్జములు గల్గెనొ కాక, చళుక్యమేదినీ
ధవుఁ డిటు లేటికిం దడయుఁ దారలు వెల్లఁదనంబు గూడెడున్. ౬౫

## అభిసారిక

క. ముంగిటికై నడ సాగ న-పాంగము తిమిరంబె దెసల నడఁపఁగఁ డిమితోఁ
జెంగక పతికడకుం జను-నంగన యభిసారికాహ్వయంబుం బడయున్. ౬౬

మ. క్రియ నుద్దామఘనాఘనాకలితముం గీలాలధారాళమున్
భయదోద్యచ్ఛతకోటిఘోషణము నై భాసిల్లుఁ బోరాటలోఁ
బ్రియలీలాచపలావలోకములు శోభిల్లం బ్రసన్నాకృతిన్
జయసీమంతిని వచ్చి మెచ్చి కలయుం జాళుక్యవిశ్వేశ్వరున్. ౬౭

## కలహాంతరిత

క. కలహాంతరిత యనం గా-వలవనిపొలయల్కఁ జేసి వల్లభుతోడం
బలుకక పిమ్మట మదిలో-నలఁగురు నెలఁతుకకు నామ మండ్రు రసజ్ఞుల్. ౬౮

చ. తొలితొలి నగ్గె విశ్వవిభుతో మననెచ్చెలి; రిత్తయల్కకుం
దెలియఁడ రాజు; దర్పకుఁడు తీపుల విల్లది యెక్కుపెట్టెఁ; గ్రొ
న్నెల వొడతెంచెఁ; నింకఁ గరణీయము సఖ్యము సేయు నేర్పు తొ
య్యలి యలికేంగురేఖకును నవ్విభుపాదపయోజలక్ష్మికిన్. ౬౯

## విప్రలబ్ధ

క. పంచినయెడ కేతేరక-వంచించిన దయితుతో వివాదము సంపా
దించి చెలితోడ దుఃఖో-దంచిత యగు విప్రలబ్ధ తత్పరబుద్ధిన్. ౭౦

శా. చాళుక్యక్షితినాథ నీ పనుపునన్ సౌరాష్ట్రి యేతెంచె; నే
వేలో జాలము సేసి రామికి మఱం దీప్యాసముం దాల్చె; నా
యాలాపంబులు నమ్మవేనియును, రమ్మా యాతు కన్నిటిచేఁ
జాలం బంకిలభాగమైనవిలసత్సంకేతసద్మస్థలిన్. ౭౧

## వాసకసజ్జిక

క. భాసురయై పతి నగరికి-మాసరమున వచ్చు టెఱిఁగి మణిమండలవి
న్యాసాలంకృత యగు సతి-వాసకసజ్జిక యనంగ వలనై యొప్పున్. ౭౨

మ. పరిలేపస్ఫుటసోమకుంభకుసుమున్ బ్రాలంబముక్తాఫలాం
బరవిభ్రాజితమూర్తియున్ వికసత్పుష్పస్రగ్వితానాంతగ
స్ఫురితాకారయునై వెలుంగు పురిసంశోభిల్లె విశ్వావసీ
వరుఁ డేతెంచె జయార్తితో ననెడు నివార్తావిశేషస్థలిన్. ౭౩

## దూతికలు

తే. వీరలకు దూతికలు ప్రతివేశినియును
జెలియు దాసియు ధాత్రియు శిల్పినియును
లింగినియుఁ గారువును వీరు లేక యున్నఁ
దాన యైనను నగుఁ బ్రియతంత్రములకు. ౭౪

క. శ్రీయుతు లగునీ నాయక-నాయిక లిరువారు, భాజనంబులు శృంగా
రాయతజననమునకు నివి-యో యెఱుఁగం దగినయవి సుబుద్ధుల కెల్లన్. ౭౫

సీ. గచితసహాయాంగరససంవ్యక్తియుఁ బూజ్యాంగికరసానుపోషణంబుఁ
గానివిభావాదికష్టకల్పనమును శత్రుభూతరసాదిసంకరమును
సద్మకాలాదిరసప్రరోహణమును రసభావనామోచ్చరణపదంబు
ననుచితక్రమశాసనాగ్రహసంచారిభావానుబంధనప్రసరణంబు
తే. పాడము భావరసాభాసములు దలంప
వీనిఁ బరికించి తొలఁగించి విశ్రుతముగఁ

గబ్బ మొనరించు సుకవిపుంగవులఁ గాని
యన్యు మెచ్చఁడు రాజనారాయణుండు. ౭౬

మ. చతురశ్రోత్రసుఖాకరామృతపరిష్యందంబు నందంబు నై
ధృతిఁ గావ్యప్రసరంబు వొల్చు నిఖిలక్షేమంకరస్ఫూర్తితోఁ
బ్రతిభావంతులు మెచ్చ లక్షణము నొప్పం జెప్పఁగం బూర్వక
ల్పిత శాస్త్రానుగతంబు సంగతముగాఁ బ్రీతిప్రదవ్యక్తిచేన్. ౭౭

శా. దివ్యం బైనకృతిత్రయంబు వివిధోక్తిం బద్యశాస్త్రంబులున్
భవ్యం బైనపురాణవర్గమును గుప్తం బైనవిద్యాప్రపం
చవ్యాపారము నేమిటం గలిగి యక్షయ్యంబు లై పేర్చుఁ ద
త్కావ్యం బేరికి నింపుగా నెఱిఁగినం గల్పాంతరస్థాయి నై. ౭౮

క. సమయజ్ఞుఁడు సమచిత్తుఁడు-సమశబ్దార్థప్రయోగచతురుఁడు భావ
క్రమరసపోషణరచనా-కమనీయప్రతిభుఁ డిల సుకవి యనఁ బరఁగున్. ౭౯

## సప్తవిధకవులు

తే. వాచికార్థులు శిల్పక రాచికులును
భూషణార్థియు మార్దవస్ఫురణకరుఁడు
నల వివేకియు ననఁగ సప్తాహ్వయములఁ
గవులు నెగడును రీహితకావ్యములను. ౮౦

## వాచికుఁడు

క. ఘలవర్ణగుచ్ఛపిచ్ఛిల-లలితపదాడంబరావలంబనకవితా
సులభవిరచనాచతురుం-డలవడు వాచికుఁడు నా నుదగ్రప్రౌఢిన్. ౮౧

## అర్థుఁడు

క. మితశబ్ద మయ్యు నర్థము-సతతవ్యాఖ్యానలాలసక్షమవిపుల
స్థితి నొప్పఁ గవిత సెప్పెడు-నతఁ డార్థుం డనఁగ నెగడు నార్యులసభలన్. ౮౨

## శిల్పకుఁడు

క. మహితసుశబ్దార్థగంబులు-బహువిధయమకార్థబంధబంధురరచనా
నిహితవిచిత్రము లై చన-విహరించున్ శిల్పకుండు విశ్రుతకృతులన్. ౮౩

## రాచికుఁడు

క. ఒదవెడుకృతిపైఁ గలసాబ-గదలక యొందాఁక నిష్టమగు నందాఁకన్
మృదుమధురరచన సువిశా-రదుఁ డై సాగించునతఁడు రాచికుఁ డెందున్. ౮౪

### భూషణార్థి

క. తివుటవడి నొడువునప్పుడు-వివిధాలంకారసరణి విడువక ఎవి గా
నవహితుడై కృతిచెప్పెను-కవి యెంచును భూషణార్థి కడు బాగొందన్.

### మార్దవానుగతుడు

క. సరళము లగుశబ్దములును-విరళము లగునర్థములును వీనుల కింపం
దరళిత లేక రసౌఘము లరుగగ-గృతిచెప్పు మార్దవానుగు డెప్పుడున్. ౫౬

### వివేకి

క. శ్రుతశాస్త్రాలంకార-ప్రతిభుడు శబ్దార్థదోషపటునిర్ఘటనా
చతురుడు వివేకి నాగను-నతడు మహాకవికృతంబులందు జరించున్. ౫౭

క. ఛందోలంకారాదుల-పొం దెఱిగిన నిద్ర లేక పొసగదు కవితా
సుందరత శక్తి యది యా-కిందుకు వగ నెఱుగువాడె కవివరు డెందున్. ౫౮

తే. శక్తి వలిదైన కావ్యశక్తిసాధనంబు
లెల్ల జీకటియింటిలో నిడినకరకు
లెన్ని ఋతువులు గలిగిన నెట్లు పూచు
మహి వసంతాగమము లేక మావిమోక. ౫౯

వ. వినుతయాగంబునం గలుగు విప్రుత నాకనివాస; మయ్యశో
జననము శ్రవ్యకావ్యములసంగతి నొప్పును; దృశ్యకావ్యముం
బనరుగ నభిప్రభావమున; నత్కృతిసంస్తుతి లేనిచో నశే
షున విహరింప; దివ్విభులు పోయినజాడ తెలుంగ బోలునే. ౬౦

### కావ్యభేదములు

తే. అట్లు కవికృత మైన కావ్యత్రయంబు
గద్యపద్యవిమిశ్రసంపాద్య మండ్రు,
నగరముఖ్యాష్టదశవర్ణనములచేత
బరగు నదియును దివ్యప్రబంధ మనగ. ౬౧

### అష్టాదశవర్ణనలు

మ. పుర వారాశి మహీధర ర్తు శశిభృ త్సూర్యోద యోద్యాన పు
ష్కరకేళీ మధుపాన మోహన వియోగ క్షేమ యాన స్వయం
వర పుత్రోత్సవ మంత్ర దూత్య రణజైత్రాక్రాంతి సంకీర్తనా
కర మష్టాదశవర్ణనాన్వితము తత్కావ్యంబు ధన్యం బిలన్. ౬౨

### నగరవర్ణనము

క. దుర్గము పరిఖా వప్రని-సర్గబలాళిక చతురచాతుర్వర్ణ్య
స్వర్గళసంప ద్వన జల-వర్గస్తుతి వలయు నగర వర్ణనమునకున్. ౬౩

సీ. గంభీరపరిఖ నాగస్త్రీల కిక్రాంతకేళివిహారదీర్ఘిక యనంగ
నుత్తాలసాల మన్యుల కుబ్బి దివిఁ బ్రాఁకఁ జేసినదీర్ఘనిశ్రేణి యనఁగఁ
జతురచాతుర్వర్ణ్య సంఘ మర్థులపాలిరాజితకల్పకారామ మనఁగ
భ్రాంతకుస్థిత రైన భవజూటవాహిని భుక్తిముక్తిప్రదస్ఫూర్తి యనఁగ
తే. చెప్పఁడును నొప్పు రాజమహేంద్రవరము
ధరణిఁ గల్పించె నేరాజు తనకుఁ బేర
నట్టి రాజమహేంద్రుని యనుఁగు మనుమఁ
డెసఁగుఁ జాళుక్యవిశ్వనరేశ్వరుండు. ౯౪

## సముద్రవర్ణనము

క. సిరి నెలవు, గురుసుధాప్తియు-నరుదారఁగ నజునితండ్రి యల్లుఁడు, రత్నా
కరము దన పేరు, జలధికి-సరి గలరే యరయ ననుచుఁ జను వర్ణింపన్. ౯౫
మ. అతిగాంభీర్యము గోత్రగోపనము సత్త్వాటోపమాహాత్మ్యమున్
హితలక్ష్మీసదనత్వమున్ సతతవృద్ధిప్రభావంబు ను
న్నతసర్వోత్తరజీవనోదయము నానావాహినీసౌఖ్యశా
లితయుం జేర్చుఁ జళుక్యనాథునకుఁ బోలెన్ జూడ నంభోధికిన్. ౯౬

## పర్వతవర్ణనము

క. అచలతయును నున్నతియును-ఖచరవినోదోచితియును గనకాది ఘన
రుచితయును ముకులుగాఁగల-ప్రచురతలు నుతింపఁదలయుఁ బర్వతమునకున్. ౯౭
మ. చెలువారున్ వరరత్నపాదకటకశ్రీచేత, గంధర్వమం
కళనాదంబులతోడ నొప్పగు, నధిరంగస్థైర్యవృత్తిన్ మహా
బలునైనం బ్రహసించు, భూధరగణాశోభం దాల్చి మిన్నందుచున్
గులశైలంబుల పెంపు విశ్వవిభుతోఁ గూర్పం దగున్ ధీరతన్. ౯౮

## వసంతవర్ణనము

క. అంకురపల్లవపత్త్రస-మాంకితముకుళప్రసూనహారిఫలములన్
బింకము లగువనములు ని-శ్శంకముగ నుతింపఁబడు వసంతమునందున్. ౯౯
మ. స్మరబాణంబులు వాఁడు లయ్యె, గుణవిస్ఫారంబు ఘోరంబుగా
మొరసెం, గీరము లంగజాతబిరుదానీకంబు గీర్తించె, మిం
చె రసాలాగ్రములు, పల్లవార్చులు దలిర్చెన్, విశ్వనాథావనీ
వరుతో నల్గుట చెల్లునే యనుత ద్వామాక్షి కేపట్టునన్. ౧౦౦

## గ్రీష్మవర్ణనము

క. ధారాగృహముల నవఘన-సారాదుల గంధసారసరసపటీరో
శీరవ్యజనాదుల నిం-పారఁగ వర్ణింపఁ దగు నిదాఘాగమమున్ ౧౦౧

శా. ధారామండిత సాలభంజికలచేతన్ జిత్రయంత్రోద్గళ
త్సారామోదతుషారపూరములు విస్తారంబులై పర్వఁ గాం
తారూఢేక్షణదీప్తితోడన చకుక్ష్యాధీశుపైఁ జంద్రవం
శారాధ్యం బని చంద్రికాగమము నింపై క్రాలుచందంబునన్. ౧౦౨

## ప్రావృడ్వర్ణనము

క. తటిదటన మేఘపటలీ-ఘటితాంబరశక్రచాపకరకావ్రాళి
స్ఫుటధారాసారాదివి-కటత నుతింపంగవలయు ఘనకాలమునన్. ౧౦౩

మ. చపలాలోకములుం బయోధరగరిమ్నశ్రీయు సద్యోలస
ద్విపులానందము నంబరాభరణసద్వేషంబునుం గంకణ
స్ఫుటారావము సొంపు మీఱఁ దగువర్షావేళ విశ్వేశ్వరా
ధిపు సేవించుప్రగల్భకామినిగతిన్ దీపించు భావింపఁగన్. ౧౦౪

## శరద్వర్ణనము

క. వెన్నెల సొంపును జుక్కల-చెన్నును వెలుపారు దెసల చెలువంబులు వి
చ్ఛిన్నము లగుజలదంబుల-సన్నుతి సేయంగవలయు శారదవేళన్. ౧౦౫

శా. సోమశ్రీలకు వన్నె వెట్టును, ఘనస్తోమంబునం బర్వునా
శామాలిన్యము నొలఁ ద్రోచు, నవరాజద్రాజహంసావళిం
ప్రేమంబుం బచరించు మానసమునం బెంపై, శరద్విభ్రమం
బామోదప్రద మైనవిశ్వవిభు నుద్యత్కీర్తికిన్ సాటి యై. ౧౦౬

## హేమంత వర్ణనము

క. బలవత్కామీతుక కం-బళఘనకౌశేయపట్టపటమాంజిష్ఠం
బులఁ జనదు సీతు యువతుల-వలిచన్నులఁ దక్క ననుచు వలయుం బొగడన్.

మ. తరుణీయౌవనగర్వజృంభిత కుచోదగ్రోష్మగంధంబులన్
వరకాశ్మీరసపాంకవాగురుగసవ్యాసక్తులం బట్టికాం
బరమాంజిష్ఠపటాదులన్ హిమగతిం బ్రాపింప కీవిశ్వభూ
వరు మెచ్చించిన సత్కవీంద్రు లతులావాసంబులం దిమ్ములన్. ౧౦౮

## శిశిరవర్ణనము

క. భృశవిచ్ఛిన్నం బగు ది-గ్దశకంబును గమలరుహవితానముఁ బ్రాతః
ప్రశిథిలరవికరమును గా-శిశిరముఁ బొగడంగఁ దగు విశేషశ్రీయులన్. ౧౦౯

చ. వెరవున నాత్మవంశ్యుఁ డగువిశ్వనరేశ్వరుమీఁది ప్రీతిఁ జం
దురుఁడు తుషారసంహతుల దొడ్డుగఁ బంచిన వచ్చి యుచ్చటన్
బరిగొనఁ బోలు నరాయఁ జెడి పాటినవైరులు భీతిఁ గానలోఁ
జిరముగ నిల్వనేరరో కదే యని చూతురు పండ లాత్మలన్. ౧౧౦

## చంద్రోదయ వర్ణనము

క. మండలశోభయుఁ గైరవ-షండవిలాసంబు జలధిసంజృంభణముం
గొండొకవెన్నెలగ్రోలెడు-నండజముల విభునిపొడుపునం దగుఁ బొగడన్. ౧౧౧

మ. అదె రౌద్రాకృతిఁ జూచెఁ జంద్రుఁడు, మయూఖాటోప మేపారె న
ల్లదె, మున్నాడెఁ జకోరసంఘ మదె జ్యోత్స్నాచ్ఛపానసంక్రీడకై;
యుదయం బంగజుఁ డెట్లు గాఁగలఁడో? నీయాలోకనేందీవరా
పదఁ దూలించెను, చంద్రవంశజుని నొప్పం జూడు రమ్యా సఖీ. ౧౧౨

## సూర్యోదయ వర్ణనము

క. ఎచ్చటఁ జూచిన జగములు-నచ్చటన వెలుంగు ననియు నజ హరి హర తా
సప్తతురుఁ డనియు మఱియును-నిచ్చఁ దగఁ బొగడవలయు నినునుదయంబున్.

మ. కమలామోద మెలర్ప నేత్రసుఖ మాకారంబు రంజిల్ల ను
త్తమమందార శిఖంకరత్వ మెసఁగన్ ధర్మార్థకామక్రియా
దిమమూలం బన నొప్పమిత్రుఁ డుదయోత్సేకప్రభావంబుచే;
సముఁ డర్ధ్వపున కింగువంశజుఁడు తద్వాంఛాస్తగాత్రేణులన్. ౧౧౪

## వనవిహార వర్ణనము

క. చారుతరచైత్రసంప-త్పూరితవిభవముల వేడ్కఁ బొంగుడునఁ దగా
నారీజనసహచరుఁ డై-యారామవిహార మొప్ప నధిపతి చేయున్. ౧౧౫

సీ. మానినీగండూషమానువులఁ బూచిన పొగడను సొబగొప్పఁ బొగడి పొగడి
నారీపదాహతి ననిచినకంకేలి పరువంబు నగ్గించి పలికి పలికి
లలనావలోకనంబులఁ బుష్పితం బగు తిలకంబుపైఁ జూడ్కి త్రిప్పి త్రిప్పి
వనితోపగూహనంబునఁ బేర్చుసురపొన్న మేలిపుణ్యమునకు మెచ్చి మెచ్చి

తే. మన్మథారామములపొంత మలసి మలసి
శుకపికాళివిహారంబు చూచి చూచి
సతులఁ దానుఁ జరించు వసంతవేళఁ
బ్రమదవనమున విశ్వభూపాలవరుఁడు. ౧౧౬

## జలవిహార వర్ణనము

క. నీరజములుఁ గెంగలువలు-సారసములు వీచికలును సరసయంత్రపయో
ధారలు నావ్రంబులు-వారివిహారంబులందు వర్ణ్యము లరయన్. ౧౧౭

చ. తటులును వీచికావళులు వారిరుహంబులు వక్త్రపంక్తులన్
చెలు వగు నాభులన్ సుడులఁ జేతులు రక్తసరోరుహంబులన్
జలపలకంబులన్ మధుపజాలము వీద్వడఁ గేలి సల్పి మిం
చులు గొనుచూడ్కులన్ సతులు సూటురు విశ్వనృపాలమన్మథున్. ౧౧౮

## మద్యపానవర్ణనము

క. సంబోధకరము మదనా-లంబనము నశేషరసవిలసితము నంత
ర్బింబితవదనము నగు కా-దంబరి నాపానమునకుఁ దగ నొడఁగూర్పన్. ౧౧౯

మ. అలినాదంబులు దాసమానములుగా నాలప్తి గావించుఁ దొ
య్యలి తారా ర్తొక్కితె పాడు విశ్వవిభు నేలాదిప్రబంధంబులన్;
చెలిచిం తైకొని తొత్తు సాంగముగ వర్తించుం; గళాసించు ను
గ్మలి యా ర్త్రొక్కితె వ్రాలు సోలములలోఁ గాదంబరీగోష్ఠిచేన్. ౧౨౦

## సురతవర్ణనము

తే. తనరు నెనుబదినాల్గుబంధములయందు
నమరుఁ బ్రచ్ఛన్నమును బ్రకటము ననంగ
సురతములు రెండు; వానికి స్ఫురణసొంపు
వలయు వర్ణింప నిఖిలకావ్యములయందు. ౧౨౧

సీ. పొలయల్కఁ దలఁపులఁ బులకించుఁ, బులకించి బింకంపుఁగౌఁగిళ్ల బిగి భజించు
మరుచిన్నె లున్నెడఁ బరికించుఁ, బరికించి చొక్కుఁ, జెమర్చినయిక్క లరయుఁ,
దొలిప్రొక్కు చెలిచెవిఁ జిలికించుఁ, జిలికించి మురిపెంపుసిగ్గున మారిఁబోవుఁ,
బంజరంబునచిల్కఁ బలికించుఁ, బలికించి నొడువు లాలము లైననోరు నొక్కు,

తే. సొబగుటడుగులలత్తుక చూచుఁ, జూచి
యరిగి శయనీయ మారయ నప్పళించు,
నలఁది యొక్కర్తు చాళుక్యవిభునిచేత
భావజాతుని గెల్చినభావ మొప్ప. ౧౨౨

## విప్రలంభ వర్ణనము

క. అప్పుడు వెన్నెలచేఁ గడు-నొచ్చుటలును మాన మెడలి వెడవిల్తునిచే
నొచ్చుటలును బ్రియుఁ డబ్బని-ముచ్చటలును విప్రలంభమునఁ జెప్పఁదగున్.

ఉ. ఎల్లిర మయ్యెఁ దాల్మి, తగ నెల్ల వివేకము వింత యయ్యె, మి
న్నెల్లను జంద్రుఁ డయ్యె, మన మెల్ల మనోభవుతూపు లయ్యె, మే
నెల్లను సన్న మయ్యెఁ, జెలు లెల్ల విరోధు లైరి, విశ్వభూ
వల్లభుతోడియల్కగరువంపుఁజలంబునఁ బువ్వుఁబోఁడికిన్. ౧౨౪

## ప్రయాణవర్ణనము

క. గజ రథ హయ సూచిత మగు-విజయమ్మున నుబ్బి నడచువిశ్రుతవివిధ
ధ్వజిని వినుతించు నెప్పుడు-భజనీయము సుకవి సత్ప్రబంధములందున్. ౧౨౫

మ. కర ముద్యత్కరవాలభైరవపతాకాఖేలనం బై పరి
స్ఫురదుగ్రాయుధదీప్తిపూరితనభోభూభాగ మై సంచర

తురగోద్ధూతరజోతిధూసరహరిత్కూలంబు లై యుద్ధలిం
బరిభాసిల్లఁ జళుక్యనాథుని చమూభద్రప్రయాణం బిల్లన్. ౧౨౬

## వివాహవర్ణనము

క. ప్రచురస్వయంవరోచిత-రచనలఁ గన్యావరాభిరమ్యక్రియలున్
విచితశుభాత్మకవిధులును-రుచిరవివాహంబులందు రూపింపఁ దగున్. ౧౨౭

ఉ. సంతతమంగళధ్వనులు చామర మౌక్తికపుండరీకముల్
వింతవిభూతి గా నురుకవిస్తుతివేళ వరించెఁ బొంత స్రా
మంతుల నుజ్జగించి కడు మచ్చికనెచ్చెలు లైన నీతి వి
క్రాంతులు చూపఁ గోరి జయకన్యక వచ్చి చళుక్యవల్లభున్. ౧౨౮

## పుత్త్రోదయవర్ణనము

క. మిత్రానందోదయము న-మిత్త్రత్రసనంబు శుభనిమిత్తంబును స
త్పాత్రకృతవితరణంబును-బుత్త్రోదయమందుఁ దద్ద పొగడఁగవలయున్. ౧౨౯

ఉ. చిత్రము పోర విశ్వవిభుచే నసిపుత్త్రికఁ గన్నపుత్త్రి లు
ద్యత్త్రిదశాకృతిం బడసి యౌవనసంపదఁ జెంది మంగళా
మత్రము లై వెలుంగునెడ మంజులయుక్తిఁ దనర్చు దివ్యవా
దిత్రరవంబు నింపొదవుఁ దెమ్మెరలున్ సురపుష్పవృష్టియున్. ౧౩౦

## మంత్రవర్ణనము.

క. అగవాక్షము నస్తంభము-ననుగూఢాభ్యంతరముల హర్మ్యాగ్రమహా
నగశృంగంబుల మంత్రము-దగ నొనరింపంగ ననుచుఁ దను వర్ణింపన్. ౧౩౧

మ. అలుకం బోరికి నెమ్మిమైఁ దరలుచోఁ బ్రారంభణోపాయమున్
బలసంపత్తియు దేశకాలగతులున్ భంగప్రతీకారమున్
ఫలసంసిద్ధియు నిర్ణయించు టనునీపంచాంగమంత్రక్రమం
బులు తర్కించుచళుక్యనాథు వెర వొప్పున్ బూజ్యరాజ్యక్రియన్. ౧౩౨

## దూత్యవర్ణనము

క. ప్రతిభయుఁ బరమంత్రవిభే-దితయును బతిరక్తియును దితిక్షయు నిర్వ్యా
ర్ఘతయును నవ్యసునీతియుఁ-జతురతయును దూత్యమునను జను నుతియింపన్.

శా. ఉత్తేజం బగువిశ్వభూవిభుని దూతోదారసమ్యక్ప్రసో
క్తిన్ విశ్రుత మైనసంధి గనుభూపశ్రేణియున్ దుర్మదా
యత్తస్వాంతత నిగ్రహించు నరనాథౌఘంబె వర్తించు న
త్యుత్తుంగాచలచిత్రకూటములయందుం జెంది యశ్రాంతమున్. ౧౩౪

## సమరవర్ణనము

క. పటురథకరిహరిభటసం-ఘటితవ్యూహాదికములు ఘనఫలకాని
స్ఫుటరుచులు విజయకారణ-పటహాడంబరముఁ బొగడఁబడుఁ బోరాటన్. ౧౩౫

మ. అమరాహీనరవంబు వీరసుభటాహంపూర్వికానాదముల్
విమలాస్త్రప్రతిఘాతనధ్వనులు నున్నిద్రంబులై పర్వ న
గ్రిమవిశ్రాంతికి మెచ్చి నారదుఁడు నర్తింపన్ మహాయోధనం
బమరుం జూడఁ జళుక్యవల్లభునిశూరాటోపముం జూపుచున్. ౧౩౬

దోర్వీర్య-వర్ణనము

క. అరులఁ జనఁ దోలి యార్తుల-నరుదారం గాచి హరులయడియాలములన్
బిరుదంబులఁ గైకొను న-న్నరపతివిజయంబు కీర్తనము సేయఁ దగున్. ౧౩౭

ఉ. ఆచతురాశ్వసంఘము రణాంగణసంభవ, మా సువర్ణపే
టీచయ మాజి శత్రువులు డించి తొలంగిన వస్తుసంభృతం,
బీచతురంతయానముల యింతులు రాజతనూజ, లంచు మెం
డై చని విశ్వనాథువిజయంబు నుతింతురు పౌరకామినుల్. ౧౩౮

---

మ. ఇటు లష్టాదశవర్ణనాకలితమై యేపారు కావ్యంబు నం
తటఁ బాటించి తదర్థసంఘటనముం దర్కించి భావోదయ
స్ఫుటభేదంబు లెఱింగి తద్రసగతుల్ శోధించి యచ్చంపు మె
చ్చుటకుం దావలమై చళుక్యపతి సంశోభిల్లు నెల్లప్పుడున్. ౧౩౯

ఉ. రాజనరేంద్రవంశజుఁడు రాజపటీరసుధాసుధాకర
భ్రాజితకీర్తి రామరఘురామపరాక్రమసంప్రవర్తి యం
భోజహితప్రతాపుఁడు రిపుక్షితిభృత్కులిశంబు సత్కళా
భోజుఁడు దానధూత సురభూజుఁడు భువనపోషణుం డిలన్. ౧౪౦

క. సుందరుఁ డభినవవిభవ పు-రందరుఁ డాంధ్రేశ్వరాభిరాముఁడు రామా
కందర్పుఁ డమందయశ-శ్చందనపరిలిప్తదిగ్గజవ్రజుఁ డెపుడున్. ౧౪౧

మాలిని

అనఘసుకృతధుర్యుం డార్యసంస్తుత్యశౌర్యుం
డనలసదృశతేజుం డగ్ర్యచాతుర్యభోజుం
డనిశరిపుశరణ్యుం డంధ్రభూపాగ్రగణ్యుం
డనుగతశివతంత్రుం డాప్తమంత్రుండు బుద్ధిన్.

గద్యము.

ఇది శ్రీమదుమారమణచరణారవిందవందన గోవిందామాత్యనందన విబుధబుధవిధేయ
విన్నకోట పెద్దయనామధేయ విరచితంబైన కావ్యాలంకారచూడామణి
యనునలంకారశాస్త్రంబునందు నాయక నాయికావివిధవిశేషలక్షణ
ప్రబంధలక్షణోదాహరణసముద్దేశం బన్నది
తృతీయోల్లాసము.

---

# చతుర్థోల్లాసము

---

క. శ్రీవిశ్వేశ్వరకరుణా-శ్రీవిలసిత నిష్కళంక చిత్తుఁడు కీర్తి
శ్రీ విశద చక్రవాళుఁడు-శ్రీవిశ్వేశ్వర నరేంద్రశేఖరుఁ డొప్పన్. ౧

క. ఇత్తెఱఁగున నష్టాదశ-వృత్తం బగు కావ్య మొప్ప విరచింపఁ దగున్
మొత్త మగు నఖిలబలసం-పత్తియుఁ గలవేళ సుకవి ప్రతిభ దలిర్పన్. ౨

క. కృతిముఖమున దేవ నమ-స్కృతి యొండె నభీష్టవస్తుకీర్తన మొండెన్
వితతాశీఃపద మొండెను-బ్రతిపాదింపంగవలయు భద్రాపేక్షన్. ౩

మ. కవిసంసిద్ధపదంబు భావరసవిఖ్యాతంబు లోకోచిత
వ్యవహారంబు నుదాత్తనాయకము శ్రవ్యంబుం జతుర్వర్గ సం
భవసద్మంబును నైనకావ్య మిల నాపద్మోద్భవస్థాయి యై
కవిసంస్ఫూర్తియు దాతృకీర్తియుఁ దగం గల్పించు నెల్లప్పుడున్. ౪

## కావ్యభేదములు

తే. అట్టికావ్యంబు త్రివిధ మై యతిశయిల్లు
నవనిఁ బద్యమయంబు గద్యాత్మకంబు;
పద్యమయ మొప్పు ఛందోనిబద్ధ మగుచు
గద్యమయ మొప్పు వాక్యసంకలిత మగుచు. ౫

క. ఆపద్యగద్యకృతములు-రూపకములు నాటకములు రూఢము లగు నా
రూపమ చంపూకావ్యత-ప్రాపించును, నాటకములు బహువిధము లరయన్. ౬

తే. సర్గబంధంబు కావ్యంబు సంస్కృతమునఁ,
బ్రాకృతంబున నాశ్వాసభాసురంబు,
నాటకము లెల్ల నంకసనాథకములు,
గద్య ముచ్ఛ్వాస లంబకాంకంబ యండ్రు. ౭

క. ఇటువలెనె ముక్తకాది-స్ఫుటతరచాటుప్రబంధములలక్షణముల్
పటుమతి నెఱుఁగుట సుయశో-ఘటనంబుల కెల్లఁ గుదురు కవినృపతులకున్. ౮

## ముక్తకాదులు

సీ. పరఁగు ముక్తక మేకపద్యంబు, పద్యద్వయంబు ద్వికము నాఁగ నలరు, మూఁడు
పద్యముల్ త్రికము నా భాసిల్లుఁ, బంచపద్యంబులు పంచరత్నంబు లరయ,

గణమాల పద్యాష్టకము, పద్యనవకంబు నవరత్నమాలిక, నలినమిశ్ర
మాలిక పండ్రెండు మధురపద్యము, లింపు కళి షోడశశ్లోక కలిత యైన,
తే. సప్తవింశతి యైన నక్షత్రమాల,
తెలియ నుప్పరి పద్యముల్ త్రింశదాఖ్య,
మరలఁ బంచాశదాహ్వయం బైరుపదులు,
శతక మన నొప్పు మఱి పద్యశతము గూడ. ౯
క. అష్టోత్తరశతపద్యము-లష్టోత్తరశతక మనఁగ నడరుఁ గవీంద్రుం
డిష్ట మగు సంఖ్యఁ జెప్పిన-నిష్టము గా నదియుఁ గర్తతుష్టిని జేయున్. ౧౦

## ఉదాహరణ లక్షణము

క. ధరఁ జాటుకృతులలోనం-బరఁగు నుదాహరణ మనుప్రబంధము, తద్వి
స్తరలక్షణంబు బరువడిఁ-బరికింపఁగఁ దగు నశేషభాషాకవులున్. ౧౧
క. చతురశ్ర త్ర్యశ్రాది వి-తతయతి తాళములు గలుగుదళముల నెల్లన్
గృతగుచ్ఛానుప్రాసం-బతులితగతి నిలుపఁ దగు నుదాహరణలకున్. ౧౨
క. సురభాషాదిప్రాకృత-పరిభాషల నైన నితరభాషల నైనన్
విరచించుట యుక్త ముదా-హరణ మిలాసురముఖాదు లగుపుణ్యులకున్. ౧౩

## విభక్తులకు మాఱుపేరులు

సీ. ప్రథమావిభక్తి చొప్పడు వాణి నాఁగ, రెండవయది యుట నాఁగ నతిశయిల్లుఁ,
గీర్తి మూఁడవవిభక్తికిఁ బేరు, నాలవయది దేవలాభిని యండ్రు కృతులఁ,
బంచమి పాణి నాఁ బరఁగు, షష్ఠవిభక్తి పాటిల్లు సుకవులు మోటి నాఁగ,
సప్తమి ఘోటికాసంజ్ఞిత, సంబుద్ధి సరసావళీనామ; జగతి వీని

## విభక్తుల దేవతలు

తే. కయినవేల్పులు వీరావళియును గీర్తి
మతి సుభగయును మఱి భోగమాలినియును
మహిఁ గళావతియును గాంతిమతియుఁ గమల
యును జయవతియు నాఁగను నొప్పు నెపుడు. ౧౪
క. ఈవిదితాష్టవిభక్త్యధి-దేవత లాత్మీయనామధేయసమము గా-
భావింపఁ దగినశుభములఁ-గావింతురు కర్తృనాయకద్వయమునకున్. ౧౫
క. మును శుభగణవర్ణతఁ బ-ద్యనమాలిని యొండెఁ జండవృత్తమ యొండెం
దనరింపవలయుఁ బ్రథమకు-ఘనకలికాష్టకతదర్థకలికాయుక్తిన్. ౧౬
క. ఇం బడరఁగఁ బ్రథమాదుల-సంబుద్ధ్యంతములకైన సరళవిభక్త్యా
లంబనపద్యంబుల విరు-దంబులు గలవారుదములు దగ నిడవలయున్. ౧౭
తే. కళిక యేతాళమునఁ బరిఘటిత యయ్యు
నుత్కళికయును దానన్న యర్థానుపవలయు,

సంఖ్య చాతుర్థికోత్కలికాఖ్య చూడఁ
బడి చతుర్థియుఁ బోలెఁ జాపట్టకలయు. ౧౮

క. ఓజఃపదబహుళము వి-భ్రాజితపటుగాఢరీతిబంధురమును ని
చ్ఛాకారరసవిభావ వి-రాజితమును గా నుదాహరణ దగుఁ జెప్పన్. ౧౯

క. నాయక విభవమునకుఁ గవి-నాయక చతురతకు భాజనం బగుపద్యం
బాయితము సేసి యిడఁ దగు-నాయతిగాఁ దుదలయం దుదాహరణాలకున్. ౨౦

## సద్దళి

క. సంబుద్ధి విడిచి మును గల-సంబంధం బెడల కుండ సప్తవిభక్త్యా
డంబర మడరించిన నొడి-కం బగు సద్దళి యనంగఁ గవులకుఁ జెప్పన్. ౨౧

## పద్దళి విద్దళి

తే. పరివిభక్తుల సంబుద్ధిసహిత గాఁగఁ
చెప్ప నొప్పారుఁ బద్దళి సిద్ధ మగుచు,
ముక్తసంబుద్ధి విమలవిభక్తికలిత
మైనకృతి పేరు విద్దళి యండ్రు బుధులు. ౨౨

## కల్యాణి ఉత్ఫుల్లకము

క. కేవలకలికాసంగతిఁ-గావించినకృతికిఁ బేరు కల్యాణి యగున్
వావిరి నుత్ఫుల్లక మది-యావల నుత్కలికలోన యడికిన యేనిన్. ౨౩

తే. గ్రంథబాహుళ్య భీతత్వకథన మిదియు,
ధర నుదాహరణాది భేదములు పెక్కు,
తెలియఁ దొండెడ, మఱికొన్ని తేటపఱుతుఁ
బటుపదార్థాప్తిఁ జాటుప్రబంధములను. ౨౪

## బిరుదములు

క. బిరు శబ్దంబు విరోధో-త్కరము మహారాష్ట్రభాషఁ దత్ప్రవిధులన్
బిరుదము లనఁ జను వానిన్-ధర బిరుదావళి యొనర్పఁ దగు నండ్రు బుధుల్. ౨౫

చ. అతులకులక్రమాగతము లై భుజవిక్రమ సంభవంబు లై
ప్రతిపదసార్థకంబు లయి పార్థివకర్ణకఠోరకంబు లై
వితరణశబ్దపూర్వపృథివీవర చిహ్నము లై తనర్చు న
ద్భుతబిరుదాళిచేత బిరుదార్థము చెప్పుట యొప్పు నెప్పుడున్. ౨౬

క. వినయ భుజవిక్రమక్రమ-ఘనవితరణ రణవిహార కరుణాది కళా
జనన స్థలు లగుగుణములఁ-బెను పొందఁగఁ జెప్పవలయు బిరుదావళికిన్. ౨౭

క. సముచిత తాళదళమ్ములు-సమధిక పటుగాఢరీతి సందర్భములన్
సుమనోభామం బొలుపుగ-నమరింపుదు కవులు ప్రాకృతాదుల నైనన్. ౨౮

తే. పద్యదళ వాక్య తద్దళ పరిసమాప్తి
గదుగుపట్లను నెడ నెడఁ గలుగవలయు
ధీర గంభీర జయ దేవదేవ యనెడు
లలితసంబుద్ధివచనంబు లాలయవలయు. ౨౯

క. ఉచితవిభక్తికమును గుణ-రుచి రాలంకార రస నిరూఢము నాశీ
ర్వచనంబును నగుపద్యము-రచియింపఁగ వలయు మొదల రంజన మొప్పన్. ౩౦

## గుచ్ఛములు

క. మెండగు దళములు నాలుగ-యుండెను షట్కంబ యుండె నుండఁగఁ దుదపై
నుండును గద్యము గొనిమిది-యుండెం బదియాఱు నొండె నురుగుచ్ఛములై. ౩౧

క. ఇడఁ దగు నూతనయతిసం-గడి దళములు నాలుగైనఁ గడ నాఱైనన్
బెడఁ గగువర్ణావృత్తులు-వడలింపఁగవలయు నంద్రు విరుదావళికిన్. ౩౨

క. బంధురముగ నిట్లతుల-స్కంధచతుష్కంబుచేతఁ గవి విభుని యశో
గంధాధివాసితాశా-సింధురముగ దీవనల విశేషింపఁ దగున్. ౩౩

## చక్రవాళము

క. పద్యం బొక్కటి మొదలను-గద్యాష్టక ముచితదీర్ఘగతిఁ గబ్బములన్
హృద్యదళాష్టక మిడిన స-ముద్యతి మగుఁ జక్రవాళ మూహింపంగన్. ౩౪

తే. వరుస నాదిమపద్యాంశవర్ణయుగళ
మంత్యవాక్యాదిమాక్షరయమళకముగ
నిడి చతుఃస్కంధములయందు నిట్లు గొప్ప
నచ్చముగఁ జక్రవాళత్వ మబ్బుఁ గృతికి. ౩౫

క. కవినామనాయకస్వ-స్తివచఃకవితాద్యపద్యశిఖరంబులఁ బ
ల్లవ మైనవర్ణయుగళం-బవిరళముగ నాద్యమునకు నాద్యక్షరముల్. ౩౬

## గుచ్ఛతతి

క. తొలి తొలిపద్యముసఁ జతు-ర్దళమును నట పల్లవద్వితయ మంతమునన్
గలఘనపద్యము నాలుగ-దళముల నన్నింట గుచ్ఛతతి యన వలయున్. ౩౭

క. కలయఁగ సంబుద్ధ్యంతర-ముల నునుపఁగవలయు నందముగ జయ జీవో
జ్జ్వల దేవాదిపదంబులు-నలి నిడుచతురుత్తరంబు నలుమాఱైనన్. ౩౮

## చతుర్భద్రము

క. ఇదియె చతుర్భద్రం బగు-నదమలధర్మార్థకామసహితస్తుతులం
బొదివికొని సర్వరీతుల-నిదితం బగు నేని శాస్త్రవిదులకు నెక్కున్. ౩౯

## రగడ

క. సరి యా పదితతులచేఁ-బరువడి నుత్సాహవృత్తపదయుగళముచే
నిరవుగ వడిప్రాసంబుల-నరుదుగ రచియింప రగడ యగుఁ దగువృత్తిన్. ౪౦

## మంజరి

క. శృంగారప్రాయముగా-రంగద్ద్విదళిన ప్రాసంగ రచియింపంగా
శృంగారమంజరీకృతి-సంగత యగు సకలరాగ సంభృతరీతిన్. ౪౧

## దండకము

క. ఛందోభవలక్షణగణ-సందోహనిబద్ధ యగుచు శ్రవణానందా
మందానుప్రాసంబుల-నందం బగు దండకము మహాకవికృతులన్. ౪౨

క. ఇవి యెల్లను నానావిధ-కవికృతశాస్త్రములచేతఁ గల్పితములు, పె
క్కువిధంబులఁ జాటుకృతి-ప్రవరంబులు పరఁగు నెఱుఁగఁబడు నొండెడలన్.

సీ. అపూర్వలక్షణోదాహరణావలి యుల్లంబునకు నింపు నొసఁగఁజేని
బిరుదావళీముఖ్యపృథులప్రబంధౌఘములు దిగంతంబుల మ్రోయవేని
పటువచశ్చంద్రాదిభవ్యచాటూక్తులు నృపతులవీనులు నిండవేని
మధురార్థదండక మంజరీమంజూష బుధుల నింపుల మూరిఁ బుచ్చదేనిఁ

తే. గరలి చని ముక్తకాదులు కీర్తిలతలఁ
జక్రవాళాద్రిమీఁదికిఁ బ్రాఁకవేనిఁ
గడఁగి మెచ్చునె యొకపాటిగంతచాటు
చాటుకృతులకు విశ్వేశచక్రవర్తి. ౪౪

## ప్రాధాన్యములు

క. అరయ వస్తురసాలం-కారప్రాధాన్యవృత్తిఁ గబ్బంబులు పెం
పారుఁ ద్రివిధార్థఘటనల-ధీరులు పరికించి వానిఁ దెలియఁగవలయున్. ౪౫

## వస్తుప్రధాన్యములు

క. వేడుక విశ్వేశుఁడు శివ-చూడామణిసలమునందు సుస్థిరుఁ డటన్
జూడఁ గనకాద్రి కవఖుం-గూడక యావ్వెండికొండ కొండిక యయ్యెన్. ౪౬

## రసప్రాధాన్యము

క. వలిచన్నులు నగుమొగములు-చలిగన్నులు మేనిజిగలు తియ్యనిపలుకుల్
సలిలఘనదుములు మరుతూ-పులఁ బ్రోచుఁ జళుక్యవిభునిపాలఁతుల కపుడున్. ౪౭

## అలంకారప్రాధాన్యము

క. లగ విశ్వేశ్వరుచే సిరి-నెగడిన సత్కవులు దాననిపుణతఁ గర్ణున్
నగుదురు, కల్పమహీజముఁ-దెగడుదు, రదలింతు రమరధేనువు నెనన్. ౪౮

## స్ఫురణములు

తే. తనర శబ్దస్ఫురణము నర్థస్ఫురణము
నుభయవిస్ఫురణము నన నుల్లసిల్లు;
నిత్తెఱంగులు మూఁడును నెఱుఁగవలయుఁ
జారుశబ్దార్థగౌరవశక్తివలన. ౪౯

### శబ్దస్ఫురణము

క. కంఠీరవకరీన భటా-కుంఠితకంఠార వావకుంఠితరుచి సో
ల్లుంఠనములు సురవనితో-త్కంఠం గావించు విశ్వధరణీపుసేనల్. ౫౦

### అర్థస్ఫురణము

చ. తనరెడుఖడ్గధారమును ద్రావినవారి విరోధిభీరులో
చనముల నుప్పతిల్లి కడుఁ జక్రనివాహిను లయ్యె; నైనన
య్యనువునఁ గ్రొత్తపెండ్లికొడుకై మఱి నుబ్బుచునుండు సాగరుం
డనిఁ గరవాలభైరవు మహత్త్వము చిత్రమ కాదె యెప్పుడున్. ౫౧

### ఉభయస్ఫురణము

స్రగ్ధర

లాటీఘాటీవరాటీలలితకుచతటీలగ్న పాటీరచర్చం
జాటించుం, జంద్రకాంతోపలములఁ గరఁచుం, బర్వి చక్రాంగియుం దా
ఘాటోద్యత్తీవ్రరవాసక్తములుగ నదులం గట్టు గంధానుబంధిన్
జాటు శ్రీతోడ విశ్వేశ్వరుని సితయశశ్చంద్రికాసారవేలిన్. ౫౨

### శయ్య

క. ముకురతరమై యొండొంటికిఁ-బదమైత్రి గలిగి నొడువుపలుకులలోనన్
బొదలెడు నర్థం బెచ్చటఁ-బదలించి శయించు శయ్య యనఁగా నదివో. ౫౩

చ. ఎదుర చళుక్యవిశ్వవిభు చారుగుణంబు లరాతిరాజిరా
జితనయహేతుభూతము, లశేషవిశేషవిహారవిక్రమో
చితరతు, లాగ్యచర్యలకు జీవిత, మంచితసంచితాగమా
శ్రితమతి భారతీవదనదర్పణ, ముత్తమదర్పసంపదన్. ౫౪

### పాకము

క. పాక మనంగా నర్థని-రాకులగంభీరయుక్తి, యది యిరుదెఱఁగై
లోకమునఁ బేర్చు ద్రాక్షా-పాకంబును నారికేళపాకము ననఁగన్. ౫౫

### ద్రాక్షాపాకము

క. బహిరంతః స్ఫురితార్థో-పహితరసప్రసర మగుచుఁ బద్యము సుఖసం
గ్రహపద మెచ్చట నదియో-మహి ద్రాక్షాపాక మనఁగ మధురం బొప్పున్. ౫౬

శా. లీలా మన్మథ మంథరంబులఁ గటాక్ష లాలిత భ్రూలతా
కేళిశ్రీలఁ గపోల ఫాల రుచి సాకూతానురాగంబులన్
సాలస్యంబులు నైన కౌతుకపరీతాలోకజాలంబులన్
బాలారత్నము లిట్లొల్పె ముద మొప్పన్ విశ్వభూపాలుపై. ౫౭

## నారికేళపాకము

క. అంతర్గూఢార్థసర-స్వంతం బగు వాక్యగౌరవంబు మనీషా
వంతులకు నెక్కుఁ గవితా-భ్యంతరముల నారికేళపాక మనంగన్. ౫౮

శా. హృజ్జాతుండు వటుండు వోలె నట విశ్వేశక్ష్మాభర్తకున్
లజ్జాకాండపటంబుచాటున వధూ లావణ్య లాస్యంబులన్
సజ్జాతంబులఁ జేసి చూపెడు లసత్స్వారాంగవారాళిచేఁ
బజ్జం గొందఱు కామినీమణులు రూపద్దర్ప లై చూడఁగన్. ౫౯

---

## అర్థవృత్తులు

ఆ. ముఖ్య లక్ష్య గౌణములును వ్యంగ్యంబు నా
నర్థవర్తనంబు లయ్యె నాల్గు
వానివలనఁ గలుగు వాచ్యభేదంబుల
నరసి తెలియవలయు నంద్రు బుధులు. ౬౦

## ముఖ్యార్థము

క. వ్యుత్పత్తిము సగళంబును-నవ్యాజము నైన యర్థ మగు ముఖ్య మనన్,
శ్రవ్యముగ నదియు జాతి-ద్రవ్య గుణ క్రియలచేతఁ దగు నాల్గనఁగన్. ౬౧

## లక్ష్యార్థము

ఆ. ఊహనీయ లక్షణోపేత మగునర్థ
మరయ లక్ష్య మనఁగ నతిశయిల్లు,
గంగయం దనంగ గంగా తటంబునఁ
గలిమిఁ జెప్పఁజాలు కారణమున. ౬౨

## గౌణార్థము

క. గుణ సాదృశ్యంబున ను-ల్బణ మగునర్థంబు గౌణఫణితము, గడు భీ
షణహరి యానృపుఁ డనఁ ద-ద్గుణ మగు విక్రమము దెలియఁ దోఁచుట చేతన్. ౬౩

## వ్యంగ్యార్థము

ఆ. ముఖ్యలక్ష్యగౌణముల యర్థములఁ ద్రోచి
యితర మర్థ మెచట నింపు నొసఁగు
వ్యంగ్య మంద్రు, కైరవంబులు విరిసె నాఁ
గమలవైరి పొలుపు గానఁబడుట. ౬౪

## ధ్వని

క. పాకాదికృతవ్యంగ్య-వ్యాకీర్ణం బైన కావ్య మది యుత్తమ మై
చేకొనఁబడు మధురార్థ-శ్రీకము ధ్వని యనెడుపేరుచేఁ జెలు వొందున్. ౩౫

ఉ. ప్రీతిఁ జళుక్యవల్లభుఁడు పృథ్వి వహించి గుణాఢ్యుఁ డైనచోఁ
జాతమదాష్టదంతులు వశావశతన్ జరియించె, గూలికిం
జేతుల భూషణస్ఫురణఁ జేకొనె, వార్ధులు గోత్రభూధర
వ్రాతము నిల్వ నయ్యెఁ, గడు మ్రాన్పడె నిర్జరపాదపంబులున్. ౩౬

---

## శక్తిగ్రాహకములు

సీ. విహితసంయోగంబు విప్రయోగంబును సామర్థ్యమును సాహచర్యకంబు
నర్థవిరోధ లింగౌచిత్య చేష్టలు పరశబ్ద సన్నిధి ప్రకరణములు
దేశ కాల క్రమాదికములు శబ్దార్థ కలితానవచ్ఛేదకల్పనములు
స్మృతి హేతుకములు విశేష వాక్యస్వర వ్యక్తులు నానాఁ బర్యాయగుల

తే. వలయు నన్నింట నర్థంబు నవగమింపఁ
దగు ననేకార్థయుతము లై తనరుశబ్ద
సంతతుల నర్థసంధానచతురు లెల్ల;
నింకఁ బద్వృత్తు లెఱిఁగింతు నెఱుఁగ వలయు. ౩౭

## కావ్యవృత్తులు

క. ధీరస్తుత కైశికియును-నారభటియు సాత్త్వతియును నట భారతియున్
జారుతరవృత్తు లివి శృం-గారాదిరసంబులందుఁ గరణీయంబుల్. ౩౮

## కైశికి

తే. సకల సుకుమార మధురార్థ సరళ రచిత
కైశికీవృత్తి; శృంగార కరుణ రసము
లధికసుకుమారములు, వాని నగు నొనర్పఁ
గైశికీవృత్తిచేతన కవుల కెల్ల. ౩౯

మ. దళదిందీవరసుందరంబులును నంతఃకౌతుకాంకూరసం
వళితస్నేహములున్ బ్రసన్నములు నై వర్తిల్లు నాలోకనం
బు లుపేంద్రాత్మజు నిందువంశజుఁ గళాపూర్ణాత్మకుం జూచుచోఁ
బాలిచెం బార్తికి సానురాగరససంపూర్ణంబు లై యత్తఱిన్. ౪౦

## ఆరభటి

క. ఆరభటీవృత్తి యనఁగ-నారూఢాభ్యుద్ధతార్థ, యత్యద్భుతము
లౌ రౌద్రము బీభత్సము,-నారభటీవృత్తిఁ జెప్ప నగు నీరెండున్. ౪౧

మ. అతికుప్యత్పరగండభైరవ మహోద్యత్ఖడ్గ ముగ్రాకృతిన్
బ్రతిపక్షప్రకరంబు నొంచు నలఁచున్ భంగించు దండించు న
ద్ధతి నుగ్గించు వధించు ద్రవ్వు యమకోదండ ప్రచండక్రియా
గతి రూపించు నటక్కబంధమయు సంగ్రామంబు భీమంబు గాన్. ౭౨

భారతి

తే. భారతీవృత్తి కైశికల్పనము చూడ
నర్థమించుక సుకుమార మై తనర్చు;
నల్పమృదువులు హాస్య శాంతాద్భుతములు
భారతీవృత్తిచేఁ జెప్పఁబడు నవియును. ౭౩

మ. అతికందర్పము రూప, ముజ్ఝితసుపర్వానోకహం బీగి, నిం
దితచంద్రద్యుతి కీర్తి, గర్హితసురాద్రిస్ఫూర్తి ధైర్యంబు, కుం
ఠితకంఠీరవ ముగ్రవిక్రమము, వర్ణింపం జతుర్వార్ధనీ
పతి; కీయద్భుతవృత్తి మేనృపులకున్ బాటిల్లునే యెచ్చటన్? ౭౪

సాత్త్వతి

తే. సాత్త్వతీవృత్తి నాఁగ నీసత్త్వగల్భ
సార్థరూపిణి; వీర భయానకములు
నీసకు త్రిప్రగల్భసమీహితములు;
సాత్త్వతీవృత్తిచే వీని జరుపవలయు. ౭౫

మ. అతిదృప్యత్కరవాలభైరవపతాకాభీలకోలధ్వజా
కృతులం జాచినవీరు లుబ్బుదు రొగిన్ గీర్వాణలోకార్థులై,
సతతత్రస్తులు దూలిపోదురు మహాశైలాగ్రకూటార్థులై,
గతవిద్వేషులు విశ్వనాథ వినుతు ల్గావింతు రాత్మార్థులై. ౭౬

---

కావ్యరీతులు

తే. అఖిల కావ్యంబులకు రీతు లాత్మ యండ్రు;
ప్రాణదశకంబు వానికిఁ బ్రాణ మరయ;
ధర నలంకారమతవిశేదముల నవియుఁ
జెక్కు, లోక కొన్ని తగఁ గానిపింతుఁ జెలియ. ౭౭

క. ఈడిత లగు వైదర్భీ-గౌడీ పాంచాల లాటికా రీతులు కా
వ్యాడంబరకరుణార్థ-క్రీడలఁ జరురాహ్వయములఁ గృతకృత్యులచేన్. ౭౮

గుణములు

క. క్రమమున నౌదార్యశ్లే-షములును సుకుమారతా ప్రసాద మధురతా
ము తార్థవ్యక్త్యోజ-స్సమాధి కాంతులును దగు దశప్రాణము లై. ౭౯

### ఉదారత

క. వినుతసుశబ్దార్థంబులఁ - దనరు గుణోత్కర్షణం బుదారత్వ మనన్
జను; నది పూర్ణబహుళిత - ఘనఘశ్లాఘోదయమున నగుఁ గల్పింపన్. ౫౦

### శ్లేషము

క. అశిథిలపదబంధం బై - విశదాల్పప్రాణవర్ణవిస్పష్టం బై
కుశలగతి నొప్పు శ్లేషము - విశేషకావ్యముల కెల్ల విభవప్రద మై. ౫౧

### సుకుమారత

క. శ్రుతిసుఖకరవర్ణంబుల - నతికోమల మైనరచన మలవడు సుకుమా
రత నాఁగఁ, గ్లిష్టశాస్త్రి - ప్రతివాదపటిష్ఠనుతులఁ జేకొను నదియున్. ౫౨

క. లలిఁ బదములతో నర్థము - సలలిత మగు నెచట నది ప్రసాదము కృతులన్
వలిపపుఁబయ్యెదలోనన్ - దోఁ కొడెడువలుదచన్ను వోయిని బోలెన్. ౫౩

### మాధుర్యము

క. పటుబంధంబులు మృదుల - స్ఫుటవిన్యస్తాక్షరములుఁ బూరితరస సం
ఘటిత పదార్థంబులు నె-చ్చట నగు మాధుర్య మనఁగఁ జను నది కృతులన్. ౫౪

### సమత

క. దొరఁకొన్నకొలఁది విడువక - చరణపదార్థములనడక సరి సాగెడు వి
స్ఫురణ యది సమత యనఁ జను; - నరయం గుకవులకు నంద దది పరికింపన్.

### అర్థవ్యక్తి

క. తనరఁ గ్రియా కారక యో-జన మత్యవ్యస్తసరణిఁ జనకుండ యథా
జనితాన్వయముగఁ జెప్పినఁ - గనదర్థవ్యక్తి నాఁగఁ గవితల నొప్పున్. ౫౬

### ఓజస్సు

క. ఓజోగుణ మనఁగా వి-భ్రాజిత మగుఁ బటుసమాసబాహుళ్యము రా
రాజదనుప్రాసాక్షర-భాజన మై యొప్పు శబ్దభాసురఫణితిన్. ౫౭

### సమాధి

క. స్థావరజంగమధర్మవి-భావితచరితములు వీడుపడక రసార్థ
ప్రావిర్భావము లగుటయ-భావింప సమాధి యనఁగఁ బరఁగుం గృతులన్. ౫౮

### కాంతి

క. లోకవ్యతిరిక్తార్థ-శ్రీకలితయు నూతనప్రసిద్ధవిరచనా
పాక కమనీయయును నగు-నాకబ్బము సొబగు కాంతి యనఁ జనుఁ గృతులన్. ౫౯

---

## రీతుల లక్షణోదాహరణములు

### వైదర్భి

ఆ. ప్రాణదశక యుక్తి నల్ప ఘోషముల వర్గద్వితీయబహుళత గలిగి ద్విత్రి
పదసమాస యైనఁ బరఁగు వైదర్భి సమాసరహిత యైన మధుర యండ్రు. ౯౦

చ. భుజమున విశ్వభూవరుఁడు భూధరముం దగఁ దాల్చెఁ దాల్చినం
గజ భుజగేంద్రులుఁ గుధర కచ్ఛప ఘోణులుఁ గామితక్రియా
భజనమునం జరింతు రని ప్రస్తుతులం బ్రసరించుచున్న యా
ద్విజ యజనంబులం ద్రిదశతృప్తి సమాప్తి వహించు నద్దివిన్. ౯౧

### గౌడి

క. ఘటితసమాసోద్భటపద-పటలయు నోజస్సుకాంతి భరితయు ఘోష
స్ఫుటవర్ణయు నిబిడాఘో-త్కటయును నా గౌడరీతి కల్పితకృతులన్. ౯౨

శా. శుభ్రాదభ్రపరిభ్రమత్పటుయశోజ్యోత్స్నాచ్ఛసరిత్సరితా
తిభ్రష్టాధితమస్సమూహము లగుధాత్రీభర్తలం బోరిలో
విభ్రాజిల్లుచళుక్యవిశ్వవిభుదోర్విక్రాంతి పెం పొంది తా
నభ్రద్వీపవతీతరంగములలో నాడించుఁ గ్రీడాగతిన్. ౯౩

### పాంచాలి

క. పంచషపదకసమస్తతఁ-జంచన్మాధుర్యకాంతిసంచరదోజ
స్సంచితసుకుమారతలను-మించ జగుఁ బాంచాలరీతి మృదులాకృతి యై. ౯౪

మ. చతురోదారచళుక్యనాథకరశిక్షాజాతరేఖాసుధా
లతలం గ్రాలెడుచారుసాయకనటీలాస్యాంగహారాదులన్
బ్రతిగా నిచ్చటఁ జూచి తత్పరిచితిన్ బ్రాపించు శూరారు ల
శ్రుతరంభాపరినృత్యకృత్యముల నచ్చోఁ జూతు రచ్చంబుగన్. ౯౫

### లాటి

తే. ఏతదుక్తత్రిరీతిసమేత యగుచు
నల్ప ఘోషాక్షరములచే నతిశయిల్లి
తనరు సంయుక్త వర్ణముల్ దఱుచు లేక
తెలసి నేనియు లాటికావృత్తి యండ్రు. ౯౬

మ. అనిశంబుం గరవాలభైరవుని పాదారాధనం బొప్పఁ జే
సినవారుం ద్రిదశాంగనాదయితులై జీవింతు రచ్చోటఁ జే
యనివారుం ద్రిదశాంగనాదయితులై జీవింతు రచ్చోట నం
చు నిరూపింతురు విశ్వనాథబిరుదస్తుత్యప్రభావం బిలన్. ౯౭

తే. తనరు శృంగార హాస్య శాంతములఁ గృపయుఁ
దనరు మాధుర్యగుణమునఁ దగును జెప్ప

నద్భుతము రౌద్ర వీర భయానకములు
నమరు బీభత్సరసము నోజమునఁ జెప్ప. ౯౮

క. సకలరసములుఁ బ్రసాద-ప్రకటితములు దక్కియున్న ప్రాణము లెల్లన్
సుకవుల కుచితనిరౌజ్యము-లకలంకత నెఱిఁగి యొనర నమరింప నగున్. ౯౯

క. ఇప్పగిది సులక్షణముల-నొప్పగు కమనీయకావ్యవితతులు గైకో
నెప్పుడు నీచిత్తమునన-చొప్పడు శీతాంశువంశచూడారత్నా! ౧౦౦

మ. మనుమోపేంద్రతనూజ సూరిజనతామందారభూమీజ భూ
జనరక్షాచతురత్రివర్గ హృదయాసన్నోల్లసద్భర్గ దు
ర్జనశిక్షాచణయుక్తదండ రిపురాజన్యాబ్జవేదండ చి
జ్జనితాశేషకళాభిరామ సమరస్థాణుప్రకారక్రమా! ౧౦౧

క. నందకపాణి పరాక్రమ-నందిమహాకాళతుల్యనవశైవకళా
నందోదయపద జగదభి-నందితసత్కీర్తి శోభనస్థిరమూర్తీ! ౧౦౨

మాలిని

చతురగుణగరిష్ఠా సర్వవిద్యావరిష్ఠా
శ్రుతివిహితచరిత్రా శూరసైన్యాళిజైత్రా
ధృతవిధవజయంతా ధీరవన్యావసంతా
వితతధృతినగేంద్రా విశ్వభూపాలచంద్రా. ౧౦౩

గద్యము

ఇది శ్రీమదుమారమణ చరణారవింద వందన గోవిందామాత్యనందన వివిధబుధ విధేయ
విన్నకోట పెద్దయనామధేయ విరచితంబైన కావ్యాలంకారచూడామణి
యను నలంకారశాస్త్రంబునం ద్రివిధకావ్యచాటుప్రబంధలక్షణ
వృత్తి రీతి ప్రముఖ నానావిధ విశేష సముద్దేశంబన్నది
చతుర్థోల్లాసము.

# పంచమోల్లాసము

## అలంకారములు

క. శ్రీకాళీపతిపదనా-ళీకస్మృతిలోలచిత్త శీలావిజయ
శ్రీకర కులజలరాశిసు-ధాకర చాళుక్యవిశ్వధరణీనాథా! ౧

శా. కావ్యశ్రీల నలంకరించుట నలంకారంబులై చాల శ్రో
త్రవ్యార్థంబుల నొప్పి పూర్వకృతసందర్భంబులం బెక్కు లు
ద్భావ్యప్రోక్తుల నాఱుముప్పదియునై భాసిల్లు వానిం గవి
స్తవ్యాన్యస్తపదస్వరూపములుగా సాగింతు శాస్త్రక్రియన్. ౨

వ. అది యెయ్యది యనఁగా—స్వభావాఖ్యానంబును, నుపమయు, రూపకంబును, దీపకంబును, నావృత్తియు, నాక్షేపంబును, నర్థాంతరన్యాసంబును, వ్యతిరేకంబును, విభావనయు, సమాసోక్తియు, నతిశయోక్తియు, నుత్ప్రేక్షయు, హేతువును, నుదారంబును, సూక్ష్మంబును, లవంబును, క్రమంబును, ప్రేయస్కంబును, రసవంతంబును, నూర్జస్వియు, పర్యాయోక్తియు, సమాహితంబును, నుదాత్తంబును, నపహ్నుతియు, శ్లిష్టంబును, విశేషోక్తియు, తుల్యయోగితయు, విరోధంబును, నప్రస్తుతస్తుతియు, వ్యాజస్తుతియు, నిదర్శనంబును, సహోక్తియు, పరివృత్తియు, నాశీర్వచనంబును, వక్రోక్తియు, భావికంబును, నన నర్థాలంకారంబులు షట్త్రింశత్ప్రకారంబులై వర్తిల్లుఁ దత్స్వరూపోదాహరణంబుల పరిపాటిం జెప్పెద. నందు స్వభావాఖ్యానం బెట్టి దనిన. ౩

## స్వభావాఖ్యానము

క. జాతి గుణ ద్రవ్య క్రియ-లే తెఱఁగున నుండు నట్ల యింపుగఁ జెప్పన్
బ్రీతి స్వభావాఖ్యానము-జాతి యనం బరఁగు నదియు శాస్త్రజ్ఞులచేన్. ౪

శా. నీలశ్రీలఁ దనర్చి నిగ్గలములై నిస్తంద్రసౌరభ్యమై
చాలం బేశలరూపమై చులుకనై శాతోగ్రధారాగ్రరే
ఖాలంకారితమై దృఢత్సరుసముద్యన్మేఖలాబద్ధమై
వా లొప్పుం గరవాలభైరవజయావాలక్రియాశీలమై. ౫

క. జాతి గుణ ద్రవ్య క్రియ-లాతతజీవితము లందు రార్యులు శాస్త్ర
వ్రాతములకు సత్కవితా-జాతములకు; వీనిఁ బొసఁగఁ జనుఁబో నొడువన్. ౬

## ఉపమ

క. గుణ ధర్మ కర్మముల ను-ల్బణ మయ్యెడువస్తువునకుఁ బరువడిఁ దుల్య
ప్రణయనముఁ జేయు నెయ్యది-గణుతింతురు దాని నుపమగా బహువిధులన్. ౭

శా. చాళుక్యక్షితిపాలుఁ డొప్పు ననిలోఁ శక్రుండునుంబోలె, దం
భోళిక్రీడఁ దనర్చు ఖడ్గ, మసుహృద్భూపాలకశ్రేణులుం
గూలుం గొండలభంగి, నంబరనటత్ప్రాలధ్వజంబుం బారిం
గ్రాలుం గాలవలాహకాకృతి, సురవ్రాతంబు గీర్తింపఁగన్. ౮

క. సతతప్రతిభోదయసం-గతి నుపమానోపమేయకల్పనములయం
దతిచతురకవులతలఁపులఁ బ్రతిపాద్యపములు పెక్కుభంగు లెలుంగన్. ౯

క. లింగంబుల వచనంబుల-భంగులు హీనాధికతలపాటియు వీడ్పా
టుం గదిరిన నుపమను నిం-పుం గలుగం జేయ నంద్రు బుధు లుచితోక్తిన్.

తే. అరుగుచున్నాఁడు పేడివాఁ డతివపోలెఁ,
బలుకుచున్నది పురుషునిపగిది నింతి,
ప్రాణములు నాకు నీతఁ, డుహాజ్ఞ తాఘ
మిన్నివిద్యలు నని నను నెసఁగు నుపమ. ౧౧

క. దేవా, నీ చందంబున-దేవేంద్రుం డొప్పు నచట దినకరుగతి ను
ర్వీవరుఁడు తేజమున సం భావితుఁడన నుపమ చెల్లుఁ బ్రౌఢప్రియమై. ౧౨

క. నిపుణులచెవి కెఱబఱ మగు-నుపమలు నొకకొన్ని గలవ యొక్కకచోటన్
క్షుపవోలె జముఁడు కృష్ణుఁడు-విపినంబునుబోలె వనధి విపులం బనఁగన్. ౧౩

ఆ. హంసివోలెఁ జంద్రుఁ డవదాతుఁడు, నభంబు
కొలఁకులట్లు సిడము, కుక్కవోలె
నించు బంటు పతికి, నినుఁబోలె ఖద్యోత,
మనెడు నుపమ లపహసనకరములు. ౧౪

సీ. సంకాశ నీకాశ సన్నిభ ప్రతిరూప తుల్య ప్రకాశాభ తులితములును
ప్రత్యనీక ప్రతిపక్ష సమాన ప్రతిద్వంద్వ నిభ సజాతీయములును
సదృశ సదృక్సమ సంవాది సప్రభ ప్రతిబింబజ కోపమా ప్రఖ్యములును
* సహలక్షణ ప్రతిచ్ఛంద విరోధ సదృక్ష సవర్ణ సపక్షములును

ఆ. నుపమితానువాది యుత సరూప ప్రతి
నిధులు ననఁగఁ బెక్కువిధములైన
శబ్దములును నట్టి సత్క్రియాపదములుఁ
బొలుచుచోటఁ జెప్పఁ బొసఁగు నంద్రు. ౧౫

క. దొరయు గడ జోడు పోలిక-సరి సంగడి యొద్ది యీడు సాటి పగిది నాఁ
గరణి యనఁ జాడ్పు చందం-బారసు పరుసు నాఁగ నుపమ కొప్పుం జెప్పన్.

## రూపకము

క. ఉపమానంబునకును న-య్యుపమేయంబునకు రూపయోజన మేకో
ల్లపితమయి వెలుఁగు నెచ్చటఁ-బ్రపంచితము రూపకంబు బహువిధలీలన్. ౧౭

---

* తద్వ దేకార్థ సాంతత్య సాధర్మ్యాను రూపకాభేదనిరూపణములు—పా.

ఉ. చారుచళుక్యవిశ్వనృపచంద్రుని నిర్మలకీర్తిచంద్రికా
సారముచే సుహృత్కుముదసంచయముల్ వికసిల్లు గర్వదు
ర్వారవిరోధివారిరుహవారములున్ ముకుళించు నుల్లస
త్సారిచకోరసంఘములు సొంపు వహించు ధరాతలంబునన్. ౧౮

వ. ఇది ప్రసిద్ధరూపకాలంకారం; బింకు భ్రాంతిమదలంకారంబునుం గల; దది యె ట్లనిన:— ౧౯

## భ్రాంతిమంతము

క. కవిసమ్మతి నారోప్య-ప్రవణానుభవంబు భ్రాంతిపద మగుఁ దత్సం
భవ మయ్యెడుదానికిఁ బే-రవిరళముగ భ్రాంతిమంత మనఁగాఁ బరఁగున్. ౨౦

క. చంద్రాన్వయుఁ డగువిశ్వన-రేంద్రుని సత్కీర్తిదీప్తి రేపారుటయున్
సాంద్రతరంబుగ నెల్లెడఁ-జంద్రశిలాతతులు పరఁగు స్రవ లగుచున్. ౨౧

క. సుకవినిరూపణములచేఁ-బ్రకటిల్లుచు రూపకములు బహులాకృతులై
వికసిల్లు వాని తెఱఁగులు-వికటంబులు దెలియవలయు వివిధస్మృతులన్. ౨౨

## దీపకము

### ఆదిదీపకము

క. మొదలను నడుమను నొండెన్-గదిసి క్రియాపదము యొండెఁ గారకమొండెన్
బొదలి తదర్థము దెలిపెడు-నది దీపకమనఁగఁ గృతుల నంపం జెప్పుదురున్. ౨౩

శా. కావించుం గులధర్మ మెప్పుడుఁ జళుక్యక్ష్మావిభుం డొప్పుగా
దేవశ్రేణి మగింప దిక్కరులు మోదింపన్ ధరాభారభృ
ద్గ్రావవ్రాతము సంతసిల్ల భుజగేంద్రప్రీతి సంధిల్ల న
వ్యావిర్భూతపృథుం డితం డనఁగ దివ్యశ్రవ్యకీర్తిఘుఁ డై. ౨౪

### అంత్యదీపకము

క. నల నహుష భరత భానుజ-బలి బలిభేదులకు సాటి పాటి తులితుఁ డ
గ్గలికుఁడు గడ సద్వృతుం డన-వెలయుం జాళుక్యవిశ్వవిభుఁ డెల్లెడలన్. ౨౫

### మధ్యదీపకము

మ. కవిసంఘంబునకుం బటీర పటికా కస్తూరికా చేటికా
వివిధశ్రీల విభూతియున్ విజయమున్ విశ్వేశ్వరుం డిచ్చుఁ బో;
భువి సర్వజ్ఞుఁడు శంకరుండు నగుటన్ బోలించి శీలించినన్
భవనామస్తుతి భద్రదాయిని గదా భావింప నెవ్వారికిన్. ౨౬

## ఆవృత్తి

క. చెప్పినమాటయ పెక్కుగఁ-జెప్పుట యావృత్తి యనఁగ జెలు వగు; నదియున్
దప్పక మూఁడు దెఱంగుల-విప్పఁ బదార్థోభయానువృత్తులఁ బరఁగున్. ౨౭

## శబ్దావృత్తి

క. అరు లని విశ్వేశ్వరునకుఁ-దిరుగక క్రీడింతు రమరదీర్ఘికలోఁ ద
త్పురవరపరిఖాతాయత-సరసులఁ గ్రీడించుఁ గ్రోడసంతతు లెపుడున్. ౨౮

## అర్థావృత్తి

క. శ్రీవిశ్వవిభుని వేఁడిన-యావిప్రులు విత్తవంతు లగుదురు, వారిన్
వావిరి నడిగినవారును-నావల ధనవంతు లగుదు రతిచిత్రముగాన్. ౨౯

## ఉభయావృత్తి

క. ధరణీవరాహం బగుపతి-ధరణి వరాహంబవోలెఁ దాల్చిన నేకా
తురచరణ మైనధర్మము-కరిగతి నలు గాల నిలిచెఁ గలియుగవేళన్. ౩౦

## ఆక్షేపము

క. తొడఁగినకృతకృత్యంబుల నడఁచునిషేధోక్తి దలఁప నాక్షేప మగున్
బెడఁగగు సుకవులతలఁపుల-బెడఁ గాలత్రితయవిధుల బహుగతు లగుచున్. ౩౧
ఉ. 'వారక విశ్వభూవిభునివాలున కగ్గము గాకుఁ, డైతిరే
నీరస మబ్బు మిమ్ము వరియించినవేలుపుఁబువ్వుఁబోండ్లకున్
ధీరత మంటవెంట నరుదెంచినతెంపున మాకు,' నంచు వా
గ్వీరము వీరభార్య లెఱిఁగింతురు భర్తల కాహవంబునన్. ౩౨

## అర్థాంతరన్యాసము

తే. చెప్పఁ దొడఁగినయర్థసంసిద్ధికొఱకు
వేఱ యర్థము యోజించి వెలయఁ దెలుప
నదియ యర్థాంతరన్యాస మనఁగఁ బరఁగుఁ
దలఁప నేర్చిన బెక్కుభేదముల నెగడు. ౩౩
మ. క్షమలో వేఁడనివారికేనియును విశ్వక్ష్మావిభుం డిచ్చు న
చ్చము లై పొచ్చెము లేనిసంపదల శశ్వత్సర్వలోకాశ్రయ
త్వము, నైజంబుగ నట్ల కాదె తలఁపన్ వాంఛార్థహీనస్ఫుర
త్కమలోజ్జృంభణకల్పనంబు రవికిన్ గర్జంబు మి న్నందియున్. ౩౪

## వ్యతిరేకము

క. అమరఁగ శబ్దార్థంబులు-క్రమతుల్యము లయ్యు భేదకధనముచే వ
ర్ణ్యము నతిరిక్తముఁ జేయుట-నమితవ్యతిరేక మనఁగ నగుఁ బలుకుబడిన్. ౩౫
మ. సుమనోరక్షణవైభవంబులను జిష్ణుత్వంబునం గ్రూరవి
క్రమవిద్విడ్బలమర్దనంబున సుధుర్యత్వంబు తుల్యంబపో,
యమరాధీశుఁడు గోత్రభంజనుఁడు గోత్రానందసంపాది వి
శ్వమహీపాలుఁడు, వీరికిన్ గుణకథా సాదృశ్య మేచందమో. ౩౬

## విభావన

తే. సహజ విఖ్యాత హేతువు జాఱ విడిచి
కారణాంతరకల్పనకథన మొండెఁ
గామవిహితస్వభావసంగతియ యొండె
నమరఁ బల్కు విభావన యనఁగఁ బరఁగు, ౭౩

మ. స్ఫురదాధ్మాతకరాళకీలమును దంభోళిప్రభాభీలమై
జల దస్పృష్ట కృతాంతదండమును నై సంగ్రామరంగంబులోఁ
గరవాలంబు చళుక్యవల్లభునిచేఁ గ్రాలుం బరప్రాణసం
హరణక్రీడనదృష్టమృత్యురసనాహంకారఘోరంబుగన్. ౩౮

## సమాసోక్తి

క. తగు వినిహితాగ్రగర్భిత-యగు నన్యార్థోక్తి గతి సమాసోక్తి యగున్
సుగమార్గగోపనముచే-నెగడిన నన్యాపదేశనియతిం బడయున్. ౩౯

మ. స్ఫుటపున్నాగములం దొఱంగి కితవస్తోమంబుఁ బాటించి యు
త్కటపంకాంకితమార్గులం గదిసి భద్రశ్రీలపైఁ గూర్చి దు
ర్ఘటముం జేసి సువర్ణముం గడి దుర్వర్గంబు నర్థించి యె
చ్చటలం జెందిన మెచ్చునే నృపతులన్ సోమాన్వయుం డుర్వరన్. ౪౦

## అతిశయోక్తి

క. తనతలఁచిన యర్థము పెం-పున నింపున లోకవృత్తమున కతిశయిత
ధ్వని గలిగి కవుల చెవులకు-నానిన యది యతిశయోక్తి యొప్పుగుఁ గృతులన్.

క. ఉల్లసితాలంకృతులకు-నెల్లఁ బరాయణము, కవుల కెలమి యనఁగ శో
భిల్లుం, బెక్కు తెఱంగులఁ-జెల్లం బారి నేకపదముచే నొడఁగూర్పన్. ౪౨

మ. ధరితాత్రిం బరగండభైరవునిచే శిగ్నాంగు లై పాఱు త
త్పరిపంథి ప్రమదావలోకనగళ ద్బాష్పాంబుధారాపరం
పర పెల్లై మని చెప్ప నంతయు జలాభావంబు లై యుండు న
మ్మరుదేశంబు లనూపభూము లగు సీమానూనహీనాకృతిన్. ౪౩

## ఉత్ప్రేక్ష

క. అలవడ శబ్దార్థములకుఁ-జెలువంబగునన్యవస్తుప్రియోజించి సము
జ్జ్వల దుత్ప్రేక్షావ్యంజన-ములచే నుత్ప్రేక్ష యనఁగ మొనయుం గృతులన్.

చ. కెరలు చళుక్యవిశ్వవిభుకేతువరాహము నన్యభీతికృ
ద్గురుతరకృత్య యందు గొకకొందఱు, కొందఱు వైరివాహిని
నిరుపమమృత్యు వందు, రిట నే నయినన్ రిపురాజమండలా
హరణము సేయ వేఁడి పొలుపారెడిరాహువు గాఁ దలంచెదన్. ౪౪

క. గజభుజగాదులచేసఁ గల-గుజిబిజికిం గాక వీడుకొన్నదివో లెన్
భజియించి నిలిచె వలపటి-భుజమున విశ్వేశ్వరునకు భూసతి ప్రీతిన్. ౪౬

## హేతువు

క. కారకమును క్రియయును న-దారంభంబునకు బీజ మగు నేమిట నిం
పార నది హేతు వనఁ జను-భూరిప్రతిభావిశేషములఁ జెక్కరయన్. ౪౭

శా. సంపల్లంపటమందహాసములు సంజాతానుకంపాకళా
సంపన్నంబులు సాదరప్రియనయాస్థానంబు లిష్టక్రియా
సంపూర్ణంబులు నాఁగ విశ్వధరణీశ శ్రీకటాక్షాంకుముల్
సొంపుం బెంపును నింపు సేయు నెపుడున్ సూరీశ్వరశ్రేణికిన్. ౪౮

## ఉదారము

క. ఆయాసోపార్జితము న-దేయమును మనోహరాభిధేయమ్మును శ్ర
ద్ధేయము నగుధన మొసఁగును-సాయ ముదారంబు నాఁగ నవనిం బర్వున్. ౪౯

శా. విశ్వేశావనిపాలపాలకునిచే విత్తాఢ్యులున్ సత్యభా
గశ్వాద్యూధులు నంబరాభరణచిహ్నాటోపులుం గామినీ
శశ్వత్సౌఖ్యసమగ్రమానసులు నై చారుస్థితిన్ సత్కృపుల్
నైశ్వర్యోన్నతిఁ జేస్తు రెప్పుడు తదౌదార్యం బవార్యంబుగన్. ౫౦

## సూక్ష్మము

క. ఆకారేంగితకృతచే-ష్టాకల్పితసూక్ష్మగతుల సంలక్షిత మై
కైకొనఁ దగునంతర్గత-పాకొల్పత సూక్ష్మ మనఁగఁ బరఁగుం గృతులన్. ౫౧

ఉ. శ్రీల జళుక్యనాథుఁ డొనరించెను నేఁ డని గారవించుచో,
బాలకు లేఁతన వ్యధరపల్లవకాంతి నలంకరించె, నై
మాలపుసిగ్గు చూపులకు మాటుగఁ గోఁచెఁ, గుచోత్తరీయమున్
గే లాడికంబు సేసెఁ, జిలకించిరి నెచ్చెలు లట్టిచేష్టలన్. ౫౨

## లవము

తే. సూక్ష్మభావంబు విశదవనిసాబసతోడ
భావమునఁ దోఁచువస్తుగోపనము పేరు
లవము నాఁ జను; దేశకల్పనముతోడి
విమతినిందలు లవమున విస్తరిల్లు. ౫౩

చ. సుదతి యొకర్తు విశ్వవిభుఁ జూచి వడిం బులకించి లజ్జ లోఁ
గదిసిన నేర్పుతోడఁ జిలకత్తెల కిట్లను నింత యొప్పునే

మృదులవనానిలం బనుగమించుమగున్ వ్రతపంక్తితోన నిం
పొదవఁగ వీచె డిగ్గియలనుండి సరోజరజోవిలాసి యై. ౫౪

## క్రమము

క. ఉపమానము నుపమేయము-నుపమలఁ బరిపాటి తప్పకుండఁగ నొడువన్
నిపుణత్వము క్రమ మనఁ జను-ప్రపటుప్రఖ్యాతశబ్దపంక్తులచేతన్. ౫౫
ఉ. శ్రీరుచి వైభవోదయ శరీరవిలాసములందుఁ జూడఁగా
శౌరి శశాంక జంభరిపు శంబరశత్రులతోడ నెప్పుడున్
దోరపుటీడు జోడు సరి దోయి చళుక్యనరేంద్రుఁ డంచు నిం
పారఁగఁ జాటుసత్కృతు లుదారత ప్రోయి సభాంతరంబులన్. ౫౬

## ప్రేయము

క. ప్రేయోలంకారంబు వి-ధేయం బగుఁ బ్రియతరాభిధేయోక్తులచే
నే యొగ్గు లేక కర్ణర-సాయనమై యుండెనేని సత్కవికృతులన్. ౫౭
మ. భవదుద్యత్కరుణాకటాక్షకిరణోత్పన్నంబు లస్తస్తహో
త్సవసంపత్ప్రికరంబు లెల్ల నని శస్తస్తోత్రులై విశ్వభూ
ధవు భూపాలనుఁ బ్రకీర్తనలఁ బ్రీతస్వాంతులై కాంచి శా
త్రవు లర్చింతురు పాదపద్మముల నర్యన్మౌళిరత్నద్యుతిన్. ౫౮

## రసవదలంకారములు

క. అనితం బగురత్యాది-ప్రసరణములఁ దేజరిల్లి ప్రథమరసాదుల్
పొసఁగఁ బడు నెచట నది యో-రసవదలంకార మనఁగ రసికుల కెక్కున్. ౫౯

## శృంగారరసము

చ. ఇల వలరాజురూపునకు నెక్కువ యయ్యెడువిశ్వమేదినీ
లలనునిరూపయౌవనవిలాసములం జెలిమాటు చేరి య
గ్గలికపునిగ్గు వేడుకల గ్రంగున కడ్డపడంగ నిమ్ములన్
మెలఁతుక వాలుఁజూపులకు మేపులు వెట్టెడుఁ జూచితే సఖీ! ౬౦

## హాస్యరసము

క. హీనాచారుల బహుకా-హీనాత్ముల సతతసవ్యళీకులఁ జూడం
బూనెడువిశ్వేశ్వరుని న-వీనదరస్మితము లచ్చువెన్నెలఁ బోలున్. ౬౧

## కరుణారసము

క. అనిఁ దృణము గఱచి జేయని-నినదించుచుఁ బారలు విమతనికరముఁ గరుణా
గనుఁగొని కాచుట నైజము-గొనకొని యరిరాయగండగోపాలునకున్. ౬౨

## రౌద్రరసము

క. రుద్రుం డగు విమతనరో-పద్రవకరణములఁ గుపితబలభద్రుఁ డనఁగన్,
ముద్రణితకదనగతి ను-న్నిద్రాకృతి విశ్వమేదినీపతి చూడన్. ౬౩

## వీరరసము

క. అరివీరుల నమరావతి-కరిగించుచు వివిధధనము లర్థివరుల కై
యొరవడి నొసఁగుచుఁ-బరగెడు నిరతోత్సాహంబు విశ్వనృపునకె యొప్పున్.

## భయానకరసము

క. రిపునృపులు విశ్వనాథ-ప్రపటుధ్వజదంష్ట్రిఁ జూచి పరఁగినభీతిన్
విపినవరాహంబుల నిల-నిపుడుం గనుఁగొనఁగ వెఱతు రెట్టితలఁపులో. ౬౫

## బీభత్సరసము

మ. అతిదృప్యత్పరగండభైరవభుజోద్యత్తీక్ష్ణకృత్తాహిత
చ్యుతభూరిక్షతజప్రవాహములలో శుండాలరుండావలీ
కృతలీలాచరయానపాత్రములలోఁ గ్రీడించు నాయోధన
క్షితి భూతంబులు మజ్జమాంసరసమస్తిష్కప్రమత్తంబు లై. ౬౬

## అద్భుతరసము

క. సమధిక మగు నచ్చెరు వచ్చముగా విశ్వేశుదానజలధారాపూ
రముచేతఁ జేలి కంకును-విమలాంబరకనకహారులు విద్వత్తతికిన్. ౬౭

## శాంతరసము

క. విశ్వేశుమహిమ విని కని-విశ్వంభర విడిచి మడము వీడ్కొని విమతుల్
శశ్వద్దమశమయుక్తి న-నశ్వరు లై నిలుతు రమరనగముల నడుమన్. ౬౮

## ఊర్జస్వి

క. అతులితబలవదహంకృతి-యుత మగువాక్యంబు దలఁప నూర్జస్వి యగున్
బ్రతిభటతర్జనగర్జన-వితతాక్షేపములచేత విస్ఫుట మెపుడున్. ౬౯

మ. కపటద్విట్కరవాలభైరవుఁడు ఖడ్గాఖడ్గిసంక్రీడలన్
గుపితాటోపనిరూఢి నుగ్రరిపురక్షోరాజనారాయణుం
డపరావిష్కృతరుద్రుఁ డన్యపురదాహప్రౌఢిచే విశ్వభూ
మిపుఁ డమ్మేటి నెదుర్చుటల్ జమునితో మేలంబు గావించుటల్. ౭౦

## పర్యాయోక్తి

క. కార్యార్థకల్పితేచ్ఛం ద-త్కార్యార్థప్రాప్తికొఱకు గల్పించిన మా
ధుర్యయుతభాషితం బది-పర్యాయోక్తంబు నాఁగఁ బరఁగుం గవితన్. ౭౧

చ. సురుచిరరత్నకీలితము సూతము బన్న సరంబు సూపు, క
ప్పురపుఁగరండముం దెలిచి పుచ్చు వెలుంగున, నంచు విశ్వభూ
వరుఁ డొకయింతిఁ బల్కుటయు వచ్చిననెచ్చెలు లంతటంతటన్
సురుచిరసాలభంజికలచొక్కపుజోటులువోలెఁ జూడఁగన్. ౬౪

## సమాహితము

తే. కడఁకతో మున్ను దొరకొన్నకర్జమునకు - సాధనము దైవవశమునఁ జాగెనేని
యది సమాహిత మని చెప్ప నతిశయిల్లుఁ - గార్యకర్తకు నానందకరణ మగుచు.

ఉ. మానిని విశ్వనాథుపదమంజరులున్ దనఫాలపట్టమున్
మానుగఁ గూర్తు నంచు నభిమానము మానఁ దలంచుచోట న
ప్పానవనాథుఁ డచ్చ మగుమున్కుగ నచ్చటి కేఁగుదెంచి త
త్సూనశరాసనాస్త్రములు మాఱఁగొనుం గరుణాసమేతుఁడై. ౬౫

## ఉదాత్తము

క. అతులైశ్వర్యాశ్రయముల - వితతత్వ ముదాత్త మనఁగ విశ్రుత మగు నం
చితసంపద్బహుళము నూర్జితపదమును నగుచుఁ గార్యరీతులయందున్. ౬౬

శా. వంశం బీశ్వరమౌళిమండనమహోదార్యంబు, నిర్నిద్రని
స్త్రింశం బింద్రపురస్థితాహితనుతిశ్రీకంబు, చక్రాచల
ప్రాంశుధ్వాంతనిహంత్రి కీర్తి, వినమద్రాజన్యకోటీరర
త్నాంశూదంచిత మంఘ్రియుగ్మము, చళుక్యస్వామి కెల్లప్పుడున్. ౬౭

## అపహ్నుతి

క. కలయర్థ నిరసనంబున - నలవడునన్యప్రకార మగునర్థముచే
వెలయు నపహ్నుతి యనఁగాఁ - బలికెదు వెరవులను బెక్కుపాకము లగుచున్.

మ. ఘనవేఘం బది వాజిగా నితఁడు నిక్కం బింద్రుఁ డాగోహకం
ఘనరాడింగమటించి గాద ది తటిద్వ్యాపార ముద్యత్స్ఫుర
ద్ధ్వని గా దంబుదఘోషణం బది ధరన్ దిక్కొంట నిసాంఘ లే
దని భావింతురు విశ్వభూవిభుని యశ్వారోహణక్రీడలన్. ౬౮

## శ్లిష్టము

క. ఏకార్థోక్తం బయ్యు న - నేకార్థము చిలుకుచుండు నెయ్యది యదివో
లోకమున శ్లిష్టమనఁగాఁ - జైకొనఁ దనుఁ బదవిచిత్రకల్పనవిధులన్. ౬౯

మ. వరునత్త్రైలదశోకపల్లవయు సమ్యక్పత్రసందోహయున్
భరితామోదయు జృంభమాణ సుమనోభద్రప్రదేశంబునై
యరుదై యొప్పెడువిశ్వభూపవిభులోద్యానావళిం జూడఁ ద
త్పురియుం బోలెఁ దనర్చె నింతి మహిళా పున్నాగపూగంబులన్. ౭౦

## విశేషోక్తి

క. జాతిక్రియాగుణాదుల-యాతతహీనత్వకథన మలవడు నెచటన్
బ్రీతివిషయేతరార్థ-స్థితతక్తి యదియ తగు విశేషోక్తి యనన్. ౨౧

మ. చటులక్రోడపతాక యెత్తరు బృహత్సైన్యంబు పైఁ ద్రోవ రు
ద్భటనిస్సాణరవం బెలర్ప రతిదృప్యద్దండగోపాలు భూరి
కుటిమాత్రోదితచేష్టచేతన రిపుక్షోణీశు లంతంతటన్
స్ఫుటజూటంబులు దాల్తు రెక్కడ గదా భూరిప్రభావం బిలన్. ౨౨

## తుల్యయోగిత

క. ఖ్యాతగుణంబులచే ను-ద్యోతితసదృశోక్తి తుల్యయోగిత యగుఁ బ్ర
స్తుతస్తుతి నిందనములు-జాతియముగాఁగఁ జెప్పఁ జను నంద్రు బుధుల్. ౨౩

శా. కాలవ్యాలముఁ గాలకూటమును నిర్ఘాతంబు ఘోరానల
జ్వాలాజాలము నీకృపాణమును దుర్వారంబు లుగ్రక్రియా
లోలక్రీడల నంచు నెన్నుదురు భూలోకాదిలోకంబులన్
జాళుక్యాన్వయవిశ్వభూప సమిదిజ్యాశీలమంత్రోజ్జ్వలా! ౨౪

## విరోధము

క. తమలో నొంటను రెంటఁ బ-దములకు సంభావితార్థ వర్ణన మెచటన్
గ్రమమున విరుద్ధ మగు నది-యమరు విరోధంబు నాఁగ నధ్యుయెడలన్. ౨౫

చ. అనిమొన విశ్వనాథవిభునిహస్తకృపాణము చంద్రహాస మ
య్యును మతి చిత్రభాను వన నుజ్జ్వల మయ్యెడుచోట నప్సరో
వనితలచన్నులం బులకవర్గము నెక్కొను వైరిభీరు లో
చనముల నశ్రువారిములు సాల్పడు నంగను నిండనుం బొరన్. ౨౬

## అప్రస్తుతప్రశంస

తే. వివిధసేవాధికంబుల విసువుచేత-నడరి యప్రస్తుతస్తుతి యనఁగ బరఁగు;
ననుచితార్థప్రశంసనమయ్యు నదియు-నానరనొక్కొక్కచోటున నొప్పునోసఁగు. 

చ. కస వశనంబు సేయు ముదకంబు విహారము గానలోపలన్
వసుమతి శయ్యావ ట్టోరులవంకఁ జరింపమి సంతసం బిలన్
బసులకు నెల్ల వృత్తి, జనపంక్తుల కైన నభీప్సితంగిరా
వసుమతి రైన విశ్వజనవల్లభుదృష్టియ వృత్తి నిచ్చులున్. ౨౭

## వ్యాజస్తుతి

క. వ్యాజస్తుతి యనఁగఁ బరి-భ్రాజిత మగు నిందవోలె బ్రణుతింపంగాఁ
దేజం బెసఁగెడు కథనము-రాజిల్లెడు మధురవచనరచలచేతన్. ౨౮

ఉ. ఈశుఁ డుపేంద్రపుత్త్రుఁ డట యింతుల నేఁపక యేలమానుఁ? బ్ర
ఖ్యాతి వినూత్న భద్రుఁ డట కాంతల నేఁపక యేల తక్కు? వి
ద్యోతకళాధరుం డట వధూటుల నేఁపక యేల యుండు నే
రీతి? నటంచు విశ్వవిభుఁ బ్రీతి నుతింపుదు రంగనాజనుల్. ౯౦

## నిదర్శనము

క. తిర మగునొకయర్థముతో-నొరయ నరాంతరంబు సమకొల్పి తగన్
బర మైన నపర మైనను-ధరణి నిరూపింపఁగా నిదర్శన మయ్యెన్. ౯౧

ఉ. ఇవ్వసుధం గవిప్రవరు లెచ్చట నుండియుఁ జెంద కుండినన్
మవ్వ మెలర్ప విశ్వనృపమన్మథుఁ డిచ్చు నభీష్టసంపదల్
నివ్వటిలంగ, నత్తెఱఁగు నిశ్చితకృత్యము, యాక తక్కు నే
దవ్వులనుండి యైన రవి తమ్ముల కిమ్ముల సద్వికాసముల్. ౯౨

## సహోక్తి

క. సమగుణధర్మము లగుభా-వములఁ గ్రియాసదృశ యగుచు వచనార్థముతో
నమరిన సహోక్తి యనఁ జను-సముచితచతురార్థశబ్దసంఘటనమునన్. ౯౩

చ. వసుధ జిగీషుఁ డైనశశివంశ్యుని కీర్తులతోన చంద్రికా
విసరము సాగె దిక్కులను, విభ్రమదశ్వఖురోన్నమద్రజః
ప్రసరముతోన తోయజపరాగము ప్రాఁకె నభంబు, మిత్రమా
నసపరిశుద్ధితోన మలినత్వము వీడ్కొనె వారిపూరముల్. ౯౪

## పరివృత్తి

క. సరిసన్యూనాధికములం-బరువడితో మార్చుకొనుట పరివృత్తి యనం
గరఁగుం బలికెదరు కవుల;- నరయ నలంకారకరణ మనుసత్కృతులన్. ౯౫

శా. సవ్యాసవ్యవిఘాతశాలి యగు నీ చాళుక్య విశ్వేశు హ
స్తవ్యావల్గదసిప్రభావము ప్రశస్తప్రౌఢి దీపింపఁగా
భవ్యాంగంబుల నాహరించి యనిలో భద్రక్రియాపాలి యై
దివ్యాంగంబుల నిచ్చుఁ జేర్చి సదవద్వీరాళితశ్రేణికిన్. ౯౬

## ఆశీర్వచనము

క. ఆశీర్వచన మనంగా-నాశాస్యపదార్థసమ్యగాశంసన మి
ద్ధాశయము భద్రములకుఁ బ్ర-కాశింపఁగఁ దను నశేష కావ్యముఖములన్. ౯౭

ఉ. వేలుపుటిల్లువిల్లు విడి వీఁకలపోకల నారి, రెండుచే
వ్రోల వెలుంగుతూ పెచటఁ బోలినఁ బాణి లేదు మాటలై
గ్రాలెడు తేజి లెవ్వనికిఁ గల్గు నతండు చళుక్యవిశ్వభూ
పాలమనంబునం బరవిభంజనుఁ డై విహరించుచుండెడున్. ౯౮

## వక్రోక్తి

తే. స్తుతియు నభయంబుగా మున్ను దోఁచి పిదపఁ
దోడుతో వంకవంకరై దొరకుపలుకు
కవులు వక్రోక్తి యన నొప్పఁ గబ్బములను
గల్పనీయార్థవశమునఁ గానవలయు. ౯౯

మ. పరపుష్టంబులు కోకిలంబు లనిశభ్రాంతుండు చంద్రుండు క్రొ
వ్విరు లస్త్రంబు లనంగుఁ డంగభవుఁ డీవీక్షింపు మిన్నేఁచు ను
ర్వరలో నెంతటివారు? వారక సఖుల్ వారింపఁగాఁ బోయి సుం
దరి విశ్వేశ్వరుఁ జూచి, తద్విభుమహత్త్వం బీపశాదేసముల్. ౧౦౦

## సంకరము

క. వివిధాలంకృతి సమ్మతిఁ-జవిగా నొనరించు నర్థసంగతిచేతన్
సవర నయి కర్ణముల కు-త్సవపద మౌఁ గబ్బ మరయ సంకర మయ్యెన్. ౧౦౧

మ. అనిలోనం గరవాలభైరవుఁడు వీరారాతులం గూల్చు న
ర్జునుఁ డీతం డనఁగా, సురాంగనలకున్ శూరాహిత శ్రేణికిన్
జనరించుం దగులంబు లచ్చుపడ నుద్యద్రాజకంఠర్పుఁ డై,
ఘనకీలాలము లబ్బఁ జేయు ఘనవిఖ్యాతిం బ్రవృద్ధంబుగాన్. ౧౦౨

## భావికము

తే. భావ మనఁగను గవియభిప్రాయ మగుడు,
భావభేదనియుక్తంబు భావికంబు
వివిధరూపప్రబంధోక్తివిషయగము;
దగు వివేకింప సూక్ష్మ సందర్శనమున. ౧౦౩

చ. వివిధపదార్థభావరసవృత్తుల రీతులఁ గావ్యపాకసం
భవ మనుసూక్ష్మ బంధమునఁ బర్వనలంకృతు లెల్లఁ జూచి స
త్కవులవివేక మెల్లఁ బొడ గానఁగ నేర్చు చళుక్యవిశ్వభూ
ధవుఁ డనుమాట లాజ్ఞల వి డర్చ మెలర్చ సభాంతరంబులన్. ౧౦౪

ఉ. చంద్రకులాగ్రగణ్యుడు ప్రశంసితపుణ్యుఁడు సత్యధీహరి
శ్చంద్రుఁడు శైవతంత్రవిలసద్వృషభేంద్రుఁడు నీతితత్త్వని
స్తంద్రుఁడు శౌర్యలోలుఁడు బుధప్రియశీలుఁడు భూరివిక్రమో
పేంద్రుఁడు పేంద్రనందనుఁడు భీమపదానిశవందనుం డిలన్. ౧౦౫

క. గంధర్వకళావిదుఁ డరి-గంధద్విపమదవిమర్దకంఠీరవుఁ డు
ద్బంధురవరాహకేతుఁడు-బంధుపయోరాశికుముదబాంధవుఁ డెపుడున్. ౧౦౬

### మాలిని

ఆహవనగరరుద్రుం డంగనాసంఘభద్రుం
డహిమకిరణతేజుం డర్థ్యవిద్వత్సమాజుం
డహసితకులశీలుం డర్థివర్గానుకూలుం
డహరహరుదితార్థుం డాజిపార్థుండు శక్తిన్. ౧౦౭

### గద్యము

ఇది శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన వివిధ బుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయ విరచితంబైన కావ్యాలంకార చూడామణి యను నలంకారశాస్త్రంబునందు నర్థా లంకారసముద్దేశం బన్నది పంచమోల్లాసము.

---

# షష్ఠోల్లాసము

---

## శబ్దాలంకారములు

క. శ్రీశుఁడు హృదయాంతరిత గి-రీశుఁడు పదవినమదరినరేశుఁడు విజయా
దీశుండు విజయవత్సర-వేశుఁడు చాళుక్యవంశవిశ్వేశుఁ డిలన్. ౧

క. శీలింపవలయు మరి శ-బ్దాలంకారంబు లైనయనుకాదివిచి
త్రాలిఖితబంధభేదము-లోలిన యొకకొన్ని వాని నొనరింతుఁ దగన్. ౨

క. కలయఁబడి రూపకాదుల-కలవడు సంసృష్టిసంకరాఖ్యలు కృతులన్
విలసితమణికనకమరీ-చులకు విమిశ్రమును బోలె శోభాధికతః. ౩

## శబ్దసంసృష్టి

క. తిలతండులములు సరి సరిఁ-గలసినగతి రూపకాదికంబులు తమలో
పల బెరసి యుండు నెచ్చట-లలి నది సంసృష్టి యను నలంకృతి యయ్యెన్. ౪

తే. వృత్త్యనుప్రాసపదసమావృత్తి మైన-శబ్దసంసృష్ట్యలంకారసంజ్ఞితంబు
వినుమర్దళమంజులధ్వనియుఁబోలెఁ-గర్ణములకెప్డు నానందకరణ మగును. ౫

చ. గుహ భృగురామ రామ సమశోపవిభూషితవిశ్వభూమిభృ
ద్బహుబలబాహురాహువు కృపాణముఖోద్ధతిఁ జేర్చి తత్సమి
న్మహి విహరించుచో నహితమండల మైందవమండలంబుగా
విహితవివేకు లై గగనవీథిఁ దలంతురు వేల్పు లాత్మలన్. ౬

## క్షీరనీరన్యాయసంకరము

తే. పాలు నీరును గలసి యేర్పడకయున్న
కరణిఁ దద్రూపకాదులు బెరయు నెచట
దొరసి యది క్షీరనీరసంకరము నాఁగఁ
గబ్బముల నుండు నంగాంగికములచేత. ౭

శా. సత్త్రాచారము చెప్ప నొప్పు నిల విశ్వస్వామి కెట్లన్న న
ద్ధాత్రీశాధ్వరభోజనంబులను దక్షద్రాహతారిప్రియా
మత్రక్రీడల నిత్యదానముల సమ్యక్ప్రీతి వర్తింతు రా
సుత్రామాదులు నప్సరోగణములున్ సూరీంద్రులుం దద్దయున్. ౮

## నరసింహసంకరము

క. లసితాలంకృతిసంధులు-గనిబిసి యై చెదరకుండఁ గల్పించినఁ బొం
దసఁగడు సంయోగం బది-రసికులు నరసింహసంకరం బనఁబరఁగున్. ౯

మ. పనితోదగ్రుఁడు విశ్వనాథుఁ డనిలోఁ బర్జన్యచండంబునన్
గనుపట్టం బటహారవంబు మొరయం గర్జోపమానోద్ధతిన్
దనరించున్ రుధిరాపగానికరముం దన్యోధబాహూద్భ్రమ
ద్రుణకోదండపటూగ్రప్రవిగళత్కాండావళీవర్షముల్. ౧౦

క. ఒకతెఱఁ గిది శబ్దార్థ-ప్రకటనములసంకరములు బహువిధము లిలన్
సుకవులు ప్రతిభాభణితుల-సకలంబు నెఱుంగవలయు శాస్త్రములందున్. ౧౧

## అనుప్రాసములు

ఆ. ఛేక వృత్తి లాట సిద్ధంబులను నను
ప్రాసములు ధరిత్రిఁ బరఁగు మూఁడు
లలితవృత్తి; వానిలక్ష్యోదాహర
ణములు తెలియవలయు సుకవివిధుల. ౧౨

## ఛేకానుప్రాసము

క. ఛేకానుప్రాసం బనఁ-నాకర్ణిత మగుచు నొప్పు నగ్రము వేఱై
చేకొన్నద్వ్రాల యొప్పిది-చేకొనఁబడు నేనిఁ గృతుల సిరులకు నెలవై. ౧౩

క. కందర్పదర్పదము లగు-సుందరరతిహాసరుచుల సుందరి యందం
బందముగాఁగ శంకర-వందారుమందారు విశ్వవరు నర్చించెన్. ౧౪

## వృత్త్యనుప్రాసము

తే. ఒకటి రెండును మూఁడునై యొలయు వ్రాలు
పద్యమున నచ్చటచ్చటఁ బరఁగు నేని
వృత్త్యనుప్రాస మన నది విస్తరిల్లు
లలితరీతుల కెల్ల విలాస మగుచు. ౧౫

ఉ. చొక్కపుటుక్కు ద్రిక్కి తిసి ద్రుక్కన పెక్కుక నక్కజంపుట
న్నిక్కక చక్కనై బ్రతుకునిక్కు సహించితిరేని శాత్రవుల్
మొక్కల మేఁది మక్కి యని మ్రొక్కుఁడు, మ్రొక్కక నిక్కుచున్న మీ
టెక్కులు చక్కఁ జెట్టు విఘటించి చళుక్యనరేంద్రుఁ డిక్కడన్. ౧౬

## లాటానుప్రాసము

క. పొంటిగఁ జెప్పిన శబ్దము-చాటుగతిన్ సారిదిఁ బలుకఁ బక్కఁద మర్థా
ఘాటోత్కృష్టము చేసిన-లాటానుప్రాస మనఁగ లలితం బయ్యెన్. ౧౭

చ. ధరణిఁ జళుక్యవిశ్వవిభుదానము దానము కీర్తి కీర్తి భీ
కరమగువాలు వాలు రణగర్వము గర్వము గాక కల్పితే
తరనృపనామధారకులదానము దానమె కీర్తి కీర్తియే
కరమున వాలు వాలె రణగర్వము గర్వమె పౌరుషక్రియన్. ౧౮

## శృంఖలన్యాయబంధము

క. మొదలిపదం బటమీఁదటి - పదయుక్తికి హేతు వగుచుఁ బరువడిఁ గలయన్
దుదపదముతోడ నదికిన - నది శృంఖలమాలబంధనాఖ్యకు బేరయున్. ౧౯

చ. ధరణి శ్రుతంబుచే నఖిలధర్మము ధర్మముచేత నర్థసు
స్థిరతయు నర్థసుస్థిరతచేత బలోదయముల్ బలోదయా
చరణముచే జయావహము సంపదయుం బ్రభవించు విశ్వభూ
వరునకు, నీతిమార్గమున వావిన చేరవు నిత్యభిప్రియముల్. ౨౦

### ఏకావళి

తే. ఆదిశబ్దంబునకు మీఁద నడుపదము
దగువిశేషణములతోడఁ దగిలి వచ్చు
గొలుసుగాని యర్థసంగతిఁ గూడదేని
యదియు నేకావళిసంజ్ఞ నడరు నండ్రు. ౨౧

చ. మదిఁ దలపోయ విశ్వవిభుమంజులభాషలు సర్వసంపదా
స్పదములు సర్వసంపదలు సజ్జనసేవ్యలు సజ్జనౌఘముల్
బోదలు విభూతియుక్తము విభూతియు నిత్యసముత్థ యిట్టిభ
ప్రదవభరితానుభావ మొకరాజునకుం గలుగంగ నేర్చునే. ౨౨

### ప్రతిషేధబంధము

తే. ఇవియె కవితలఁ దగఁ జెప్ప నెఱిఁగెనేనిఁ
బరఁగుఁ బ్రతిషేధశృంఖలబంధ మనఁగఁ
బెనుము పదమునఁ బ్రతిషేధఫణితి గలిగి
పటుపదాలంకృతులచేతఁ బాటి యగుచు. ౨౩

తే. ఎచటఁ బ్రజ యూర్జితశ్రీల నెసక మెసఁగ
రతి దలంపఁగ నెపుడు రాజ్యంబు గాదు,
విశ్వభూవిభుఁ డేరికి విభుఁడు గాఁడు
పట్టి మాడంగ వారలు ప్రజలు గారు. ౨౪

### మాలాదీపకము

క. మొదలిపదంబుననుండియు - నుదయోల్లేఖంబు లుత్తరోత్తరముగ నిం
పొదవఁగఁ బరువడి నెలకొను - నది మాలాదీపికాఖ్య మనఁ జనుఁ గృతులన్.

చ. ప్రకటిత మైనవిశ్వవిభుపాణికిఁ బుట్టె విత్తీర్ణి, యా విత్తీ
ర్ణి కసితకీర్తి గల్గె, నతినిర్మలకీర్తికి నుద్భవించె నీ
సకలవికర్ణవిశ్రుతులు సజ్జనకర్ణవిభూషణంబు లై,
యొకనికి నేల యబ్బు నిటు లొప్పెడు నుత్తమనిత్యసంపదల్. ౨౫

## సారాలంకారము

తే. పలుకుపలుకున కుత్కర్షబంధసిద్ధి - యుత్తరోత్తరసారమై యొలి నమరు,
నయ్యలంకృతి సారనామాఖ్యఁ జెందుఁ - జెవులకింపుగ సుకవులు చెప్పిరేని.
క. దేవతలకు వరుఁడు మహా - దేవుం డద్దేవుమౌళిదెసఁ జరియించున్
శైవాత్ముఁ డాతనికుల - పావనుఁడు చళుక్యవిశ్వపతి యిల నొప్పన్. ౩౦

## యమకములు

క. యమకాదిచిత్రబంధ - క్రమములు బహుళములు, వాని గతి భాషాకా
వ్యములకు నుచితములై చన - నమరింతుం గొన్ని వరుసఁ నగుఁ దెలియంగన్.
క. వచ్చినవర్ణంబులు కడు - నచ్చములై మొదల నడుమ నంతమునఁ గవుల్
మెచ్చఁ దదర్థము లలవడి - యచ్చెరువులు గాఁగఁ జెప్ప నగు యమకంబుల్.
తే. ఆదిమ ధ్యాంత గోచరాఖ్యత్రయంబు
నాదిమధ్యగతంబు మధ్యాంతగతము
వరుస నాద్యంతగతము సర్వగము ననఁగ
యమకములు సప్తవిధముల నమరు నండ్రు. ౩౧

## ఆది యమకము

తే. ఉక్తశబ్దంబు తుదశబ్ద ముక్తశబ్ద
విధమున నె తోఁచి యర్థంబు వేఱె యగుచు
వినులకు నింపు సొంపును నీనె నేని
నాదియమకంబు నాఁ జను నండ్రు బుధులు. ౩౨
క. వాసవవాసవధూ సువి - లాసములం దెగడి దెగడులలనలమనముల్
బాసించు సాత్త్వగుణముల - భాసురుఁ డగువిశ్వవిభునిపటువిక్రమముల్. ౩౩

## మధ్య యమకము

క. హృద్యార్థంబై పరఁగెడు - పద్యమునకు నిట్లు యమకబంధము నడుమం
బ్రద్యోతించిన నది యన - వద్యంబుగ మధ్యయమకవైభవ మెసఁగున్. ౩౪
క. శ్రీకీర్తిచంద్రికల వి - ద్యాకైరవవితతు లలరఁ గలకొలిపెడు నీ
పోకుల పోకులపౌరుష - మాకుముసహితాన్వవాయుఁ డగు భూపతికిన్. ౩౫

## అంత్య యమకము

క. పాదము లుత్క్రమ గం - పాదిలిగతి నొప్ప తుదను భావాలంకా
రోదయకరమై యమకం - బాదృత మగునేని యంత్యయమకం బయ్యెన్. ౩౬
తే. లీలఁ జాళుక్య విశ్వభూపాలవరుని
విజయలక్ష్మీకరగ్రాహవేళలందుఁ
జెవుల కింపుగఁ దొడరి ఘోషింపఁ దొడఁగె
గతుల కళ్యాణకళ్యాణగారవములు. ౩౭

## ఆదిమధ్యయమకము

క. పరపురఁ బద్మాకర మనఁ - బరికల్పిత మగుచుఁ బరఁగుఁ బద్మాకర మై
ధర నెగడు విశ్వభూవరు - వర సదనము బుధులపాలివైభవ పదమై. ౩౮

## మధ్యాంత్యయమకము

క. పరగండభైరవుని యరి - వరులును ముక్తాతపత్త్రవైభవు లెపుడున్
పరగండభైరవుని కవి - వరులును ముక్తాతపత్త్రవైభవు లెపుడున్. ౩౯

## ఆద్యంత్య యమకము

క. హరిదంబరవిక్రముఁ డనఁ - బరఁగుం జాళుక్యవిశ్వపార్థివుఁ డనుచున్
బొరిఁ బొగడుదు రరినృపతులు - హరిదంబరవిక్రమప్రయత్నయశస్కున్. ౪౦

## సర్వయమకము

క. వనవర్గనివసదహితుఁడు - వనవర్గప్రీతదివిజవల్లభుఁడు సకృ
ద్వనవర్గశివవయస్యుఁడు - వనవర్గార్కుండు విశ్వవసుధేశుఁ డిలన్. ౪౧

## పాదత్రయ యమకము

శా. శస్త్రోద్దండచితుఁ డైన యవ్విభు విపక్షశ్రేణికి న్విభ్రమ
త్స్వస్త్రీతస్ఫుటకంకణధ్వని రణస్థానంబున న్విభ్రమ
త్స్వస్ స్త్రీతస్ఫుటకంకణధ్వని మరుత్సౌధంబుల న్విభ్రమ
త్స్వస్త్రీతస్ఫుటకంకణధ్వని సరిత్సంగంబులం జేకురున్. ౪౨

## ద్వితీయోపమానగోపనము

సీ. విద్యావిభూతి వివేకసంపన్నత వాణీశ వాణీశ వైభవంబు
శౌచ ప్రతాపాతిసత్త్వసమగ్రత శిఖిమిత్ర శిఖిమిత్ర శీలనంబు
గాంభీర్య భోగ రంగద్రత్నసామగ్రి జలధీంద్ర జలధీంద్ర విలసనంబు
విక్రమ సౌందర్య విపులదర్పోన్నతి బలభద్ర బలభద్ర బంధురంబు
తే. దాల్చి వెలుఁగొందు విష్ణువర్ధనకులాబ్ధి
చంద్రుతో విశ్వభూపాలచంద్రుతోడ
చంద్రధరపాదభక్తిని స్తంద్రుతోడ
నితరనృపునకుఁ దుల్యత్వ మెట్లు గల్గు. ౪౩

## నిరోష్ఠ్యము

క. పంచమ వర్గాక్షరములు - వంచించి హితోచితార్థవంతంబులు గా
వించినకబ్బము వీనుల - కంచిత మై యది నిరోష్ఠ్య మన నొప్పారున్. ౪౪
శా. చాళుక్యక్షితినాథునూర్జితయశస్సంక్రాంతిచేఁ దూలు లో
కాలోకాద్రిఁ దనర్చుచీఁకటులు, కైలాసోల్లసద్దీధితుల్

సాలం జెల్లని చాయలం దనరు, నాశాదంతు లంతంతకున్
గాలాకారత నుజ్జగించు ననుమం గాంక్షింతు రత్యుక్తులన్. ౪౫

### గూఢ చతుర్థము

క. మొదలిచరణత్రయములలోఁ - బదిలముగాఁ గవిత నంత్యభాగాక్షరముల్
గదియం గ్రమమున నిల్పిన - నది గూఢచతుర్థ మనఁగ నన్నుత మయ్యెన్. ౪౬

చ. చతురుఁ బరార్థ్యశీలుఁ గవిశశ్వదభీప్సితభూరిదానకున్
వితతభుజానిసర్గబలు విక్రమసన్నుతి సేవితోదయున్
మతి కెగు గెల్ల సేసికొని మాన్యుల కాలము కాని మానుటై
చతురులు విశ్వభూవిభుని సన్నుతి సేయుదు గెల్ల కాలమున్ ౪౭

### చతుర్విధకందము

తే. ప్రథమకందంబు రెండవపాదయుగము
నందు రెండవ గఁణవర్గ మాదిగాఁగ
గడయు మొదలును వరుసతోఁ గలిపి చదువ
నగుఁ జతుర్విధకందమై నార్యసభల. ౪౮

### మొదటికందము

క. చాళుక్య విశ్వవిభునకు - వాలున్ బుధనుతియు సుగుణ వర్గము నిధులున్
జాలుటయు నీతినిరతియు - మేలున్ మధురతయు నీగి మీఱిన విధమున్. ౪౯

### రెండవకందము

క. బుధనుతియు సుగుణవర్గము - నిధులుం జాలుటయు నీతినిరతియు మేలున్
మధురతయు నీగి మీఱిన - విధమును జాళుక్య విశ్వవిభునకు వాలున్. ౫౦

### మూఁడవకందము

క. చాలుటయు నీతినిరతియు - మేలును మధురతయు నీగి మీఱినవిధమున్
జాళుక్యవిశ్వవిభునకు - వాలున్ బుధనుతియు సుగుణవర్గము నిధులున్. ౫౧

### చతుర్థకందము

క. మధురతయు నీగి మీఱిన - విధముం జాళుక్యవిశ్వవిభునకు వాలున్
బుధనుతియు సుగుణవర్గము - నిధులున్ జాలుటయు నీతినిరతియు మేలున్.

---

క. సరసిజముఁ గంచెయుఁగళము, - సరి మొదలినవాక్షరముల సమవృత్తముఁ, ద
త్పరమున మణిగణనికరము, - వెరవున రచియింపఁ బంచవిధవృత్త మగున్.

## సరసిజవృత్తము

శ్రీవిశ్వేశక్ష్మావరు సేవాశ్రితులు వొగడుదురు సిరి వరఁగుటకై
ధీవిద్యాసంభావితదేవున్ ధృతియుతు హితజనదివసదినకరున్
శ్రీవర్ధింతున్ భావనజీవున్ జితరిపు శశికులశిఖరిమృగపతిన్
భావోదంచద్భావితభావున్ బ్రతిదినసముదితబహుతరవిభవున్. ౫౪

## ప్రథమకందము

శ్రీవిశ్వేశక్ష్మావరు - సేవాశ్రితులు వొగడుదురు సిరి వరఁగుటకై
ధీవిద్యాసంభావిత - దేవున్ ధృతియుతు హితజనదివసదినకరున్. ౫౫

## ద్వితీయకందము

శ్రీవర్ధింతున్ భావన - జీవున్ జితరిపు శశికులశిఖరిమృగపతిన్
భావోదంచద్భావిత - భావున్ బ్రతిదినసముదితబహుతరవిభవున్. ౫౬

## నవాక్షరవృత్తము

శ్రీవిశ్వేశక్ష్మావరు సేవా - ధీవిద్యాసంభావితదేవున్
శ్రీవర్ధింతున్ భావనజీవున్ - భావోదంచద్భావితభావున్. ౫౭

## మణిగణనికరము

శ్రితులు వొగడుదురు సిరి వరఁగుటకై - ధృతియుతు హితజనదివసదినకరున్
జితరిపు శశికులశిఖరిమృగపతిన్ - బ్రతిదినసముదితబహుతరవిభవున్. ౫౮

---

క. తలకట్లు బోడలుం గొ - మ్ములు గలవర్ణములతోడి ముఖ్యపదములున్
గలకబ్బము హ్రస్వస్వర - కలితం బనుఁ గృతుల నరయఁ గవియనుమతులన్.

## తలకట్లు

క. వనదఘనవర్ణ్యచర్యక - మనవరత ప్రసర దయా నయ క్రమ మఘన
ర్దనకర మనత మనః కం - పన మగయ శశధరవంశభవమహ మగయున్. ౬౦

## బోడలు

క. స్థితి నిలిచిరి సిరి నించిరి - ధృతి మించి విరించివిధికిఁ గవిరిరి శ్రితి ని
ర్మితికి నిలియిచ్చిరి మితిని - క్షితి నిగిడిరి గిరిపతాకికింగటివిమతుల్. ౬౧

## కొమ్ములు

క. ఉరుగుణులుఁ గురులుఁ గుకురులు
గురులును బుణ్యులును బుధులుఁ గుతుకులు శ్రుతులున్
సురుచులు సుముఖులు సుఖులును
బురునుతు లుడురాజవంశ్యుఁ బూన్చురు గొపుడున్. ౬౨

## సరిగమపధనులు

క. నీసరి పని నీసరి ధని - నీసరిమాధారిగరిమ నీసరిగా రీ
నీసరిగా నిగమాగమ - గోసారులునుం బఠుక్యతులవిశ్వేశా. ౬౩

## గోమూత్రికాబంధము

తే. వర్ణములు నాల్గుపంక్తుల వరుస వ్రాసి
మూలలం దోలి గోమూత్రలీలఁ జదువ
నుక్తపద్యంబు దా నగు చుండెనేని
దనరు గోమూత్రికాఖ్యబంధంబు నాఁగ. ౬౪

## మాలిని

వివిధ నయ విధిజ్ఞున్ విద్ధవీరారిగర్వున్
భువి ధనద విధిజ్ఞున్ బుద్ధసారాభిగమ్యున్
ప్రవరగుణ గరిష్ఠున్ భాతవిశ్వేశుఁ గాంతున్
ధవళగుణగరిష్ఠున్ ధాత విశ్వేశుఁ గాంచున్. ౬౫

## చక్రబంధము

తే. వలయనవకంబు నాలురేఖలు లిఖించి
యందు శార్దూల విక్రీడితాక్షరములు
పెట్టి నడుచుట్లఁ గవి కృతి పేళ్లు రెండు
చక్రబంధంబునకు నిడి చదువవలయు. ౬౬

శా. చిత్తోపేతవికస్వరోత్తమగుణున్ శ్రీలంపటున్ సత్క్రియా
విత్తోద్దండును విశ్వభూరమణు నుర్వీకృత్యసత్కృత్యదున్
విత్తాయత్తమతావిధిజ్ఞు మహితున్ వీతిక్రమాతిప్రియా
యత్తుం జూచి నినున్ విశేషవిభుఁగా యాచింపుదున్ దుర్జయా. ౬౭

## కుండలిబంధము

క. ఎనుబది పదములుగాఁ - జెనఁ గొని యుపదేశమునఁ దెలియఁ గుండలిబంధం
బనఁ జనుఁ దత్పదములఁ జక్రని వ్రాలిడి వరుసఁ జదువఁ గబ్బం బమరున్. ౬౮

మ. సతతోద్యత్కరవాలభైరవు విరాజద్రాజతేజస్కుఁ జే
ద్గతసత్యస్వరపూతకార్య్య వరదున్ దత్కాలఖేలద్ధ్వజ
ప్రతిభీతద్విడధీశనుత్యచరణున్ భావార్ధసారజ్ఞు ను
చ్ఛ్రితసారస్వతభూతిసారవిషయున్ జింతింతు సంతుష్టిలోన్. ౬౯

## ఖడ్గబంధము

క. తరతరమ పూసనుండియుఁ - బరుజాలు దట్టాడి మధ్యపద్ధతి ధారా
పరివృతి నుపదేశ క్రమ - పరిచితిఁ బతియింప ఖడ్గబంధం బయ్యెన్. ౭౦

క. సమరమహీ మధుమత్సమ - సమధికతం ద్రుంచు విమతశతులన్ లీలన్
హిమరుక్కులుండు మరల్వ - త్సమసత్త్వతఁ బేర్చుచుండు సర్వజగములన్. ౨౧

---

ఆ. ప్రథమ యమక చిత్రబంధాదు లొకకొన్ని
తెలుపఁ బడియె బుధులు దెలియవలయు
నుర్విఁ బద్మబంధ సర్వతోభద్రాదు
లంధ్రభాషఁ జెప్ప నరిది యండ్రు. ౨౨

---

## పదదోషములు

---

మ. ప్రతిభాకంపన మబ్బినం గవులచేఁ బాటిల్లు శబ్దార్థసం
గతదోషంబులు కొన్ని, కొన్ని ధర సత్కావ్యంబులం దైన ను
ద్ధత వేగాకులితాపగావితతిలో డిండీరపిండాకృతిన్,
ధృతి సందర్భముచోట వానిఁ దగ జింతింపం దగున్ సత్కవుల్. ౨౩

క. పద వాక్యార్థ త్రితయ స- ముదితము లై వివిధదోషములు చెవి కసుఖా
స్పదము లగు; వాని తెఱఁగులు-మది సుకవుల కెఱుఁగవలయు మఱువక యెప్పుడున్ ౨౪

సీ. అప్రయుక్తము నపుష్టార్థకంబును నసమర్థకంబును నిరర్థాహ్వయంబు
నపసంస్కృతంబు నేయార్థంబు సందిగ్ధ నష్టప్రయోజనక్లిష్టములును
గాఢపరిక్లిష్ట గూఢార్థకంబులు నప్రతీతికము నన్యార్థకంబు
నవిమృష్టవిధేయాంశంబు నశ్లీల పరుష విరుద్ధార్థభాషితములు

తే. ననఁగఁ బదియేడువిధము లై యతిశయిల్లఁ (ను)
గావ్యముల దోషములు పదగతము లగుచు;
వాని నెఱుఁగక రచియించు వట్టికవుల
వేడ్క మెచ్చఁడు చాళుక్యవిశ్వవిభుఁడు. ౨౫

## అప్రయుక్తము

క. దైవతుఁడు గాచుఁ గడుసం - భావన నన నప్రయుక్తి పదమునఁ బరఁగున్
వావిరిఁ బుల్లింగత్వము - దైవతపదమునకుఁ దఱచు దనరక యునికిన్. ౨౬

## అపుష్టార్థము

ఆ. జగతి నెనిమిదింటిసగములో సగ మగు
భుజము లాహవములఁ బొల్లు లగునె
భూపతులకు నన నపుష్టార్థ, మర్థార్థ
పదము లర్థపుష్టిపదము గాదు. ౨౭

## అసమర్థము

క. జనపతి వనధర పరివృత - యనఁ జనుధర సేరె నవఁగ నసమర్థ మగున్
వనధికి నీవనధరపద - మొనరించుట శబ్దసంపదూనత యగుటన్. ౭౮

## అనర్థకము

క. నలి నొప్పెఁ బురుషుఁ డొగిఁ-గడు-నలవడియెం బడఁతి యన ననర్థక మయ్యెన్
నలి ననియెడునది యొగినన్ - పలుకును బూరణము లంధ్రభాషకు నగుటన్.

## అపసంస్కృతము

క. స్వరిశన మతివకు సీతకు - దరిశనము మనోహరంబు దరుణికి ననఁగా
థర నపసంస్కృత మగుఁ ద - గ్గురుత్వ మాద్యక్షరములఁ గూడక యునికిన్.

## నేయార్థము

క. వరునిపయిఁ గూర్మి వనితకు - నిరవగ్రహ మెపుడు ననిన నేయార్థ మగున్
నిరవగ్రహశబ్దార్థము - తిరముగ నేతవ్యసరణిఁ దెలియుటచేతన్. ౮౧

## సందిగ్ధము

క. అవనీభృత్కటకంబు - త్సవపద మెల్లపుడు ననిన సందిగ్ధం బా
బడిరెండు మగు నగరిట మా - నవపతిపుర సంశయంబు నరుల కొదవుటన్. ౮౨

## అప్రయోజనసంశ్లిష్టము

తే. అప్రయోజనసంశ్లిష్ట మగు సమీర - ణాశనారాతికృతకేతనాగ్రజన్మ
శత్రుకటముల నిల్పురు శత్రు లనిన - నేతదర్థంబు గిరులకు నేఁగి రనుట. ౮౩

## క్లిష్టగూఢార్థము

తే. కురజ కంఠేక్షణాలు క్షామగల్లకటులు - ఘనవిపన్నాగ్రికలుఁ బురికాంతఁ లనఁగఁ
గిష్టగూఢార్థ మనఁ జనుఁ గ్లేశసరణిఁ - దత్తదర్థంబు నెఱిఁగడి తలఁపుచేత.

## అప్రతీతికము

క. శ్రుతి బాడబులకు మన్యు - స్థితి యుచిత మనంగ నప్రతీతిక మగు వి
శ్రుతిబాడబమన్యువులకు - వితతార్థము రెండుఁ బెక్కువిధము లగుటచేన్. ౮౪

## అన్యార్థము

క. అదట నింద్రుని జగదా - హ్లాదంబునఁ జంద్రుఁ డనిన నన్యార్థము సం
పాదిల్లు నియతనామ - ప్రాదుర్భావముల నెన్నఁబడ కుండుటచేన్. ౮౫

## అవిమృష్టవిధేయాంశము

క. ఉవిదకు మొలనూలు మనో - భవురెండవనారివోలెఁ బరఁగె ననంగా
నవిమృష్టవిధేయాంశం - బవు నతనికి రెండునారు లక్షరక యునికిన్. ౮౬

### అశ్లీలము

క. వ్రీడామంగళ కుత్సలు - వోడుగ నశ్లీల మనెడుదోషము మూఁడై
జాడపడు గ్రామ్యవచన - క్రీడలఁ; దత్తెఱఁగు కృతుల గెలిం జేయుడీ. ౭౭

### వ్రీడాశ్లీలము

క. జనపతికృప మదయుతులై - చనుకుజనులు సుహృత్కేశ సన్నిభులును మో
హానరసరుచిపరిపూర్ణులు - నన వ్రీడాశ్లీలదోష మగు వినుచోటన్. ౭౮

### అమంగళాశ్లీలము

క. అన్నన కధిపతి యలుకం - గన్నుల నీరొలుక బట్టగడుఁ దతిపె ననం
గ్లిన్నశ్మశాన మన్న - ట్లన్నేరనిపలు కమంగళాశ్లీల మగున్. ౮౦

### జుగుప్సాశ్లీలము

తే. నాతి గనయంబు వదలింప నాథుమీఁద
నాభిపంకజగంధ మున్నతిఁ జరించె
నన జుగుప్సాభిధాశ్లీల మయ్యె నింతి
కపుడు పాకౄలిరోంపికం పర్గ మగుట. ౮౧

### పరుషము

క. కురుకూర కరకౄ శ బర్బర-తర్కౄత మవ్విటునిసురతతంత్రం బనుమాట
చేరా౯న్నఁ బరుష మనఁ జనుఁ-దారోకౄను క్రుతికటువు ననఁగఁ దజ్ఞులచేతన్.

### విరుద్ధము

తే. మిత్రుఁ డుదయింపఁ గువలయామోదవృష్ఠ మొదవె
నన విరుద్ధంబు శ్రుసునకు నవని కైనఁ
గలువలకు నరు౯నకు నైనఁ గల్గుమైత్ర్య
కారణం బాకౄ నెపమునఁ గానఁబడమి. ౮౩

---

## వాక్యదోషములు

---

క. ఇవి పదగతదోషంబులు-కవులకు నిట మీఁద వాక్యగతదోషంబుల్
వివరింతుఁ గొన్ని యవియును-వివిధంబులు సూక్ష్మములు వివేకింపఁ దగున్. ౮౪

సీ. క్రమభంగము విసంధికంబును బునరుక్తికంబును వ్యాకీర్ణకంబు నాఁగ
భిన్న వచస్కౄంబు భిన్నలింగంబు ఛందోభంగ యతిభంగ దోషములును
న్యూనాధికోపమా న్యూనపదంబులు నట సమాప్తికపునరాత్తకంబు
నశరీరకంబును నధికపదంబుఁ బ్ర క్రమభంగము పతత్ప్రకర్షకంబు

తే. వినఁగఁ బదియేనువిధులఁ గావ్యములయందు
వాక్యదోషంబు లుదయించు; వానిఁ దెలిసి
కబ్బములు చెప్ప నుత్తమకవుల మెచ్చు
విష్ణువర్ధనచాళుక్యవిశ్వవిభుఁడు. ౯౫

## క్రమభంగము

క. శ్రీవిష్ణువర్ధనాఖ్యు-త్కృష్టవరుకీర్తిప్రతాపమహిమలతో రా
జీవేందీవరమిత్రులు-గావింతురు చెలిమి యనఁగఁ గ్రమభంగ మగున్. ౯౬

## విసంధికము

క. కులఅంబుజఅర్కుం డిల-బలిఇంద్రఉదారుఁ డనెడుపలుకులలో న
చ్చులు హల్లులతోఁ గూడం-గలయక యుండిన విసంధికం బగుఁ గృతులన్ ౯౭

## పునరుక్తము

తే. చక్రి చక్రాయుధుఁడు పోరు సలుపుచోట
ననిన నిది శబ్దపునరుక్త మండ్రు బుధులు
శార్ఙ్గ చాపాస్త్రుఁ డాజి నెసంగునెడల
ననిన నిది యర్థపునరుక్త మగుఁ దలంప. ౯౮

## వ్యాకీర్ణము

క. తలల వరాహాంక మురం-బుల నాజ్ఞ యుఁ దాల్చి విశ్వభూవిభుఁ గొలువం
దలఁపుదు రరు లని చెప్పం-దోఁగక వ్యాకీర్ణ మనెడుదోషం బయ్యెన్. ౯౯

## భిన్నవచనము

తే. అనిశగంగంబులును నసేవ్యములు నైన
యంబునిధు లట్లు గంభీర మగుమనంబు
వశము గా నన్న నది భిన్నవచన మయ్యెఁ
జెక్కుమాటల నొకమాట భేద్య మగుట. ౧౦౦

## భిన్నలింగము

క. చాళుక్యవిభుఁడు వనుపఁ ద్రి-శూలంబునుబోని సేన శూరత చేతం
గూలుదురు వైరు లనిలో-లీలం బోరి నన్న భిన్న లింగం బయ్యెన్. ౧౦౧

## ఛందోభంగము

క. ఎందును నీరాజున కే-చందంబున లేరు సరి జగంబుల నెల్లన్
సుందరతను శూరత నన-ఛందోభంగంబు కృతులఁ జను దోషం బై. ౧౦౨

## యతిభంగము

క. చెప్పినయెడ నిలువక వడి-దప్పిన యతిభంగ మనఁగఁ జనుఁ దక్కృతి నీ
చొప్ప నెఱుంగుఁడు తెనుఁగున-నెప్పుడును విరామభంగ మెన్నరు కృతులన్.

### న్యూనోపమ

తే. చంద్రతారాభిరాముఁ డై చదలు వొలిచెఁ
బుండరీకాంక కాసారఖండ మనఁగ,
నట్లు చెప్పిన న్యూనోపమాఖ్య యయ్యె
నుపమ తారాపథంబున కూనమగుట. ౧౦౪

### అధికోపమ

తే. వికలముఖు లైన యరివధూటికలు గ్లాంతి
నలిన కైరవ లగు గ్రీష్మ నదులభంగి
నైరి నా నధికోపమ యయ్యె నగయ
నందుఁ గైరవ ముపమకు నధిక మగుట. ౧౦౫

### న్యూనపదము

క. పరగండభైరవుని శ్రీ-చరణంబుల కెరఁగ కున్న సమకూటె వసే
చరత యన న్యూనపద మగు-పదునకు నరిపదముఁ గవితఁ బతితము గామిన్.

### సమాప్తపునరాత్తము

క. అవనీశుయశము గుణమణి-నివహంబులు నెగడ నెగడె నిఖిలము నిండెన్
గవివినుతులచే ధవళిత-భువనం బనఁగా సమాప్తపునరాత్త మగున్. ౧౦౭

### అశరీరము

క. కుశలుఁ డగు నృపతి సతతము-కృశకులధర్ములను సహజకృత్రిమగుణులన్
శిశువుల నని మును పలుకఁగ-నశరీరము నిగ్రహించు ననుక్రియ నిడమిన్. ౧౦౮

### అధికపదము

క. కరవాలభైరవుని చే-నరుగును రరు లర్కమండలాకారములో
సురఁగి యన నధికపద మగు-నరయఁగ నాకారశబ్ద మధికం బగుటన్. ౧౦౯

### ప్రక్రమభంగము

క. నారలు చీరలు మసురా-హారంబులు కూర లడవి యాలయ మనఁగాఁ
గూరుం బ్రక్రమభంగము-వారక వనగృహము లేకవచనం బగుటన్. ౧౧౦

### పతత్ప్రకర్షము

తే. ఏచి మాకొన్నఁ బలులఁ గ్రొవ్వెసఁగుకరులఁ
శాబు మృగములఁ ద్రుంచు సిధటుఁ డనంగ
నడరి విపరీతగతిఁ జెప్ప నగుఁ బతత్ప్ర
కర్షదోషంబు దగ దీనిఁ గానవలయు. ౧౧౧

---

## అర్థదోషములు

క. ఇవి వాక్యజాతదోషము-లవిరళముగఁ దెలియుఁ డింక నర్థక్రమసం
భవము లగుదోషములఁ దగఁ-జెవులకుఁ జవు లూరఁగ నోలిఁ జెప్పెద నొప్పన్.

సీ. వరుస నపార్థంబు వ్యర్థంబు హీనాధికోపమంబులు సంశయోక్తికంబు
నతిమాత్రకంబు నేకార్థంబు భిన్నంబు జరపదక్రమమును బరుషకంబు
నసదృశోపమమును నప్రసిద్ధోపమ మును హేతుశూన్యార్థమును దనర్చు
విరసాహ్వయంబును నిరలంకృతియు విరుద్ధంబు నసంగతత్వం బనంగఁ

తే. గబ్బముల సప్తదశదోషఘటన లొదవుఁ
బ్రౌఢి వానికిఁ బాసి సత్ప్రభువు లైన
యుభయభాషాకవీంద్రుల కొసఁగుఁ బొసఁగఁ
జారుతరకీర్తి విశ్వేశచక్రవర్తి. ౧౧౩

## అపార్థము

క. ధనదునకు నెంద అంగనలు?-లనుములు నాకమునఁ బండు నా? పాతాళం
బునఁ బాము లెన్నిగలవో?-యనఁగ నపార్థంబు వాచికార్థము గామిన్. ౧౧౪

## వ్యర్థము

తే. 'వీరు పెద్దలు, కులమును బౌరుషంబు
విశ్రుతంబులు, గుణము లీవితతు, లేల
యధిపుఁ గొలువరు దా?' రన వ్యర్థ మయ్యెఁ
దొలుతఁ బలుకులు భజనహేతువులు గామి. ౧౧౫

## హీనోపమ

క. శుక్రుఁడనుబోలె దనుజులు
మిక్కుటముగఁ గదుర సురలు మృగములభంగిన్
దిక్కులు చెడి పాఱిరి నాఁ
దక్కక హీనోపమాభిధానంబయ్యెన్. ౧౧౬

## అధికోపమ

క. అకుటిలగతిఁ గొలఁకులలో-బకములు మునివరులఁబోలెఁ బరఁగె ననంగాఁ
బ్రకటిత యగు నధికోపమ-సుకవిత నీరెండుఁ జొనుప శూన్యం బయ్యెన్. ౧౧౭

## సంశయము

క. నీ వన్నపలుకు చెప్పిన-నాకెలఁదికి నలుగ నేల యన సంశయమై
భావింపంబడు నీ వను-నాకెరవున నన్న గామి నవ్యాఖ్యం బై. ౧౧౮

## ఏకార్థము

క. మలయసమీరము మలసెను-మలఁగొనియెఁ బటీరశైలమారుత మనుచుం
బలికిన యర్థమ క్రమ్మఱఁ-బలుకుట యేకార్థ మండ్రు ప్రతిభావంతుల్. ౧౧౯

## అతిమాత్రము

క. అతిమాత్రం బగు నతిభా-షితమున నేకోదకమునఁ జెడు జగ మనుచున్
మితముగ నరిసతు లేడ్చినఁ-బ్రతతాకృతి నదులు పర్వె బాష్పజలములన్. ౧౨౦

## భిన్నసంబంధము

క. నలువ భవదహితకీర్తులు-నలుపులు గావించుతలఁపునం జేసి సుమీ
మలినత్వము కుజనమనః-స్థలముల నిడె ననఁగ భిన్నసంబంధ మగున్. ౧౨౧

## అపక్రమము

తే. పురుషుఁ డొక్కండు పరిణయంబునకు మున్న
నరుస సమకూర్చె సీమంతపరికరములు
అన నపక్రమ మండ్రు కృత్యంబు గడచి
యవలిపని సేయు నని చెప్పనట్టికృతుల. ౧౨౨

## పరుషము

క. వేఁడెదు నర్థులఁ గనుఁగొన-వాఁడికుఠారమునఁ జెంపవలదా యను నీ
సూఁడరిమాటల పరుషము-పోఁడిమి చెడు నట్టియర్థములఁ గబ్బములన్. ౧౨౩

## అసదృశోపమ

క. వసుధాపతి కోపాగ్ని-ప్రసరంబులచేత రజతపర్వతభంగిన్
వెస వెలిఁగెఁ బోర ననఁగా-నసమత నిది యసదృశోపమాహ్వయ మయ్యెన్.

## అప్రసిద్ధోపమ

తే. బాష్పకణకీర్ణ మై యొప్పుఁ బణఁతిమోము
మంచు నిండినతొగపువ్వుమాడ్కి ననిన
నప్రసిద్ధోపమార్థ మై యాడరు నండ్రు
కుముదముఖముల కుపమాప్తి గూడ దనికి. ౧౨౪

## హేతుశూన్యము

తే. ధర్మగోరక్షణార్థంబు చంపుఁ బులుల
ననక మున్నక పులివేఁట లాడు నృపుఁడు
కూడఁ దై యున్న నది హేతుశూన్య మయ్యె
నిష్ప్రయోజనకథన మై నవ్వటిలుట. ౧౨౫

### విరసము

క. తలఁ పవుచూపులు నిద్దపు-బలనగవులు నింత యొప్పనే భయమున ని
చ్చలు చను నరిసతులకు నన-విలసనసమయంబు గామి విరసం బయ్యెన్. ౧౨౭

### నిరలంకృతి

క. నీచుఁడు సభలోపల దు-ర్వాచాలత నాత్మదోషవంచితుఁ డగు నా
నేచును నిరలంకృతి యై-యీచంద మలంకృతులకు నెక్కుడుక యునికిన్. ౧౨౮

### విరుద్ధము

ఆ. చర్చ సేయ జగదసమ్మతి మగునర్థ
మది విరుద్ధ మనఁగ నతిశయిల్లు
దేశ కాల లోక దిక్సమయక విరు
ద్ధాహ్వయములచేత నైదు నాఁగ. ౧౨౯

### దేశవిరుద్ధము

క. మరుదేశంబునఁ జెరువులు-పరిపూరితసలిలనదులు పరఁగి పిపాసా
తురులఁ దనియించు నాఁగా-ధర దేశ విరుద్ధ మయ్యెఁ దజ్జ్ఞుల కెల్లన్.

### కాలవిరుద్ధము

తే. గ్రీష్మకాలంబు మత్తిలి కేకు లాడె
నింద్రగోపంబు లిలమీఁద నెల్లఁ బొడమెఁ
జాఁగెఁ బ్రథమాంబువులకు నై చాతకంబు
లనఁగఁ గాలవిరుద్ధసమాఖ్య మయ్యె. ౧౩౧

### లోకవిరుద్ధము

క. ఘనగజకుంభంబులలో-మొనయుఁ బ్రవాళంబు వెలయు ముత్తెపుగము ల
య్యెనుఁబోతులకొమ్ములలో-నన లోకవిరుద్ధ మయిన యర్థముఁ దలపన్. ౧౩౨

### దిగ్విరుద్ధము

క. ఉదగంబుధివీచుల ను-న్నదుఁడై క్రీడించె దాక్షిణాత్యుఁ డనంగా
మదిలో వినియెడువారల-యెద నించును దిగ్విరుద్ధ మనునర్థం బై. ౧౩౩

### సమయవిరుద్ధము

క. అమరఁగఁ బులితోలును మ-స్తమునం బలుజడలు దాల్చి సౌగతుఁ డొప్పెన్
హిమకరశేఖరుఁ డని నన-సమయవిరుద్ధార్థ మగుచుఁ జను సత్కృతులన్. ౧౩౪

### అసంగతి

తే. శ్రుతము శాంతియు నితనికిఁ బొట్టలనక
దయయు దానంబు నితనికి దయిత లనక

జోడు దప్ప నసంగతి స్తుతి యొనర్పఁ
బద్యములయందు సహచరభ్రంశ మయ్యె. ౧౩౫

క. ఈదోషంబులు మొగి న-ర్థోదితములు పూర్వభాషితోదారశ్లే
షాదిగుణంబులతోడఁ బ్ర-మోదంబునఁ గూడి యొసఁగు ముఖ్యార్థములన్. ౧౩౬

క. శ్రుతిపరుషత మానుటకై-మతిఁ గర్తవ్యంబు సౌకుమార్యము చెప్పన్
జతురతఁ గాంతి ఘటించుట-వితతగ్రామ్యార్థహరణ విశ్రుతిఁ జేయున్. ౧౩౭

క. కృతుల నపుష్టార్థప్రవి-హతికొఱకై చొనుపవలయు నర్థవ్యక్తిన్,
వితతన్యూనాధికపద-యుతిహతికై సమత చెప్ప నొప్పుం గవితన్. ౧౩౮

తే. అనుచితార్థ నిరాకరణార్థికొఱకు
నగు నుదాత్తతఁ గావ్యంబులందుఁ జొనుప.
యుక్తపాదవిసంధివిచ్యుతి యొనర్చు
పనికి నూర్జస్వి కర్జంబు పద్యములను. ౧౩౯

ఆ. తుదిఁ బతత్ప్రకర్ష దోషాపహతికై
యుక్తి రీతిఁ గావ్య మొగి నొనర్ప
నప్రతీతిక పరిహారంబు కొఱకునై
సుప్రసాదగుణముఁ జొనుపవలయు. ౧౪౦

క. చ్యుతసంస్కృతి మానుటకై-యతిమధురసుశబ్దవృత్త మగు నొనరింపన్,
బ్రతత ప్రక్రమభంగా-హతికై సంక్రమతఁ గూర్ప నగు నండ్రుబుధుల్. ౧౪౧

క. ప్రేయోలంకారము రా-శ్రేయం బగుఁ బరుషదోషశిథిలతకొఱకై
చేయఁ దగునూర్జితంబ్రము-హేయాశ్లీలంబుఁ దొలఁగ నెగుచుటకొఱకై. ౧౪౨

క. ఇత్తెఱఁగున మఱియు గుణా-యత్తాలంకార సరణు లరసి కవీంద్రుల్
చిత్తంబున దోషోదయ-వృత్తం బెడలించి కవిత విరచింపఁ దగున్. ౧౩౩

---

చ. విరహితవైరికై భువన విశ్రుత సద్గుణ రత్నహారికై
నిరుపమకీర్తికై యువతి నిర్మథనక్షమ చారుమూర్తికై
విరచితవృద్ధికై సమర వీరవిరాజిత జైత్రసిద్ధికై
పరిచితశక్తికై గిరిశపాదపయోజనిషక్తభక్తికై. ౧౪౪

క. పరగండభైరవునకై-యరిమానసచండడిండిమారావునకై
కరవాలభైరవోర్జిత-బిరుదునకై నతవిమతనిభృతవరదునకై. ౧౪౫

### తరలము

సుజనపోషణశాలికై రణశూరతావనమాలికై
రజనినాథకులాగ్రగణ్యవిరాజికై జయవాజికై

గజభుజంగమభారవారణకారికై యవికారికై
విజయవిక్రమధుర్త్తకై మనవిశ్వభూవరభర్త్తకై. ౧౪౬

## గద్యము

ఇది శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన వివిధబుధ
విధేయ విన్నకోట పెద్దయ నామధేయ విరచితంబైన కావ్యాలంకార
చూడామణియను నలంకారశాస్త్రంబునందు విమిశ్రితాలంకార
యమకాద్యనుప్రాసచిత్ర బంధచిత్ర సందర్భ దోష గుణ
నిరూపణ ప్రభృతి పంచమం బన్నది

## షష్ఠోల్లాసము.

---

# సప్తమోల్లాసము

## ఛందస్సు

క. శ్రీవిశ్వేశ్వరునకునై - భావితవిశ్వేశ్వరాంఘ్రిపద్మునకై సం
భావితపదవాక్యకళా-కోవిదునకునై నయవిశేషగుణవిదునకునై. ౧

క. ధీయుత పింగళనాగ హ-లాయుధ జయదేవ ముఖ్యు లగునార్యులచే
నాయతమై యామ్నాయ ప-దాయిత మగుఛంద మొప్పిదముగ నొనర్తున్. ౨

క. ఛందోవిభ్రమవిధితోఁ-బొందిక దా వేదశాస్త్రములు వాగ్వనితా
మందిరము లైన యత్పుర-విందభవునివదనములకు విభవం బొసఁగన్ ౩

శా. హంసై గౌరవలాఘవప్రకృత మై పూర్వాక్షరస్నిగ్ధ మై
యండం బై శ్రుతిసమ్మతప్రకట మై ప్రాపించునానావిధ
చ్ఛందస్సూత్రము లేక లోకములఁ జంచద్వాక్యరత్నావళీ
సందోహంబులు కంఠభూషణము లై సంధిల్లునే యేరికిన్? ౪

క. ఛందము వాఙ్మయవిద్యా-కందము యతిగమకసమకగణవృత్తకృతా
నంద మమందార్థకళా-విందము వాణీకరారవిందము ప్రతిభన్. ౫

క. పటుమతి నట మున్ను మహా-నటుఁ డీశుఁడు వాచకాభినయమునకై యు
త్కటయతిలయమయతాళ-స్ఫుటవికటచ్ఛంద మందముగ నొనరించెన్. ౬

క. సృజియించి యిచ్చె నజునకు-నజుఁడును భరతునకు నిచ్చె నమ్మునివరుఁడున్
ఋజుమతి యగుపింగళుఁ డను-భుజగమునకు నిచ్చె భుజగభోజనుఁ డచటన్. ౭

క. ప్రియ యది యేటిది నావుఁడు - బయిలోఁడినపలుకుకుడలపొల్లులచేతన్
మయరస త భ జ నగణము లు-దయ మొందెన్ ఛంద మొందెఁ దద్గణయుక్తిన్. ౮

క. గురువును లఘువును శంకర-గిరిజాతాకృతులు తత్ప్రకృతములు గణముల్
గరుడునిపై పింగళిఫణి-విరచించిన తెఱఁగు వరుస వివరింతుఁ దగన్. ౯

వ. అవి యెయ్యవి యనిన — ధీశ్రీస్త్రీమ్, వరాహాస్య్, కాగుహార్, వసుధాస్, సా తేక్వత్, కదాసజ్, కింవదభ్, సహసన్: ఇట్లని గరుడభయంబునను దిర్యగుదితస్వభావంబునను సాభిప్రాయశ్లేషయనేయార్థంబుగా గణస్వరూపనిరూపణంబునకునై పింగళనాగంబుచేత నుచ్చరితంబు లగుతద్వాక్యాంతరంబులం బొల్లు లై తోఁచు మకార-యకార-రేఫ-సకార-తకార-జకార - భకార - నకారంబులు గణాభిధానంబులకు నాద్యక్షరంబు లగుటచేత మగణ-యగణ-రగణ - సగణ-తగణ - జగణ-భగణ-నగణంబులు క్రమంబునం బ్రస్తారోద్ధారంబునం బ్రభవించెఁ. దత్స్వరూపంబులనుం దదధిదైవతంబులను బరిపాటిం బ్రకటింతు నె ట్లనిన. ౧౦

క. ధీశ్రీస్త్రీ మన మగణము-విశ్రుత, మధిదైవతంబు విశ్వంభర; ని
త్యశ్రీల నొసఁగు మగణ-ప్రశ్రయముఖకవిత చెప్పఁ బని దనుఁ దలఁపన్. ౧౧

క. జగతీవరాహో యనఁగా-యగణం బుదయించె నుదక మధిదైవత మై,
యగణప్రయోగములయెడఁ-దగిలించున్ సిరులుఁ దన్నుఁ దలఁపు న నిలుపన్.

తే. భ్రమిసి కాఁగుహో రనునట్టి పలుకు రగణ
మయ్యె; నధిదైవతము వహ్ని యయ్యెఁ గానఁ,
గవితముఖమున రగణంబు గట్టునపుడు
వహ్నిఁ దలఁపంగఁ బగలకు వచ్చుఁ జావు. ౧౩

క. గతికై ఫణివసుధా సని-మతిఁ దలఁచిన సగణ మయ్యె; మారుత మధిదై
వత మంద్రు; సగణముఖ మగు-కృతి పగలకు మగుడులేని కీడొనరించున్. ౧౪

క. సాకేత్య దనుడుఁ దగణము-జాతం బై శూన్య మగుడు, జడ లధిదైవం
బై రవరెఁ; దగణముఖకృతి-శ్రితుం డగునృపుని నైన హీనుం జేయున్. ౧౫

ఆ. తనరఁ బింగళుఁడు కదాస జనన్ జగ
ణము జనించెఁ, దదధినాథుఁ డినుఁడు;
తొలుతఁ గృతిని జెప్పఁ దొణఁగుచో నర్కునిఁ
దలఁప నరికి రోగతతులు వొడము. ౧౬

క. ఖగపతి కింవద భన నది-భగణం; బుడురాజు తదధిపతి; భగణాద్యం
బుగను గృతి చెప్పనప్పుడు-మృగాంకుఁ దలపంగ నగు సమీహిత కాంతుల్. ౧౭

క. సహస నని పలుక నగణం-బహుతం బగుఁ, దదధిదైవ మగుఁ బ్రాణుఁడు; త
ద్విహితస్మృతి నాయువు గడు-నిహితం బగు నగణముఖ వినిర్మాణములన్. ౧౮

క. గురులఘువులు గలములు; లఘు
గురులు గురులఘువులు నెన్ని కొన వహము లగున్;
గురులఘువులు త్రితయము లై
మురిసిన నవి మగణ నగణములు నాఁ బరఁగున్. ౧౯

ఆ. మగణరచన కాదిమధ్యాంతలఘువులు
గలిగెనేని య ర త గణము లయ్యె;
నగణ రచన మొదల నడుమను గడ గురు
వుండెనేని భ జ స లొప్పుమిగులు. ౨౦

క. లోవంక వ్రాయు గురు వగు;-నేవంకయు లేనివ్రాఁత యొసఁగును లఘువై;
దైవాత్మక రేఖాయుత-భావజశరనిభము లంద్రు ప్రాజ్ఞులు మఱియున్. ౨౧

క. గురువు లగు నొంటిసున్నల-నిరుసున్నల జమిలివ్రాల నెసమల నూఁదన్
బొరసినవియు దీర్ఘములు, ని-తరములు లఘువులు గణములు త్రిత్రితయంబుల్.

క. ఇందుఁడు గాంతి వపుఃప్రభఁ-గందర్పుఁడు సప్తసప్తి ఘనరుచి ననఁ, జె
న్నందినయవి గురువులు చె-న్నొందిననిడుపులును నట్లు యున్నవి లఘువుల్. ౨౩

క. కృతికష్టపులును కృపిద్రుపులును-పితృభ్రుతులును నిలుచు పదముపిఱుఁదనలఘువుల్.
కృతిలో నగణములును దీ-ర్ఘత నొందినయేని రెట్టిగాఁ దగు నెఱుఁగన్. ౨౪

మ. కమనీయంబగు గద్యపద్యమయమై కావ్యంబు; గద్యంబు నా
నమరుం బాదనియంత్రణానియమవిన్యస్తప్రశస్తార్థమై,
రమణీయాంఘ్రిచతుష్టయ స్ఫుట వళిప్రాసాభిరామంబు ప
ద్యము; తత్పద్యము వృత్త జాతు లన రెండై పర్వుఁ గావ్యంబునన్. ౨౫

క. వృత్తం బనఁ జతురంఘ్రి సు-వృత్తంబై వళుల ప్రాల వెలయును; మాత్రా
యుత్తగణంబులచేతఁ బ్ర-వృత్తాకృతిఁ బరఁగు జాతివితతులు కృతులన్. ౨౬

తే. విరతి విశ్రామ విశ్రాంతి విరమ విరమ
ణాభిధాన విరామము లనెడిపేళ్లు
యతికిఁ బర్యాయపదములై యమరుఁ గృతిని;
యుక్తి పదములఁ గృతియందు నునుపవలయు. ౨౭

క. కరి గిరి పుర నిధి శశి ది-క్ప్రతిసంఖ్యానంబు గణితపరిభాషలచే
నరసి యతి నిలుపుచోటులు-పరికింపఁగవలయుఁ గావ్యబంధన వెలయన్. ౨౮

## వళిప్రాసములు

క. పాదప్రథమాక్షర ము-త్పాదిత మగు వళి యనంగఁ; బ్రాసం బనఁగాఁ
బాదద్వితీయవర్ణము;-పాదచతుష్కమున నిలియ ప్రాసము లెప్పుడున్. ౨౯

## వళిభేదములు

క. స్వరజలు వర్గజ లిత రే-తరవర్గజ లనఁగ నేకతరజ లనంగాఁ
బరపారు వళ్లు నాలుగు;-వరుసఁ దెనుంగునకు వాని వలయుం దెలియన్. ౩౦

క. తోరి యకారము మొదలా-కారము తుద యైన యచ్చుగమి పంద్రెండున్
వారక యొండొంటికి నిం-పారఁగ వళ్లయ్యె నాల్గు నైదును మూఁడున్. ౩౧

## అజ్వారమము

క. అ ఐ ఔ లత్వమునకు - నీ ఏలును బుద్వయంబు నిత్వమునకుఁ దా
మూ ఓ లుత్వమునకు వళు - లాయచ్చుల దొరసి యుండ వాల్లుల కెల్లన్. ౩౨

## అకారవళి నిరూపణము

తే. అవని ధర్మజాఁబోలు నిత్యార్యచర్య,
నాదిరాజాల దొరయు నిత్యేంద్రభూతి,
నరులఁ బ్రహరించు బాహాదండౌగ్ర్యమునను,
విభుకులాగ్రణి చాళుక్యవిశ్వవిభుఁడు. ౩౩

## ఇకారవళినిరూపణము

ఆ. ఇనజుఁ డీగి, భారతీశుండు చతురత,
నేకవీరుఁ డాజి బుజులయందు,
బూజరిపుఁడు సిరి, నహీనుండు భూవహ
నమున విశ్వమనుజనాథవిభుఁడు. ౩౪

## ఉకారవళి నిరూపణము

క. ధరణీవరాహలాంఛితుఁ - డురరీకృత సకలవిద్యుఁ డూరీకృత సం
గరజయుఁడు విశ్వభూవరుఁ - డురుకీర్తుల నెగడు నా బిడౌజో నిభుఁ డై. ౩౫

## ౨ వర్గవళినిరూపణము

క. తుది నున్న జ ఞ ణ న మ ములు - వదలిన యా క చ ట త పల వర్గాక్షరముల్
వొదిఁ డనవంగడములలో - నదికిన నవ్వళులు వర్గజాఖ్యము లరయన్. ౩౬

సీ. కమనీయ రాజశిఖామణి కరిరాజ గర్వమహీధ్రనిర్ఘాతమునకు
చతురయశస్సిత చ్ఛత్త్రి కాంచన జయదాశ్వధంజళి ఝంపునకును
టంకితరాయక తారిసాళువునకు డంభలాంఛన కోల ఢాలునకును
తత్త్వ పురాణకథా రసవేదికి దాన దయా ధర్మ ధామ మతికి

తే. పశుపతిప్రాప్త సామ్రాజ్యఫలున కబ్జ
బంధుబంధుర తేజోవిభాసునకును
విశ్వవిభునకు సరి లేరు విశ్వజగతి
ననిన నివి వర్గవళ్లకు నచ్చు గృతుల. ౩౭

## కాదివర్గమునకు గుణితస్వరవళినిరూపణము

క. కా కై కౌ లట కత్వము - కీ కేలు కృ కౄలు నట్లె, కిత్వము వఱలై,
కూ కోలు కుత్వమునకును - జేకొను దత్యాదిశాంతసిద్ధార్థతలిన్. ౩౮

## ౩ ఇతరేతరవర్గజవళినిరూపణము

క. ఇతరేతరవర్గజవళి - తతికిఁ జవర్గువును శ ష స దగు నొకగమి యై;
కృతులకు న హ య లు నేక-స్థితి నొకవంగళము; న ణ లుఁ జెలఁగు నొకటియై.

చ. చతురచళుక్యవిశ్వవిభుశాసన మెక్కిన రాజమౌళు ల
చ్చలిత మకుటోజ్జ్వలప్రగనుమక్తము లై విలసిల్లు నెంతు; నీ
జలనము నీలిమింతులకు సాఁగిన నేమి కొఱంత? సంతతో
ద్ఘటమదబుద్ధులుం గుశలసిద్ధులు పొందుట లెల్లఁ బోలవే. ౪౦

ఆ. చతురుపాయబాహుశక్తిమావళిఁ
శాఖ విడిచి చిత్రభానుసాక్షిఁ

శాఖ సర్వసిద్ధిపద మేది ధరణీశ
రాహమునకు నోడి రాచకగుపు. ౪౧

చ. అమమల కాస్పదంబు, వినయంబునకుం గుదు, రుల్బులేనిసౌ
ఖ్యమునకు నాలవాలము, మహాగుణపంక్తికి జన్మభూమి, దా
నమునకు నాదరం, బఖిరగాత్రియ కుగ్రనికేతనంబు, నా
నమరుఁ జకుక్యవిశ్వమనుజాధిపుచిత్త మమత్తవృత్తియై. ౪౨

ఏకతరవళినిరూపణము

క. మ ర వ ల ళ లేకతరవళు - లరయఁగఁ దమతమక కవులయనుమతి వరుసై
పరఁగుఁ, బదాంతము కారము-పొరిఁబొందినపు ఫ బు భు ము లు పొసఁగినచోటన్

ఆ. మధురవచనుఁ డార్యమాననీయాగ్రణి
రసికవరుఁడు రాజరాజనిభుఁడు
వరుస యొసఁగి సుకవివరులకు నిచ్చిన
లచ్చి విశ్వవిభునిలాగు మెచ్చు. ౪౪

ఆ. అజ్జలాని యీగి ఠావడి సభలోన
జేసి పోరిలోన జిచ్చఁ బొలసి
యెన్న మడుగుపుడమి యాంధ్ర నేల నుతింప
మనకు విశ్వనాథుఁ డొనరియుండ. ౪౫

5 ముకారవళినిరూపణము

తే. పుడమి విశ్వవిభునిభుజమునకుఁ దొడవు
ఫుల్లపద్మాలయ విలీర్ణమునకు బోటి
బుధులు విద్యావివేచనమునకు సాక్షి
భువనములు కీర్తికి నివాసములు దలంప. ౪౬

6 ప్రాదివళినిరూపణము

క. ప్ర ప రాప స మను సు ప్ర-త్యపి ని ర్దు రధి న్యు పా భ్యు దాఙ్వ్య త్యవ ప
ర్యుపసర్గ వింశతికి వళు-లు పరస్పరవర్గయుక్తి నుభయముఁ జెల్లున్. ౪౭
ప్ర - పరా - అప - సమ్ - అను - సు - ప్రతి - అపి-నిర్-దుర్-అధి-ని-ఉప-
అభి - ఉత్ - ఆఙ్-వి-అతి-అవ-పరి:—ఇవి యిరువదియు నుపసర్గలు; ఇందు
అప్యాఙ్ అను నిరూపణ మప్రసిద్ధము.

శా. ప్రారంభించు నశేషధర్మముల సంపాదించు సత్కీర్తులన్,
ప్రారబ్ధంబులు నిర్వహించు ఫలపర్యంతంబుగా నెప్పుడున్,
ప్రారబ్ధ ప్రతిలబ్ధ సంపదలచే రాగిల్లు నుల్లాసియై,
యీ రాజంచు నుతింతు రార్యు లిల విశ్వేశావనీవల్లభున్. ౪౮

తే. రిపుల విశసించు చోటఁ బరేతనాథుఁ
డుర్వి రక్షించుచోటఁ బరోక్ష భుజుఁడు
బహుధనావాప్తిచో ననపాయబుద్ధి
యంతరరులకు నీ తా జపాయకరుఁడు. ౪౯

చ. స్వయరహితంబు వైభవసమాగమ, మాహవధుర్యశౌర్య మ
వ్యయము, జయంబు విస్మయసమగ్రము, పాదవినమ్రశాత్రవా
న్వయపరిరక్షణం బభినవంబు, నయోచిత శాస్త్రివాచకా
న్వయనిపుణంబు చిత్త, మనయంబును విశ్వనరేంద్రభర్తకున్. ౫౦

తే. స్వర్ణగిరిచాపుఁ డర్చింప వలయు వేల్పు
స్వాంత మగుమంత్ర మాప్తప్రపంచాక్షరంబు,
తథ్యమగుధర్మ మెపుడు ప్రత్యక్షకృత్య,
మాత్మ విశ్వేశ్వరునకుఁ బ్రత్యహముఁ దగిలి. ౫౧

సీ. రసభావశీలి నిరంతరశ్రుతిశాలి యర్థావబోధ నిరర్గళుండు
రాజన్యజన్య దురంతవిక్రముఁడు దురవగాహవిద్యా విహారభూమి
దానార్హ్య సంపదర్థ్యావాస మాయుధాయుత వేదశబ్దదక్షయనవేగి
న్యాయతర్కాది నానాశాస్త్రికుతుకి వినయస్తపూతార్థ మహోదయుండు. ౫౨

ఆ. ప్రచుర ఫలిత చతురుపాయాభిరాముఁడు
పేంద్రభూపతనయుఁ డింద్రనిభుఁడు
భీమబలుఁడు జగదభీహిత శోభనా
భ్యర్థి విశ్వనాథుఁ డవనివిభుఁడు. ౫౩

క. చంచలత లేక కానో-దంచితుఁ డగువిశ్వనాథ ధరణీశ్వరుచే
మించినసుకవీశ్వరుల దృ-గంచలముల మలయు సిరు లనుగ్రప్రీతిన్. ౫౪

చ. వ్యపగతదోషుఁ డవ్యసనవర్గుఁ డుదంచిత మంత్రపంచక
వ్యపగతశత్రుమండలుఁ డయాన్వితుఁ డూర్జిత వైరిభూవర
ద్విపవరమత్తకేసరి యతీంద్రియఖేలనుఁ డార్యచర్యుఁ డ
ర్ష్యపచితశౌర్యశాలి సుగుణోన్నతి విశ్వనరేంద్రుఁ డెప్పుడున్. ౫౫

తే. విశ్వ విశ్వంభరాసమావేక్షణమున
నడరు నీహిత బహుఫలావాప్తు లెల్లఁ;
బ్రజలు లోనరింతు రఖిల పర్యంతనృపులు
నర్థి విశ్వేశ్వరునకుఁ బర్యాయగతుల. ౫౬

## 7 సబిందువర్గవళి నిరూపణము

తే. ట త ప వర్గాక్షరములకు డాపలించి
కొనర నూఁదిన బిందువు లుండెనేని

వరుస ణ న మ లు వళు లగు వాని కెల్ల
నవనిఁ గొందఱు సుకవులయనుమతమున. ౫౪

చ. కినుకఁ జళుక్యవిశ్వనృపకేసరి యూనినచోఁ గృపాణదం
డనమునఁ గల్గుఁ బో సురగణత్వము తత్పదవారిజాత వం
దనమునఁ గల్గుఁ బో మనుజనాథత తద్భటదర్పనావలం
బనమునఁ గల్గుఁ బో గహనమధ్య నివాసము వైరకోటికిన్. ౫౭

## ౮ ద్వ్యక్షర త్ర్యక్షర ప్లుతాక్షర వళి నిరూపణము

ఆ. మొదలిప్రాఁత రెండు మూడు నక్షరములఁ
గూడియేని యదియ కూర్చు వళుల,
నంత్యవర్ణము నిడుపయి తక్క భేద ద?
యార్థ మయిన నచ్చు హల్లు వళులు? ౫౯

క. ప్రియకరుఁడు సర్వలోకా-శ్రయ బిరు దోద్రగుఁ డుగ్రజనవర సేనా
జయలక్ష్మీ సుఖకర సం-శ్రయుఁ డీచాళుక్యవిశ్వరాజేంద్రుఁ డిలన్. ౬౦

తే. ధర్మములు నిత్య సత్య కృద్వ్యాప్తు లెపుడు,
వర్జ్యములు చిత్తమున కసద్వ్యసనచయము,
లర్థములు వర్ణ విభ్రమ ద్వ్యక్తివిధులు
పతికి ననుటయు విశ్వభూపతికి నమరు. ౬౧

క. త్రాసమతి విమతు లడుగులు-డాసిన నీసోమవంశ్యుఁడా రక్షింపం
డీ పుడిగి యుచితగతి వి-న్యాసంబునఁ గొలువవలువదా విశ్వేశున్. ౬౨

మ. కమలోత్పత్తి నిమిత్తముం గువలయాకాంత్యాతపజ్జీవనీ
యము నైనం తన నభ్రవిభ్రమము నేలా సర్వలోకాశ్రయ
క్షమతం బేర్చు చళుక్య విశ్వవిభు శశ్వద్దాన ధారాజలౌ
ఘములో సాటికిఁ బాటిసేసెదవు శ్రీకాంక్షఁ జక్రిఁ దర్కింపుమా. ౬౩

## ౯ ఆదేశవళి నిరూపణము

క. ద్వీపమునకు నాకమునకు-నాపై శాస్త్రోక్తి నచ్చు లాదేశ సమా
సాపత్తి గలుగుటయు వళు-లాపాదింపుదురు కొంద ఱచ్చును హల్లున్. ౬౪

ఉ. ద్వీపులఁ గ్రుంచువిశ్వజగతీపతి యుత్తమశక్తి జాంబవ
ద్వీపమునందు గోవులకు నిమ్ముగఁ జేయుటయున్ బ్రసన్నుఁడై
గోపతిధేను వవ్విభునకుం దినవైభవ మిచ్చెఁ గాక యే
భూపతు లీవదాన్యగుణబుద్ధిఁ బ్రసిద్ధి వహించి రుర్వరన్. ౬౫

క. నీకరవాలముపాలై-నాకంబున కరిగి రాజనారాయణ యా
భూకాంతు లెట్టిచన వో-నాక విటోత్తములఁ దూల నడుతురు లీలన్. ౬౬

క. విను మన్యోన్యపదంబున-గొనరింతురు కవులు గొంద ఱో నో లాయుం
వనుబోనియచ్చు కలుగుటఁ-జొనుపుదు రాయచ్చు వళియు సుకవులు కృతులన్.

ఉ. ధన్యుఁడు విశ్వభూవిభుఁడు ధారుణి యేలఁగ భూజనంబు ల
న్యోన్యహితత్వ సంపదల నొందిరి, దంపతు లింపు నింప న
న్యోన్యసుఖానుకూలతల నోమిరి విప్రులు వేల్పుఁబిండు న
న్యోన్య సుపుష్టి తుష్టి కుశ లాకులఁ జెందిరి నాఁడునాఁటికిన్. ౬౮

## దేశీయవళి నిరూపణము

చ. కటకరి కల్లడంబు కడుఁ గట్టిఁడి దెమ్మెర లోలమాస గ్ర
ద్దృల యొసలారు ఉల్లటుకు లాడెడి పీఱిఁడి రజ్జులాఁడు గ్రి
క్కిఱియుట నాఁ దెనుంగునకు నీయుభయంబు వళిప్రకారమై
మిఱియఁ గవిప్రయోగమున మేల మెఱింగి రచింప నేర్చినన్. ౬౯

క. చెన్నక్కుఁ జెన్నక పూ-చన్నన పూచన యనంగ నచ్చుట వళి గ్రు
చెన్నగు నకార మార్యుల-మన్నన హల్లని గలుగు మఱియొక్కకచోన్. ౭౦

క. కడలాలుం జవరాలును-జడుఁ డొక్కం డొకఁ డనంగఁ జనునుడువుల న
చ్చిడుటయె తగు వడి హల్లును-వడి సేయుదు రంద్రు కవులు వలసినచోటన్.

క. ఏకైకము సోదర నా-కాకులు ననుబద్ధములకు నాగి నేత్వోత్వా
నీకము వళు లగుఁ గొంటు-గై కొందురు వృద్ధివళులు కవు లాడఁబడికన్. ౭౨

## షడ్విధప్రాసములు

క. భాసురము లగుచు సుకర-ప్రా సానుప్రాస దుష్కరప్రా సాంత్య
ప్రాస ద్వంద్వ త్రితయ-ప్రాసము లన షడ్విధములు పరఁగుం గృతులన్. ౭౩

## సుకరప్రాసము

క. సుకుమారము శ్రుతిసుఖదము-నకలంకము నైనవర్గ మాద్యక్షర స్పృ
ష్టికి రెండవప్రాయి గుమా-సుకరప్రాసం బనంగ సులభము కృతులన్. ౭౪

క. అరవిందపీఠుఁడు దీధితి-నరవిందోదరుఁడు విద్విడపహరణముచో
నరవిందభవుఁడు చతురత-ఘర ధరణివరాహ విశ్వధరణిపుఁ డెపుడున్. ౭౫

## అనుప్రాసము

క. ఇదు నెడఁ బ్రాసాక్షరములు-బడీ తప్పక పాదపదవిభాగములఁ గడున్
బెడఁగైన ననుప్రాసం-బడరుం గబ్బముల నెల్ల నమరినతోడై. ౭౬

క. రుంద్రములు సాంద్రములు ని-స్తంద్రములును గుణము లెపుడు ధర సత్యహరి
శ్చంద్రునకుఁ జంద్రవంశ్యన-రేంద్రోర్జితమహిమునకు నుపేంద్రసుతునకున్. ౭౭

## దుష్కరప్రాసము

క. పరువడిఁ బాదాదుల ను-చ్చరణాసహ్యాక్షరముల సమకూర్చిన దు
ష్కర మనియెడుప్రాసం బగు-సరసాలంకార మనుచుఁ జను సత్కృతులన్.

క. నుర్గయి విశ్వేశ్వరుఁగో-ర్గళహతిఁ జన్నరిపుల న వినుతింపన్
స్వర్గవధూకుచకుంభ వి-నిర్గళదంబువులచేత నిర్మలు లగుటన్. ౭౯

## అంత్యప్రాసము

క. మొదలిచరణంబుకడ శుభ-పద మయ్యెడిప్రాయి యన్నిపాదంబులకున్
దదనుండి మండనం బ-నది యంత్యప్రాస మనఁగ నచురుం గృతులన్. ౮౦

క. భూజనహితనయశీలున్-బూజింతురు నృపులు విశ్వభూమీపాలున్
రాజితకీర్తివిశాలున్-రాజేంద్ర చ్ఛత్రచామరశ్రీలోలున్. ౮౧

## ద్వంద్వత్రిప్రాసము

క. క్రమమునఁ బాదాదులయం-దమలము లై రెండు మూఁడు నక్షరములు చె
న్నమరిన ద్వంద్వత్రిప్రా-సము లనఁగాఁ బరఁగు వానిఁ జనుఁ దెలియంగన్. ౮౨

క. దానంబు కవికుశలని-దానంబు విరోధరాజ దత్తధనచయా
దానంబు గవులసామ్యప-దానం బిత్తెఱఁగు విశ్వధరణీపతికిన్. ౮౩

క. శీలనమును దన్నవపరి-లాలనము నశేషశాస్త్ర లాలితవిద్యా
ఖేలనము ధర్మధరణీ-పాలనమును విశ్వధరణిపాలున కొనరున్.

## లళడ బుక్రాంతప్రాసములు.

క. వలసినచో లళములు డల-ములు మఱి బుక్రాంతివర్ణములు ప్రాసము లై
యలవడు సత్కవికృతులన్-నిలుపందగు వానిఁ దెలిసి నియతప్రీతిన్. ౯౫

క. తాళము దాలము నాఁజనుఁ-జోళుఁడు చోడుండు నాఁగ సొంపగు నుగ్ర
వ్యాళ వ్యాడ వ్యాలము-లోలి న సమరూఢిఁ బ్రాసయుక్తిం జెల్లున్. ౮౬

తే. భీకరాకారుఁ డయ్యు నంగీకృతుండు
మేరుగ్రక్రోధుఁ డయ్యు ననాదృతుండు
పావనాత్మకుఁ డయ్యు బలావృతుండు
నాఁగఁ బ్రాసంబులకు సమానంబు లెపుడు. ౮౭

## వృత్తములు

క. ఇది ప్రాసలక్షణం బిఁక-విదితంబుగఁ బింగళాహివిరచిత మగుచున్
బొదలెడు ఛందోగణ సం. పద యగు వృత్తప్రపంచపద మెఱుఁగఁ దగున్. ౮౮

క. ఆదట నక్షర గణ నో- త్పాదిత గణసంప్రవృత్తితంత్రముచేఁ గా
కాదరుఁడు గరుడునిం బ్ర- చ్ఛాదించుట ఛంద మనఁగ జగతిం బరఁగున్. ౮౯
క. ఇది లౌకిక వైదిక వా- క్పద మై షడ్వింశతిప్రపంచాత్మక మై
పొదలుం. దెలియఁగవలయును- ముదమున నభిధానరూపముల ఛందంబుల్. ౯౦
వ. ఉక్త, అత్యుక్త, మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్పు బృహతి, పంక్తి. త్రిష్టుప్పు, జగతి, అతిజగతి, శక్వరి అతిశక్వరి, అష్టి. అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అతికృతి, ఉత్కృతి, అనం బ్రవర్తిల్లు; నందు నుక్తాదిచ్ఛందంబు లొక్కయక్షరంబునుండి యొండొంటికి నొక్కొక్క యక్షరంబుగా షడ్వింశాక్షరపర్యంతంబుఁ బెరుఁగు. అందు నుక్తాచ్ఛందంబునఁ బ్రతిపాదంబున నేకాక్షరంబై శ్రీ యను వృత్తంబయ్యె:

శ్రీ-శ్రీ-శీ-యున్.

అత్యుక్తాచ్ఛందః పాదంబు ద్వ్యక్షరం బందు స్త్రీ యను వృత్తం బయ్యె:

స్త్రీరూ-పాయు -గారూ-పారున్.

మధ్యాచ్ఛందంబు త్ర్యక్షరంబై నారీవృత్తంబునకు జనకం బయ్యె:

నారీవృ-త్తారంభంబౌను మ్యా-కారంబై.

ప్రతిష్ఠాచ్ఛందఃపాదంబు చతురక్షరం బై

## కన్యావృత్తము

పొత్తై మాగా-వృత్తిం గన్యా-వృత్తం బయ్యెన్-జిత్తం బారన్

## సుకాంతివృత్తము (జగ.)

జగంబులదం-గున్ సుకాం-తి గల్పిత-ప్రగల్భతన్.

సుప్రతిష్ఠాచ్ఛందఃపాదంబు పంచాక్షరం బై

## సుందరీవృత్తము (భగగ.)

సుందరి యొప్పం-జెంది భగా నిం-పొంద నియుక్తిన్-గందుకలీలన్.

## ప్రగుణావృత్తము (సగగ.)

సగణాసక్తిం-గగసంయుక్తిన్-బ్రగుణాఖ్యం బై-తగు నింపారన్.

## అంబుజవృత్తము (భవ.)

ఇంబగు భకా-రంబును వకా-రంబును జుమీ-యంబుజ మగున్.

## విచ్ఛందోధికారము

క. ఇం దుండియుఁ గరణీయ- చ్ఛందోవృత్తముల నర్థ సంజ్ఞితములుగా
నొందింతు గ్రంథవిస్తృతి-క్రందునకుం గాక యర్థగౌరవ మొప్పన్. ౯౩

గాయత్రీచ్ఛందఃపాదంబు షడక్షరంబై

### విచిత్రవృత్తము (యయ.)

విచిత్రంబునందున్ - రుచించున్ యయాంబుల్.

### తనుమధ్యావృత్తము (తయ.)

ఒప్పున్ తయ యుక్తం- బెప్పం దనుమధ్యన్.

### సురలత (సయ)

సురలతఁ జెప్పున్ - సొరది నయాంబుల్.

ఉష్ణిక్ ఛందఃపాదంబు సప్తాక్షరంబై

### విభూతివృత్తము (రజగ.)

స్వస్థ సద్విభూతి దా-రస్థ జస్థగంబునన్.

### మదనవిలసితము (ననగ.)

మదనవిలసిత-ప్రదములు ననగల్.

### కుమారలలిత (జసగ.)

కుమార లలితకున్-సమగ్రజనగముల్.

అనుష్టుప్ఛందఃపాదం బష్టాక్షరం బై

### విద్యున్మాల యనువృత్తము (మమగగ.)

శ్రీలీలన్ రాజిల్లున్ విద్యు-న్మాలాఖ్యం బై మాగాసక్తిన్.

### చిత్రపదము (భభగగ.)

చిత్రపదం బన భాగా-చిత్రయతిప్రతిపత్తిన్.

### ప్రమాణి (జరవ.)

జకారమున్ రకారమున్-వకారమున్ బ్రమాణికిన్.

### సమాని (రజవ.)

ఈసమానికిన్ రజవ-వ్యాస మొప్పగుం గృతులన్.

### సింహరేఖ (రజగగ.)

ఈరజాగ్రగా నియుక్తిన్-గోరి సింహరేఖ యొప్పున్.

బృహతీచ్ఛందఃపాదంబు నవాక్షరం బై

భుజగశిశుసృతమనువృత్తము (ననయ.)

భుజగశిశురుత మయ్యెన్ - బుజా ననయ ములచేతన్.

హలముఖి (రనస.)

కామితక్రియ హలముఖీ - నామ మొప్పు రననలచేన్.

భద్రకము (రనర.)

భద్రకంబు రనరంబులన్ - స్రద విశ్వనృపమన్మథా.

ఉత్సుకము (భభర.)

ఉత్సుక మా భభరంబులన్ - మత్సరిమాన విమర్దనా.

— —

క. ఇట నిం దీవల విశ్రమ - ఘటనలు కల్పింప వలయుఁ గబ్బంబుల నె
చ్చట నిలుపంగాఁ దగున - చ్చటఁ దగఁ బరికించి నిలుప సంద్రి ప్రౌఢిన్. ౯౪

పంక్తిచ్ఛందఃపాదంబు దశాక్షరం బై

రుక్మవతి యనువృత్తము (భమసగ, 6.)

రుక్మవతిం జేరున్ భమసంబుల్ - తిగ్మరుచిన్యగ్దీప్త గయుక్తిన్.

మయూరసారి (రజరగ, 7.)

పర్వనీరజంబుపై రగంబుల్ - సర్వదా మయూరసారిఁ జెప్పన్.

మత్త (మభసగ, 7.)

శైలక్రాంతిన్ మభసగలోలిం - గ్రాలన్ మత్తాఖ్యము గనుపట్టున్.

శుద్ధవిరాట్ (మసజగ, 6.)

సత్తం బైమసజద్గ ప్రథా - రక్తిన్ శుద్ధవిరాట నాఁజనున్.

పణవము (మనయగ, 6.)

అందం బైమనయగముల్ సొంపిం - పం దప్పింపన్ పణవం బయ్యెన్.

త్రిష్టుప్ఛందఃపాదం బేకాదశాక్షరం బై

శాలినీవృత్తము (మతతగగ, 6.)

రాకాధీశాకార రాజన్యతా గా - నీకప్రాప్తిన్ శాలినీవృత్త మయ్యెన్.

ఇంద్రవజ్రము (తతజగగ, ౮.)

ఈతాజగానిర్మితి నింద్రవజ్రా - నీతాఖ్య వర్తించు వినిర్మలోక్తిన్.

ఉపేంద్రవజ్రము (జతజగగ, ర.)

ఉపేంద్రవజ్రాహ్వయ మొప్పనింపై యుపేంద్రపుత్త్రా జతజోక్తిగాలన్.

ఉపజాతి

ఈయింద్రవజ్రాఖ్య ముపేంద్రవజ్ర-శ్రయంబు గాఁగా నుపజాతి యయ్యెన్.

తోదకముఁ (భభభగగ, 7.)

కామితభత్రయగాయుత మైవి-శ్రామపుఁదోదకసంజ్ఞతఁ జెందున్.

రథోద్ధతము (రనరలగ, 7.)

రక్తిఁ జేర్చి రనరంబు పైలగం-బుక్తమైనను రథోద్ధతం బగున్.

చంద్రిక (ననరవ, 7.)

సలలితముఁ జంద్రికాహ్వయం-బలరు ననర వాంకమై కృతిన్.

స్వాగతము (రనభగగ, 7)

స్వాగతంబు రనభంబు గగాప్తిన్-సాగువిశ్వనృపచంద్రకులాఢ్యా.

శ్యేని (రవరవ, 7.)

శ్యేనికై రవంబు చెప్పి పైరవం బూనఁ జేయు మెల్ల నొప్ప నెప్పుడున్.

వాతోర్మి (మభతలగ, 7.)

తద్వాతోర్మిన్ మభతంబుల్ లగయుక్-సద్విశ్రామస్థితి సంధిల్లుఁ దగన్.

జగతీఛందఃపాదంబు ద్వాదశాక్షరంబు

భుజంగప్రయాతవృత్తము (యయయయ, 8.)

భుజంగప్రయాతంబు పొందారు నందం
బజస్రంబుగా నయ్యయాయంబు లొందన్.

తోటకము (ససస స, 9.)

సగసం బయి సాససంభృతమై-విరచించినఁ దోటకవృత్తముగున్.

వంశస్థము (జతజర, 8)

జతంబులం జెంది నజంబు రేఫయుక్-నుతింప వంశస్థ మనుక్రమక్రియన్.

ఇంద్రవంశము (తతజర, 8.)

ఈతాజరాకల్పన నింద్రవంశకా-ఖ్యాతాఖ్య మయ్యెన్ బరగండభైరవా.

తోదకము (నజజయ, 8)

సలలితమైననజాయగణంబుల్-విలసితతోదకవృత్తముఁ జెప్పున్.

### ద్రుతవిలంబితము(నభభర,7.)

ద్రుతవిలంబితరూపితవృత్తిచేఁ - బ్రతతమయ్యె నభారగణంబులన్.

### స్రగ్విణి(రరరర,7.)

స్ఫారితంబైయపారారరశ్రేణితో - సారమై స్రగ్విణీచారువృత్తం బగున్.

### జలధరమాల (మభసమ,9.

మాద్యత్ప్రీతిం జలధరమాలాభిఖ్యం - బ్రఖ్యాతించున్ మభసమభద్రవ్యాప్తిన్.

### ప్రమితాక్షరము(సజసస,9.)

అమలక్రియాప్తిఁ బ్రమితాక్షరమై - యమరున్ సయుక్తసససయంత్రితమై.

### విశ్వదేవి(మమయయ,8)

మాయావర్గం బొప్పం గ్రమన్యాసవృత్తిన్
జేయున్ భూభృద్విశ్రాంతిచే విశ్వదేవిన్

క. అకలంకయతిచ్ఛందో-ధికార మిది కృతినెఱిఁగి తెలియఁగవలయున్.
బ్రకటింతు విపులవృత్త- ప్రకరము ప్రస్తారసరణిరచనీయంబున్.

శా. ఛందశ్శాస్త్రవివక్ష సత్కృతిపరిష్కార క్రియాదక్ష స్వ
చ్ఛందక్రీడమరుత్ప్రతాప కరుణాసంపన్న సల్లాప ని
ష్యందానందితసాధులోక భువనప్రఖ్యాతసుశ్లోక స
ద్వందారుక్షితిపాల పాలనకళాధౌరేయ ధైర్యోజ్జ్వలా.
రాజేంద్రచరిత్రద్వయ-రాజద్విజ యేందిరాభిరామైశ్వర్యా
రాజాన్వవాయవర్యా-రాజీవ కంబుసూర్య రసికాచార్యా.

### మాలిని

రథసరణి విశంకా రాజనారాయణాంకా
సథయరిపుశరణ్యా శశ్వదాసన్నపుణ్యా
సభికహితపదార్థా సర్వలోకాత్రయార్థా
విధృతవిబుధనాథా వీరలక్ష్మీసనాథా.

### గద్యము

ఇతి శ్రీమదుమారమణ చరణారవిందవందన గోవిందామాత్యనందన
విబుధజనవిధేయ చిన్నకోటపెద్దయనామధేయ విరచితంబైన
కావ్యాలంకారచూడామణి యను నలంకారశాస్త్రంబు
నందు ఛందోగణ వళి ప్రాస ఛందోధి
కార లక్షణ సముద్దేశం బన్నది
సప్తమోల్లాసము.

---

Kesari Printing works, Madras.

## అష్టమోల్లాసము

---

### ఛందస్సు

భ జ స య ర త మ న గ ల

U|| |U| ||U |UU UIU UU| UUU ||| - U - |

గలము—లగము

U| |U

(గలమునకు హగణమనియు—లగమునకు వగణమనియు
నామాంతరములు.)

క. శ్రీవిశ్వేశ్వర విశ్వ-క్ష్మావల్లభివంద్యపాదకమల కమలభూ
దేవీకమలసితయశా-కోవిదనుత రాయగండ గోపాలాంకా। ౧

౧౩. అతిజగతీచ్ఛందఃపాదంబు త్రయోదశాక్షరంబు—

అందు ప్రహర్షిణీవృత్తము—(మ-న-జ-ర-గ-౮ యతి.)

ప్రావీణ్యప్రదయొనరం ప్రహర్షిణిం బా-గావించున్ మనజరగ ప్రజంబుధాత్రిన్

రుచిరవృత్తము—(మ-త-య-స-గ ౮ యతి.)

క్రమంబుతో జభసజగమ్ము లిమ్ముగా-నమర్పఁగా రుచిరసమాహ్వయం బగున్.

మత్తమయూరము—(స-స-ర-స-లగ-౭ యతి.)

సంబోధార్థంబై విలసన్మత్త మయూరా
ఖ్యం బింపొప్పారున్ మతయాత్రాగ్యత్త సగా ప్తిన్.

మంజుభాషిణి—(స-జ-స-జ-గ-౯ యతి.)

సలయంబుగాఁగ సజసంబుతో జగం-బులు మంజుభాషిణికిఁ బొందు సంద్రమై.

జలదము—(భ-ర-స-భ-గురు-౧౦ యతి.)

ఈభరసంబుల న్గురు లెక్కుచు నిం-పై భజియించె నని జలదాహ్వయమా.

ప్రభాతము—(న-జ-జ-ర-గ-౮ యతి.)

మొదల నజారగము ల్ప్రభాతసంజ్ఞం-బొదవఁగఁ జేయు నపూర్వకల్పనోక్తిన్,

౧౪. శక్వరీచ్ఛందఃపాదంబు చతుర్దశాక్షరంబు

అందు వసంతతిలకవృత్తము—(త-భ-జ-జ-గ-గ-౮ యతి.)

స్థాపించినం దభజజంబు నర్యుక విశ్వా-త్మ్యాప్తి వసంతతిలకంబగు గానియుక్తిన్.

అపరాజితవృత్తము—(న-న-ర-స-ల-గ-౯ యతి.)

ననరసలగముల్ చనర్చిన సత్కృతిం-దనరఁగ నపరాజితంబు కవిస్తుతిన్.

వనమయూరము—(భ-జ-స-న-గగ-౯ యతి.)

నందయతితో భజసనవ్రజగగం బిం-పొందఁ జదువ న్వనమయూర మగుధాత్రిన్.

సుందరము—(భ-భ-ర-స-లగ-౯ యతి.)

భారసవంబుల నొప్పుఁ బద్మజవిక్రమం-బారఁగ సుందరవృత్తమై బుధవర్ణ్యమై.

ప్రహరణకలితము—(న-న-భ-న-లగ-౮ యతి.)

ప్రహరణకలితంబయి ననభనవల్-బహువిధయతులం బ్రథఁ జెలు వడరున్.

భూనుతము—(ర-న-న-భ-గగ-౧౦ యతి.)

అందమై రననభలతి నంది గగంబుల్-పొందఁగాఁ బదగతిఁగని భూనుతమయ్యెన్.

౧౫. అతిశక్వరీచ్ఛందఃపాదంబు పంచదశాక్షరంబు

అందు మణిగణనికరవృత్తము—(న-న-న-న-స-౮ యతి.)

సరసతి ననన నసగణము లెసఁగం-గరియతిఁ గని మణిగణనికర మగున్.

మాలినీవృత్తము—(న-న-మ-య-య-౮ యతి.)

కరటివిరతి నామక్రాంతయాయుక్తితోడన్

మరగి తియగఁ జెప్ప న్మాలినీవృత్తమయ్యెన్

సుకేసరము—(న-జ-భ-జ-ర-౧౦ యతి.)

నజభజరేఫలం గదియ వచ్చి దిగ్యతిన్-సుజనమతి న్సుకేసరము శోభితంబగున్

మణిభూషణము—(ర-న-భ-భ-ర-౧౦ యతి.)

విశ్వభూప మణిభూషణవృత్త మనంజనున్-శక్వరుక్తరనభారదిశాయతిఁగూడినన్.

మనోజ్ఞము—(న-జ-జ-భ-ర ౯ యతి.)

వరుస మనోజ్ఞమనంగ నచ్చు నజాభర-స్థిరగతిఁ బంకజభూయతిం బ్రతిపన్నమై.

౧౬. అష్టిచ్ఛందఃపాదంబు షోడశాక్షరంబు

అందుఁ బద్మకవృత్తము—(న-భ-జ-జ-జ-గ-౧౧ యతి.)

నభజజద్వయగకార సనాతన విశ్రుతిం-బ్రథమమై పరఁగు సత్కృతిఁ బద్మకవృత్తమై

ప్రియకాంతావృత్తము—(న-య-న-య-స-గ-౧౦ యతి.)

నయనయయుక్తిం దగసగణంబుల్ గురువొందుల్
నియతము దిగ్విశ్రమమును నించుం బ్రియకాంతల్.

చన్ద్రశ్రీ—(య-మ-న-న-ర-గ-౧౧ యతి.)

అగుంజంద్రశ్రీ దాహారవిరతుణాయత్తమైనం
బ్రగాఢంబై యొప్పున్ యమనసర బద్ధాగ్రగాత్రీ.

మేదిని—(న-జ-భ-జ-ర-గ-౧౦ యతి.)

నజభజరేఫగంబునఁ దనర్చు మేదినీవృత్తజనికి మూలమ్ము దిగుదితస్థ విశ్రమంబై.

౧౭. అత్యష్టిచ్ఛందఃపాదంబు సప్తదశాక్షరంబు

అందు శిఖరిణీవృత్తము—(య-మ-న-స-భ-లగ-౧౨ యతి.)

వివస్వద్విశ్రాంతిన్యమనసభవాభిన్యస్తగతిం
గవిశ్రేణీరక్తిన్ శిఖరిణియనంగాఁ దగుఁ బ్రశస్.

పృథివీవృత్తము—(జ-స-జ-స-య-వ-౧౨ యతి.)

జసంబులు జసంబులున్ యవనివృత్తరూపంబులై
సాసంగఁ బృథివీసమాఖ్యయగుఁ బూర్ణవిశ్రాంతితోన్.

హారిణి—(న-స-మ-ర-స-వ-౧౧ యతి.)

హారిణి యనువృత్తం బయ్యెన్ శంకరాత్త యతిప్రథన్
పరిసమరేఫాక్రాంతోపేత సస్థలగంబులన్.

మందాక్రాంతము—(మ-భ-న-త-త-గగ-౧౧ యతి.)

సాంద్రంబై మభనతతగా భూషితంబై తనర్చున్
మందాక్రాంతాహ్వయము శివామూర్తివిశ్రాంతిచేతన్.

త్వరితపదగతి—(న-న-న-న-న-గగ-౧౧ యతి.)

త్వరితపదగతి యనఁగఁ దగుననన నాగా విరచితయు దశమయతి విలసితయు నైనన్.

నర్కుటము—(న-జ-భ-జ-జ-వ-౧౦ యతి.)

నజభజములజవంబులఁ దనర్చిన నర్కుటక ప్రజనన మొప్పు దిగ్యతిని రాజకులాబ్ధిశశీ.

౧౮. ధృతిచ్ఛందఃపాదం బష్టాదశాక్షరంబు [యతి.)

అందుఁ గుసుమితలతావేల్లితావృత్తము — (మ-త-న-య-య-య-౧౧

స్వశ్రేయస్సిద్ధిన్ మతనయయయవ్యాప్తిచేఁ జర్మవాసో
విశ్రామం బొప్పం గుసుమితలతావేల్లితావృత్తమయ్యెన్.

మత్తకోకిలవృత్తము—(ర-స-జ-జ-భ-ర-౧౧ యతి.)

మత్తకోకిలవృత్త మై దశమప్రవర్తిత విశ్రమా
యత్తమై రసజాభరేఫల నచ్చమై కడు నొప్పగున్.

౧౯. అతిధృతిచ్ఛందఃపాదం బేకోనవింశత్యక్షరంబు

అందు శార్దూలవిక్రీడితవృత్తము—(మ-స-జ-స-త-త-గ-౧౩ యతి.)

సంబంధించి దినేశవిశ్రమముతో శార్దూలవిక్రీడితా
ఖ్యంబయ్యెన్ మసజంబులున్ సతతగాయత్తంబులై యుండినన్

మేఘవిస్ఫూర్జితవృత్తము—(య-మ-న-స-ర-ర-గ-౧౩ యతి.)

మృదున్యస్తార్థంబై దినకరయతి న్మేఘవిస్ఫూర్జితాఖ్యం
బుదాత్తశ్రీఁ జెల్వున్ యమనసర రప్రోత గప్రాప్తిచేతన్.

చంద్రకళ—(ర-స-స-త-జ-జ-గ-౧౧ యతి.)

వ్యక్తరీతి రసాతజజాగ్రాయత్త గకారనిరూఢిచే
సక్త దిగ్విరమంబున నొప్పుం జంద్రకళాహ్వయమై ధరన్.

తరలము (ధ్రువకోకిల)—(న-భ-ర-స-జ-జ-గ-౧౨ యతి.)

నభరసంబులు జాగవర్గము నచ్చి యీశ్వరవిశ్రమ
ప్రభవమై తరలం బనంజను రాజనందనశిఖామణీ!

భూతిలకము—(భ-భ-ర-స-జ-జ-గ-౧౨ యతి.)

భూతిలకం బను భారసంబులఁ గొంది జాగము లుండినన్
భూతపతిస్ఫుట విశ్రమంబున భూప విశ్వనరేశ్వరా!

౨౦. కృతిచ్ఛందఃపాదంబు వింశత్యక్షరంబు

అందు మత్తేభవిక్రీడితవృత్తము—(స-భ-ర-న-మ-య-వ-౧౪ యతి.)

మనమారం బనుసూర్య విశ్రమముగా మత్తేభవిక్రీడితా
హ్వానమయ్యెన్ సభరంబు లన్ మయవన్యాసంబులం జెప్పినన్.

ఉత్పలమాలావృత్తము—(భ-ర-న-భ-భ-ర-లగ-౧౦ యతి.)

పద్మజయుక్తరీతి భరనభారలగంబులఁ జెంది సన్మనః
పద్మవికాసహేతువను పద్యము నుత్పలమాలయండ్రిలన్.

అంబురుహము—(భ-భ-భ-భ-ర-స-వ-౧౩ యతి.)

భావధరంబులపై సభలొందుచు భానువిశ్రమయుక్తమై
యీభువి నంబురుహంబనఁగాఁ జను నిందువంశనృపాగ్రణీ.

ఖచరప్లుతము—(న-భ-భ-మ-స-న-న-౧౧ యతి.)

నభభముల్ మసనంబు లగా ప్తి న్నాగవిభూషణయుక్తిగన్
శుభదమై ఖచరప్లుత మొప్పు నోసుకులార్ణవచంద్రమా.

౨౧. ప్రకృతిచ్ఛందఃపాదం బేకవింశత్యక్షరంబు

అందు స్రగ్ధరావృత్తము—(మ-ర-భ-న-య-య-య-౭-౭ యతులు.)

మ్రభ్నాభ్యామ్భవస్వతిస్త్రీసురభనయయయామాత్రమై యాదిమాద్య
మ్రభ్నాభ్యోస్త్రీల విశ్వేశ్వరనృపతివరా స్రగ్ధరావృత్త మయ్యెన్.

చంపకమాలావృత్తము—(న-జ-భ-జ-జ-జ-ర-౧౧ యతి.)

నజభజజారవర్గము దనర్చి దిశాయతి నర్థయుక్తమై
బుధగతిఁ జెంది సత్కవుల కింపుగఁ జంపకమాల యౌ నృపా.

లాటీవిటము—(స-స-న-స-మ-త-య-౧౨ యతి.)

ససనా మతయంబులు గ్రామయతి న్నాకంబై లాటీవిటవృత్తం
బాసకం బెసఁగన్ విరచించిన విశ్వేశా, చాళుక్యక్షితిపాలా!

వనమంజరి—(న-జ-జ-జ-జ-భ-ర-౧౩ యతి.)

తనర నజాజజభాగ్గకారయుత త్రయోదశయుక్తిగన్
వినుతి మాగు వనమంజరినాఁ దగువృత్త మింపెసలారఁగన్.

మణిమాల—(స-జ-స-జ-స-జ-స-౧౦ యతి.)

సరసన్ సజత్రితయము న్సాస్త్రి సక్త సగణంబుతోడ నొనరం
బరఁగున్ దిగంతవిరతిం బ్రధానపదమై సరసమదనా!

౨౨. ఆకృతిచ్ఛందఃపాదంబు ద్వావింశత్యక్షరంబు

అందు మహాస్రగ్ధరావృత్తము—(స-త-త-న-స-ర-ర-గ-౯-౭ యతులు.)

సకలత్రివిశ్వ భూపా సతతనసరరా సక్తమై యాగ్రగాప్తిం
బ్రకటింపన్ వంతిసైల ప్రమరయతి మహాస్రగ్ధరావృత్త మయ్యెన్.

భద్రిణీవృత్తము—(భ-ర-న-ర-న-ర-న-గ-౧౧ యతి.)

భారగనత్రయంబు సరు యుక్తమై గిరిశవిశ్రమప్రకటమై
మేదిని నొప్పు భద్రిణికి నందు మేరునగధీర విశ్వనృపతీ.

మానిని—(భ-భ-భ-భ-భ-భ-భ-గ-౭-౭-౭ యతులు.)

కామిని సప్తభకారము తాల గకారముతో పరికల్పితమై
నేమముగా వడి నిల్పినఁ జక్కగు నిల్చిన మానిని నిక్కముగన్.

తురగవల్గిత—(న-న-న-న-స-జ-జ-గ-౧౪ యతి.)

మెఱయు ననననసజజగములను మేలుగా రచియించినన్
వెలయు మనుయతి వలనను దురగవల్గితంబను వృత్తమై.

౨౩. వికృతిచ్ఛందఃపాదంబు త్రయోవింశత్యక్షరంబు

అందశ్వలలితవృత్తము—(న-జ-భ-జ-భ-జ-భ-లగ-౧౨ యతి.)

నజభజము ల్భజంబులకు నచ్చి భస్థలగయుక్తమై రవియతిం
బ్రజనితమైన నశ్వలలితంబు రాజకులదీప ధీజనను తా.

కవిరాజవిరాజితవృత్తము—(న-జ-జ-జ-జ-జ-వ-౮-౭-౭ యతులు.)

కలయఁగ నేకనకారము సుక్త జకారవకారనికాయనిర
ర్గళగతిచే నలరం గవిరాజవిరాజితవృత్తము రమ్యమగున్.

౨౪. సంకృతిచ్ఛందఃపాదంబు చతుర్వింశత్యక్షరంబు

అందు సరసిజవృత్తము—(మ-త-య-న-న-న-న-స-౧౦-౯ యతులు.)

చాళుక్యక్ష్మాపాలవరేణ్యా శ్రియమతయనననిననయుతసల్
చాలై యింపై ప్రాలఁదనర్పన్ సరసిజమగు నిలఁజవులకుఁ సుమతీ.

క్రౌంచపదవృత్తము—(భ-మ-స-భ-న-న-న-య-౧౦-౮ యతి.)

ప్రాంచితతేజఃకుంచితవైరిభమసభననయపరిచితరీతిన్
అంచితమయ్యెం గ్రౌంచపదాఖ్యం బనుగతిహరిదిభయతి నభివృత్తిన్

౨౫. అభికృతిచ్ఛందఃపాదంబు పంచవింశత్యక్షరంబు

అందు సింధురవృత్తము—(న-న-న-న-స-భ-భ-భ-గ-౧౬ యతి.)

క్రమమున నననన సభభభగగణ క్రాంతదినాధిపవిక్రమమై
ప్రమదభరసలయభరితవిరచనన్ బంధురసింధురవృత్తమగున్.

భాస్కరవిలసితవృత్తము—(భ-న-జ-య-భ-న-న-సగ-౧౨ యతి.)

సారసహితయతి సంగతవృత్తి న్సంచితభనజయభననసగంబుల్
పారసకులజలరాశిమృగాంకా, భాస్కరవిలసిత మనవిలసిల్లున్.

౨౬. ఉత్కృతిచ్ఛందఃపాదంబు షడ్వింశత్యక్షరంబు

భుజంగవిజృంభితవృత్తము—(మ-మ-త-న-న-న-ర-స-వ-౭-౧౦)

ధీవైదగ్ధ్యశ్రీవిక్రాంతాదిగిభదళమపదమిరతిన్ భుజంగవిజృంభితం
బై విక్రాంతుల్ రైవాతుం జెన్నగుమమతననరస వారితై లగసంయుతిన్.

మంగళమహాశ్రీవృత్తము—(భ-జ-స-న-భ-జ-స-న-గగ-౮-౮ యతి.)

శ్రీనిలయవిశ్వనృపశేఖరకృతస్తుతివశీకరణమంగళమహాశ్రీ
నా నెగడు సద్భజసనంబులతుదన్ భజసనంబులు గగంబును దనర్పన్.

క. క్రమమున నిరువదియాఱై-యమరిన ఛందంబులందు నందంబులుగా
సముచిత సమవృత్తంబుల-సమకూర్చితి తెలుఁగవారియుఁ జదువరులు మతీయన్. ౨

క. అలాగు గాక యుద్ధుర-మాలావృత్తములు నాఁగ మంజులతాలా
వాలములు నధికవర్ణవి-శాలమ్ములు నగుచుఁ బరఁగుఁ జదువరుల కెల్లన్. ౩

అందుఁ జత్వారింశన్మాత్రాగర్భితపాదంబు త్రింశదక్షరంబు

లయగ్రాహి—(భ-జ-స-న-భ-జ-స-న-భ-య-౮ పైఁ బ్రాసయతి)

పంచినయతిన్ భజసనంబులఁ బునర్భజస-నంబులధియంబులకదంబము లయగ్రా
హిం జెనువునం బుధనుతిం బఱఁగుఁ బ్రాసనికు-రుంబకము పాదముల నింబడెరుమాసన్.

అట్ల చత్వారింశన్మాత్రాగర్భితపాదంబు చతుస్త్రింశదక్షరంబు

లయవిభాతియనువృత్తము—(న-స-న-న-స-స-న-స-న-న-స-గ)

నసనసనాకలితనసననసగంబుల వి-లసితతరపాదములఁ బొసఁగునలు ప్రాలం
బ్రసరితములై యలరుఁ బసలయవిభాతియన-రసికులకువీనులకు నొసఁగుఁజవులింపై.

అట్ల చత్వారింశన్మాత్రాగర్భితపాదంబు సప్తత్రింశదక్షరంబు

లయహారి యనువృత్తము—(న-న-స-న-న-న-స-న-న-న.న-స-గ
౧౦ పైఁ బ్రాసయతి.)

పదునొకఁడు నగణములఁ బొడలి సగణము గురువు
మృదులపదరచనఁ దగి యొకని మిత్రాలన్
ముద మొసఁగు సభల నని చదువుదురు కవివరులు
హృదయములఁ జతురతలుగనుగ లయహారిన్.

అట్ల చత్వారింశన్మాత్రాగర్భితపాదంబు చతుస్త్రింశదక్షరంబు

త్రిభంగియనువృత్తము—(న-న-న-న-న-న-స-స-భ-మ-స-గ.)

లలినవననననములు ససభమములు నతిసన రమ్యోక్తిఁ-జరింపం బ్రసరింపం బాటివహింపం
తెలువుగ నవకలి నిలుపఁ గఁదగునెడ వెలయుఁ ద్రిభంగి-సురక్తిం బదభక్తిం బ్రాసనియ

## మఱియు ననియతపాదంబు - దండకము

కృతినాది నసహంబు లొండెం దకారంబు లొండెం బ్రకల్పించి యామీఁద నెల్లం దకార ప్రధానంబు గుర్వంతమై క్రాల నిచ్ఛానురూపావధిం జేర్చి నిర్మించుచో మించి తత్తద్గణవ్రాతముల్ వృత్త్యనుప్రాసధుర్యంబులై యర్థచర్యంబులై హృద్యశౌర్యంబులై సాధుసారస్యహార్యంబులై రీత్యలంకారవంతంబులై పుష్టిమంతంబులై యింపు లంకింత కింపారఁ గల్పింపఁగా దండకంబు న్సమన్వండలం బయ్యె రాజేంద్రకోటీరకోటీతటీనృత్యదాజ్ఞాగ్ర్యమాణిక్య విశ్వేశ్వరా విశ్వవిశ్వంభరాధీశ్వరా.

మఱియు నీవృత్తములు స్వస్థానార్థసమవృత్తములుఁ బరస్థానార్థసమవృత్తంబులు నన రెండుతెఱంగు లయ్యె నది యెట్లనిన:

క. ఛందోవృత్తంబుల సమ-సందర్భము లిడుపడఁగ సముచితనికల
చ్ఛందఃపాదంబుల సర-విం దప్పక యుభయరూప వృత్తము లయ్యెన్. ౪

క. స్వస్థానార్థసమములుఁ బ-రస్థానార్థసమములును రచనలచేన
గనూలథ నిరుఁదెఱఁగై-సుస్థిరవృత్తములఁ గృతుల సొంపుల నింపున్. ౫

గీ. మొదలిపాదంబు మూఁడవయదియు నొకటి-ద్వితీయచతుర్థపాదములు నట్ల
సమకవర్గంబులైన వృత్తములఁ జెప్ప-స్వపదజాతార్థసమవృత్త సంజ్ఞ వడయు. ౬

### నారీప్లుతవృత్తము

తానోదారశ్రీయుతా గానియుక్తిం-గానంగఁదాజస్థ గగప్రసక్తిన్
మూనై చాళుక్యభూపాలగమ్య-స్థానంబు నారీప్లుత సంజ్ఞమయ్యెన్. ౭

### రతిప్రియవృత్తము

ఖ్యాతిశ్రీమనజరగంబులుండఁగా ద-గ్గతంబులై జభసజగంబు లొందఁగా
వీతాఘప్రముదితవిశ్వ విశ్వభూపా-కృతిం దలంప నిది రతిప్రియం బగున్. ౮

### అతిప్రతాపవృత్తము

సజసాగణావలిఁ బ్రసన్నవభా, గ్రజరపంక్తి నభిరామరూపమై
యజితప్రతాపమొలు వారుఁ గృతి, న్విజయవిక్రమా విశ్వభూవరా. ౯

గీ. నలయుఛందంబు పాదంబుఁ దొలుతనిలిపి-యాలఛందంబుపాదంబు నాల నిలిపి
మోలి కొడవెట్టి యీగతి నొనరఁ జెప్ప-వెసఁ బరస్థానసమకార్థవృత్త మయ్యె. ౧౦

### అందుమనోహరవృత్తము

చాళుక్యనృపాల తజానములం, గలయన్ససపారికల్పితమై
చెలొప్పఁగ, జెప్పిన మేదినిలో,విలసిల్లు మనోహరవృత్తమనన్.

### కోమలవృత్తము

సలలితరీతి నజాయగణంబుల్, చతుర్థ్యభూప జభసజసగస్థితిన్
మలయుచు నర్థసమస్థితచేత, న్వెలుంగఁ గోమల మనువృత్త మొప్పగున్. ౧౧

క. ఏకచ్ఛందోవృత్తా-నీకంబులు రెండురెండు నిలుపుదు రిష్ట
శ్లోకార్థంబుల నోలి వి-వేకులు స్వస్థానవిషమవృత్తంబులనన్. ౧౨

### అందు అంగజాస్త్రమనువృత్తము

దానవకేంద్రోదారథమంబుల్, ప్రాణిసగాప్తిం బొంపిరినోనన్
జానారన్మసజంబు గస్థితిం-బై నీషంజము నంగ జాస్త్ర మై. ౧౩

### వారాంగియనువృత్తము

చతుర్థ్యవంశాజతజల్ గగంబుల్-చెలంగి యర్థంబునఁ జెంది పేరిం
గ్రాలంగఁ దాయ త్రిజగానియుక్తిన్-మేలయ్యె వారాంగి సమాహితాఖ్యన్. ౧౪

### నదీప్రఘోష మనువృత్తము

భారరములొప్పగఁ బ్రాగుపేతంబులై-సరించుచుండంజతజస్థరేఫలం
బర త్రిపాదంబులఁ బర్యవొప్పఁగన్-దిరంబుగా నూఁట నదీప్రఘోషమై ౧౫

క. అందముగ నుపక్రాంత-చ్ఛందఃపాదంబు లోల సాగి నికటం
చ్ఛందఃపాదంబులతో-నందఁ బరస్థానవిషమనువృత్త మగున్. ౧౬

### అందు శ్రీరమణామనువృత్తము

ఆరభనవ్యాయుత్తసగవ్యా-పారము నాదిమపాదము సెందన్
జారుభిభాగగసంగతిచేతన్-శ్రీరమణాంబని చెప్పిరి నూఁటన్. ౧౭

### శరభక్రీడావృత్తము

చతుర్వర్ణాధారాయమనసరగవ్యాప్తినాద్య
ద్వితీయాంత్యాంఘ్రిప్రస్తుతిగతి నతిస్పష్టమైనన్
ఖ్యాతాసక్తిన్ మభనయయు తృతీయాంఘ్రినొప్పన్
బ్రతిప్రేమోత్పత్తిం బరఁగి శరభక్రీడ యయ్యెన్. ౧౮

### సర్వాపరస్థానవిషమవృత్తంబులలో పీనారచనయనువృత్తము

చాణక్యనయజ్ఞాతయుసస్థసగంబుల్-పీనారచనకొందు ఘనిందసనానంబుల్
ప్రేణిందజనస్థితభసనేవిత నియతిన్-రాణాలనెలవై భస నజరంబు లొదగన్. ౧౯

క. ఛందః ప్రస్తారక్రమ-సందృష్టంబైన వృత్తసంఘములో నొ
ప్పందము లగుపాదంబులఁ-బొందింపఁగ విషమవృత్తపుంజము లమరున్. ౨౦

## ఇది వివిధవిషమవృత్తలక్షణము

క. మాత్రాగణరచనలకుం - బాత్రములై నెగడె యాంధ్రభాషాకవితా
మిత్రములై రసభావా - మత్రములౌ జాతు లెఱుఁగ నుంచిరి కృతులన్. ౨౧

క. అందును గందంబులు నా - నందంబులు భజసనలగణాఖ్యల చే నా
నిం దగు నెఱుఁగం బ్రాసము - మందుగ నిడి మూఁడు నైదు మూఁడునైదున్. ౨౨

క. ఆదిమవర్ణము వళి నిడు - పై దొరకినఁ గుఱుచయైన నట్టుల తత్త
ద్వ్యాదుల నిలుపందగు - గాదిరిగాఁ జెప్పఁబడుఁ గందంబులకున్. ౨౩

క. నిడుదలగు పాదములకును - వడి వాలగణము మొదల నలయు నిలుప న
క్కడలను గురువును మూఁడవ - యెడ నలజలలోన నొకటి నిడ జెడుఁగవిరున్. ౨౪

క. ఇందుపుర బాణనగములఁ - గందువ జగణంబు నిలుపఁగాఁగా దేవుడుం
గందములకు నార్యాదుల - చందం బధికంబు నాని జనుఁ దెలియంగన్. ౨౫

క. కందము నర్ధంబులకుఁ - సంధించినఁ గురువు పుసుపఁ బక్ష యగు నాఱవనోఁ
జెందిన జగణము లత్వముఁ - బొందిన నట గార్యయనఁగ బోసఁగుఁ గృతులన్. ౨౬

క. క్రమమునఁ బథ్యార్యార్ధము - లమరంగా విడుపడిన నది గాథాభే
దముగాఁగం బరఁగు ప్రపం - చము తెనుఁగునఁ జెప్పరంత్రు చతురులు కృతులన్. ౨౭

## సీసపద్యలక్షణము

క. భావరసాలంకార - ప్రావిర్భూతాంధ్రకావ్యఫణితులకును త
ద్భావాలము లగు సీసగ - ణావళిలక్షణము తెలుఁగనగుఁ జతురులకున్. ౨౮

క. నలనగసలభరలిగణం - బులు నసహంబులును ననఁగఁ బొలుపగు సీసం
బులు గీతులు నానఁగదా - తులవఱపఁగవలయుఁ గృతుల కందం బరయన్. ౨౯

క. ఒకగురువు రెండులఘువులు - నకలంకత సమము కాన హానములు పమలో
నొకఁడొకఁడు విడుపడుచున్ - వికటింపక చెల్లు నొక్కవృత్తము తక్కన్. ౩౦

క. అమరంగ విషమసీసము - సమసీసము లనఁగ రెండుచందము లందున్
బ్రమితమగు విషమసీస - క్రమ మెఱుఁగఁగవలయుఁ జతురకవిజనములకున్. ౩౧

గీ. హంగణనగణంబు లేదు గుర్వంతమగుచు - విస్తరిల్లిన యుత్సాహవృత్తమయ్యె
దీనికున్న గీతియొకఁడు సంధింప విషమ - సీస మిత్తెఱఁగెఱుఁగుట చెలువుమరికి ౩౨

ఉత్సాహము. ఓసరించుఁ బజ్జలజ్జ లుజ్జగించు రాజులన్
వేసరించు గర్వపర్వవేషభూషితాఖలన్
వాసవానుకార వీరవర్య విశ్వభూప నీ
భాసురాసిధేనుకానుభావ మాహవంబులన్. ౩౩

సీ. క్రమయుక్తి విద్యల కందువ లెఱుఁగుచుఁ గవులనే ర్పారసి గారవించి
సమరసంక్రీడనక్షమసుభటాటోప సంచారములకు నుత్సాహమూఁది
నమితాహితక్ష్మానాథులరాజ్యంబు నానాఁటి కొసర నున్నతముచేసి
ప్రముదితారాతుల భంజించి వేలుపుం బడఁతుల కింపారుపతులఁ జేసి
విమలకీర్తుల దిక్కులు విప్పనేర్చు-నమితవిభవుండు విశ్వేశచక్రవర్తి
సముచితంబుగ నని చాల సన్నుతింప-నమరు నక్కిలిప్రాససీసాహ్వయంబు. ౪౨

## వడిసీసము

క. ఏపాదమునకు నేనడి-యాపాదింపంగఁబడియె నది ఖండముగాఁ
బ్రాపింపఁ జెప్పఁగ వడి-చూపితిసీసంబు నాఁగ సూరిధీకనుక్కై. ౪౩

సీ. గ్రహదంష్ట్రి సోఁకని గ్రహరాజు ప్రియునకుఁ గన్నంబు నేర్చినకల్పభూజ
ములకుఁ దూఁపులు కేల నంటని కందర్పుఁ బమ్మచే నింకని యంబురాశి
కన్నులు పెక్కులు గల్గనియింద్రుండు కళంకేది వంగనికనకనగము
తనువర్తి ప్రాలెడుసర్మదేవనిగాఁపుఁ దాల్పనరాజవిద్యావినూతి
నయవిగుండు రాజనారాయణాంకుఁడు విశ్వనాథుఁ డనుచు వర్ణనములు సేయు
పగిది నిట్లు కృతుల వడిసీస మున నొప్పు-నసుధ ధైర్యనాలనాఁ డనుచును. ౪౪

## అక్కిలివడిసీసము

గీ. సీసఖండంబు లిట్లు చెప్పి గీతి-ఖండముల రెంటి రెంటఁ గూర్చి నొప్ప
వడియు నక్కిలివడిసీసమండ్రు కృతుల-లక్ష్యములు చూచి యెఱుఁగుఁ డీలాగు లెల్ల.

క. సీసములకు గీతులకుం-బ్రాసములును వళ్లుఁ గలుగఁబడి కవితల ను
ద్భాసిల్లఁ జెఱచు నియమ-వ్యాసక్తియుఁ గలుగఁ జెప్పవలసిన చోటన్. ౪౫

## గీతిభేదములు

గీ. ప్రవళినాఁ బ్రసన్న పదినాఁగ గీతులు-సీసములను రెండు చెందుఁ దుదల
నాటవెలఁది యనఁగఁ దేటగీతి యనంగ-నాని పేళ్లు వేఱ వరుసఁ దెలియ. ౪౬

ఆ. మూఁడునగణహగణములు రెండునలనా-ఖకములు హగణపంచకంబుఁ బూర్వ
నాటవెలఁది యడుగు లంబునిధులపట్ల-ప్రాలు వళ్లుఁ గొంది పఱలెనేని. ౪౭

గీ. నగణమొక్కండు మతినలనామకములు-రెండు నగణంబులును దుద రెండునాలు
గడుగులును దేటగీతికి నడ్డవిరతి-వలయు వళ్లైన ప్రాసైన వరుస నిలుప. ౪౮

## మేలనగీతి

గలము రెండునగణములును గలసి ప్రాస మెఱయఁ
జెలువు దోఁప నెత్తుగీతి వెలయుఁ గృతులయందు
నోలి నగణ మొండె హగణ మొండె నేదుచేసి
నాలుగడుగులందు నిలిపి నరుపుదోఁప విరతి
నాలి పంచమస్థ యగుచు వచ్చెనేని యొప్పు
మేలనాభిధాన మైన మేలగీతి కృతుల. ౪౯

## తరువోజ

నలనామకంబులు నగణాంతిములుగ నాలుగంఘ్రులయందు నాలుగఁ గూర్చి
నిలుపు మూఁడవెలను వరుసలో నిల్పవలయు మూఁడవగణవర్గంబు మొదల
నిలుపంగ నివ్విధి నిర్మించి విశ్వ నృపతికి నిచ్చిన నింపుసొంపారఁ
నలకొని తగఁ బ్రాలు నింపెడి నొప్పుఁ దరుణులచే సొంపు నరుఁ దరువోజ. ౫౦

## ఇంద్రాదిగణలక్షణము

గీ. ఒకటి రెండు మూఁడు నాలుగు గురువులైన నగణము లినసురాధిపేంద్ర
గణము లక్షరోపకరణంబు లవి యూని లఘుగణంబు మొదల లఘువు నిలుప. ౫౧

| సూర్యగణములు | ఇంద్రగణములు | చంద్రగణములు | |
|---|---|---|---|
| UI | IIII | UIUU | IIUUI |
| III | IIIU | IIIUU | UIUI |
| | IIUI | UUIU | IIIUI |
| | UII | IIUIU | UUII |
| | UIU | UIIU | IIUI |
| | UUI | IIIIU | UIII |
| | | UUUI | IIIII |

## * అక్షరలక్షణము

వ. ఇత్తెఱంగున రవీంద్రచంద్రాఖ్యగణంబులలోన సప్తగణకల్పనీయం బై మహాక్షరంబు, షడ్గణకల్పనీయం బై మధ్యాక్షరంబును, పంచగణకల్పనీయం బై మధురాక్షరంబును, చతుర్గణకల్పనీయం బై యంతరాక్షరంబును, త్రిగణకల్పనీయం బై యల్పాక్షరంబు నానక్షరవృత్తజాతంబులు పంచవిధంబులం బరఁగు నందు ౫౨

---

* అక్షరలక్షణము.

### మహాక్కరం బెట్టిదనిన

వారిజాప్తుండు పంచేంద్రగణములు వనజారియును గూడి వెలయుచుండ
నారయ రెండవనాలవచోట్ల సర్కాండయి నసం డనర్చుచుండఁ
గౌరి యవ్వడిపంచమగణమునఁ గూడి మొదల నిలుపంగ నగు
సారమై ప్రాసవడి సప్తగణములు సాఁగ మహాక్కర మతిశయిల్లు. ౫౩

### మధ్యాక్కరం బెట్లనిన

వరుసతో దేవేంద్రసూర్యాద్రి రవుల......
విరచించి నాలవపట్టు విశ్రాంతి సదనంబుచేసి
తిరబడఁ దప్పక చెప్పఁ దగునండ్రు మధ్యాక్కరంబు
కరవాలభైరవు పెంపు గణుతట్ర్యమున నతిశయింప. ౫౪

### మధురాక్కరం బెట్లనిన

తరణివాసవత్రితయంబు ధవళభానుయతి నొంద
నిరతి విశ్రాంతి నాలవనెలవున నింపుమీఱ
సరసమధురార్థములఁ జెప్పఁ జను మధురాక్కరంబు
వరుసఁ బంచగణములను వాలి కృతుల వెలయు. ౫౫

### అంతరాక్కరం బెట్లనిన

కమలమిత్రుండు సురరాజగణయుగంబు-కమలమిత్రునితోఁ జెంది కందళింప
సమరఁ బ్రాసవళ్ల నర్థంబునతిశయిల్ల-నమల మగునంతరాక్కర మర్థిసంఖ్య. ౫౬

### అల్పాక్కరం బెట్లనిన

సుమనఃపతియుగము సోముండును-నెమకంగఁ బ్రాసవళ్లు నిండిమీఱ
గమనీయవిభవంబుగాంచునెప్డు-రమణీయ మల్పాక్కరము కృతుల.‡ ౫౭

### షట్పది

సురపతులిరువురు సురపతులిద్దఱు-సురపయుగమ్ముతో సోముండును
బరువడిఁ జెలఁగొనసరుదుగ షట్పది-సరిఁ బ్రాసములు దనరారంగను. ౫౮

### చౌపది

భసగానలములపైని గరంబు-న్నసఁగఁగ మూఁడవయెడ విరమంబుం
బొసఁగినఁ జౌపదిఁ బోలుచు రసంబుం-గననమగుఁ దగుఁగద ప్రాసంబుల్. ౫౯

---

‡ ఇది గీతద్వయమువలె నున్నది.

## త్రిపది

త్రిపదికి నొక్కయంఘ్రి నింద్రులు నలువురు
ద్వ్యుపకులిద్దఱు సూర్యులిద్ద ఱొలయ్యుపతిద్వయార్కులు నొల ౬౦

## ద్విపది - మంజరి

శక్రత్రయంబును సవిత్రుండుఁ బాద-విక్రీడితులు మృదుద్విపదికి నెపుడు
వళియుఁ బ్రాసంబును వలయు దీనికిని-వలదు ప్రాసంబంద్రు పరుస మంజరికి. ౬౧

## షట్ప్రత్యయములు

సీ. నచ్చిప్రస్తారసంఖ్యా ననష్టములును-నాలనుద్దిష్టలగక్రియాధ్వములును
ననఁగ షట్ప్రత్యయము లిందుఁ దనరు వాని-నెఱుఁగ నేర్చుట ఛందంబు నెఱుఁగ నేర్చు

## ప్రస్తారము

క. గురుపంక్తి నిలిపి మొదటను-గురువునకుం గ్రింద లఘువుఁ గొని దానిపయిన్
సరిచేసి పిఁఱుద గురులిడి-పరువడి లఘ్వంతమైనఁ బ్రస్తారమగున్. ౬౩

## సంఖ్యానము

క. గురుపంక్తి మొదల రెండిడి-వరుసను రెట్టింపఁ దుదకు వచ్చిన సంఖ్యా
పరిమాణము తచ్ఛందో-విరచితవృత్తములుగా వివేకింపఁదగున్. ౬౪

## నష్టము

గీ. అరసి వృత్తసంఖ్య నర్ధించుచో సరి-యైన లఘువు విషమ మైన గురువు
గొనుచు శేసి నొకఁడుగూడి యర్ధముసేయు-నవధి నష్టవృత్త మబ్బునండ్రు. ౬౫

## ఉద్దిష్టము

క. వలసినవృత్తగణాలి మొ-దల నొక్కఁడు నిలిపి తుదకుఁ దగ రెట్టింపం
గలలఘువుల పై లెక్కలు-నొలయఁగ మతియొకఁడుగూడ నుద్దిష్టమగున్. ౬౬

## లగకరణము

క. ఎక్కువ యొకఁడుగ వృత్తపు-టక్కరముల దొంతి పేర్చి యట మీఁదటికై
యొక్కొక్కఁడ విడిచి యున్న న-లెక్కలు గురులఘువిమిశ్రలిఖితగణంబుల్. ౬౭

క. ఆలెక్క లన్ని యున్నన-వోలిక లఘువులును గురువులును గలిగెడు వృ
త్తాలి నవి గలయఁ గూడిన-నోలిం దద్వృత్తసంఖ్యయును నొనఁగూడున్. ౬౮

## అధ్వప్రక్రియ

క. వృత్తసంఖ్యనిడుపువెడలుపు రెట్టించి-వానినొక్కఁడొకఁడు వదల నెన్న
నెన్ని యయ్యె నన్ని యొసఁగు నంగుళులవి-ప్రస్తరింప నిడుపు వరఁగు విప్ప.

శా. అందంబై శ్రుతిమూలమై విలసదుద్యత్సర్వలోకాశ్రయా
నందంబై సమవృత్తమై వివిధవర్గప్రాప్యమై సద్రస
స్యందంబై బహువిక్రమంబయి భవచ్చారిత్రముంబోలె ని
ఛ్ఛందశ్శాస్త్రము పర్వు సర్వరను విశ్వక్షోణిపాలాగ్రణీ ౭౦

శా. కావ్యాలంకృతికల్పనత్కుముకళాకల్యాణ కల్యాణపూ
ర్ణవ్యాపారసమృద్ధయోద్ధవినమద్రాజన్య జన్యస్థల
క్రవ్యాదావళిగీయమానవిజయప్రారంభ రంభాదిరం
భవ్యస్త్రీసుఖవృత్తిసుందరసపత్నస్తోత్రపాత్రోదయా ౭౧

క. నిఘ్నాఖిలశోభన వృ-త్రఘ్నమహాస్త్రగవిభూతి రంజితజంఘా
దఘ్నారినవ్యజయ ని-ర్విఘ్నోన్నదయసద గువినుత విశ్వాసనిధీ. ౭౨

### మాలిని

స్తుతిహిమకరజూటా మూర్తిత్రస్వాట్కిరీటా
ప్రతతిగుణపరీతా పంసధారాభ్యరీతా
సితకరమలదీపా స్నిగ్ధబద్ధప్రతాపా
సతతలసదభిఖ్యా సర్వలోకాశ్రయాఖ్యా. ౭౩

### గద్యము

ఇది శ్రీమగుమారాం చరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయ విరచితంబైన
కావ్యాలంకారచూడామణి యను నలంకారశాస్త్రంబు
నందు ఛందోగణ జన్మశుభాశుభ నిరూపణ విభవవళి
ప్రాస ప్రపంచ లక్షణ సమవృత్తజాతికల్పన
వత్ప్రస్తారాదివిధానాదిస ముద్దేశంబునం
సప్తమోల్లాసము.

---

# నవమోల్లాసము

## వ్యాకరణము

క. శ్రీవిశ్వేశ్వర విజయ-శ్రీవిశ్రమహర్మ్యశాహుశిఖర యుక్తి
శ్రీవిశ్వగవ్యాకీస్తుతి-శ్రీవిభ్రమరాలయప్రసిద్ధవిభూతీ! ౧

క. భవదనుమతి నూరిసుఖ-ప్రవణం బయినట్టి యంధ్రబంధురరుచిమ
త్కవితాస్పద మగుపలుకుల - వివరింతుం దెలియఁ దెల్గువిధములు జగతిన్. ౨

క. యుక్తివిశేషము శబ్దం - బుక్తివిశేషంబు గాదు యోగ్యునకైనన్
యుక్తివిశేషము సాధ్యం - బుక్తివిశేషం బసాధ్య మూహింపంగన్. ౩

మ. విలసద్భావరసాద్యలంకృతులచే విఖ్యాతి గీర్వాణభా
షల కబ్బంబుల కన్నియుంచిలినము ల్సంధిల్లు నాచంద మై
వెలయుం బ్రాసము వంటి కగ్గలములై వర్తిల్లు సత్కావ్యముం
దెలుఁ గంచుం దెలిఁ జెప్పలేమి యొడుపం దేఁగల్గునే మం దిలన్. ౪

క. ధర శ్రీపర్వతకాళే - శ్వరదాక్షారామసంజ్ఞ వఱలు త్రిలింగా
కరమగుట నంధ్రదేశం - బరుదారఁ ద్రిలింగదేశ మనఁ జనుఁ గృతులన్. ౫

గీ. తత్త్రిలింగపదము తద్భవంబగుటచేఁ - దెలుఁగుదేశ మనఁగఁ దేటపడియె
వెనుకఁ దెనుఁగుదేశమును నంద్రుకొందఱు - వ్యాస పంనగతులఁ బరఁగుచుండు. ౬

గీ. తెలుఁగు దేశభాష తెలిసియుఁ బొమ్మనఁ బోక - తెలియువలయు మించు తేటపడఁగఁ
దోడవు గాక పసిఁడిఁ దొడిగిన నొప్పునే - కనక మింట నెంత కలిగనేని. ౭

గీ. విశ్రుతులు హేమచంద్రత్రివిక్రమాదు - లానరఁ జూపిరి ప్రాకృతంబునకుఁ ద్రోవ
నంధ్రభాషయుఁ బ్రాకృతాహ్వయము కాన-వలయుఁ దల్లక్షణంబులు వరుసఁ దెలియ.

క. స్వరములు నచ్చులు ననఁగా - నరయ నకారాదిసంజ్ఞ నయ్యక్షరముల్
దిరముగ హల్వ్యంజనములు - వరుసఁ గకారాదిపంచవర్గాక్షరముల్. ౯

క. యరలవ లంతస్థలు నా-నురవగు శషసహలు బొలుచు నూష్మ లనంగాఁ
బరువడిఁ బ్రయోగములతోడ - విరచింపుదుఁ దెలియువలయు నీనితెలుంగుల్. ౧౦

క. భువిలోఁ దత్సమమును దద్భవమును సహజాంధ్రదేశభవమును దేశ్యో
ద్భవమును గ్రామ్యము నాఁ బంచవిధములై తెలుఁగుఁబలుకుజాతము పరఁగున్. ౧౧

## తత్సమలక్షణము

గీ. పరఁగ సంస్కృతంబుపైఁ దెనుంగువిభక్తు లనుపఁబడి పొసంగి యుండెనేని
తత్సమంబు నాఁగఁ దగునండ్రు సుకవులు - తద్విహీనకావ్యతతియు లేదు. ౧౨

చ. పరమవినీతిమంతు లగుపార్థివకోటికి విశ్వమేదినీ
వరుఁడన నాగ్రహంబుఁ జిగవైరము సత్యవిహీనవృత్తమున్
విరసమదంబుఁ గైతవము భేదవిధానము దుర్నయంబు ను
త్సరమును వర్జనీయ మనఁ దత్సమసైనను సంగ్రహభావకున్. ౧౩

క. వదలక సిద్ధాక్షరములఁ - బొడివినసర్గములఁ గూడి పోఁ బలుకఁగ న
ర్థదమై ప్రాకృతనిభ మగు - నది తద్భవపదము నాఁగ నభిమత మయ్యెన్. ౧౪

సీ. యజ్ఞంబు జన్నంబు యత్నంబు జతనంబు చంద్రముఁ డను పేరు చందమామ
యోగులు జోగులు యోగులు జోగులు భేదంబు బిందంబు పృథివి పుడమి
విష్ణుండు వెన్నుండు వెజ్జు నా వైద్యుండు పుస్తంబు పొత్తంబు ప్రోడ ప్రౌఢ
కుబ్జుండు గుజ్జుండు కుక్క కుక్కుర మను శయ్యయు సజ్జ నా జాది జాతి
యనెడు పల్కులు తద్భవాహ్వయము లండ్రు-వీని నిన్నిటి నెఱిఁగి వివేకబుద్ధిఁ
గబ్బములు చెప్పుకవులచక్కఁదనము మెచ్చు-విపులవిద్యుండు చాళుక్యవిశ్వవిభుఁడు. ౧౫

## దేశ్యలక్షణము

క. శ్రేయములై బహుదేశా-నేయములై చక్కఁదనము నెఱపనములు నై
యాయా నెలవులఁ గవులకు - దీయము లగుపలుకులెల్ల దేశ్యము లరయన్. ౧౬

సీ. వాలాయ మాలంబు వంగడ మంగడ సోలంబు చొక్కులు సోయగంబు
విన్నన్ను వెన్ను వావిరి నంతి వాగెంగు డెందంబు డిప్పాడి డిల్లపాటు
నెమ్మోము నెత్తమ్మి నెలఁత క్రొన్నెల కొమ్మ లావణి మొయ్యార మారజంబు
పొక్కుడు నెవ్వఁగు పొచ్చెంబు మచ్చిక యక్కజం బచ్చెరు వక్క నిక్క
వెలఁది చిగు రెల్లి వేనలి వేనవేలు - నాఁగఁ జనుశబ్దములు దేశినామకములు
వీనఁ జెప్పినకవితల వినుచు మెచ్చుఁ - జారుతరకీర్తి విశ్వేశచక్రవర్తి. ౧౭

## అచ్చతెలుఁగు లక్షణము

క. ఈయాఁడు తెలుంగులలో - నేమిటనున్ దొరలకున్న నెల్లజనులకున్
లోఁ దెలియఁ జెలుపడియెడు - నామాటల యచ్చతెనుఁగు లన నెగడొందున్. ౧౮

చ. ఎనుములు గుఱ్ఱము లావులు నెద్దులు బండ్లులు పండు లుప్పు ప
ప్పనుములు గొల్లలాముదము లాకులుఁ బోఁకలు నేయి నూనె యే
పునఁ జనుసొంపు విశ్వవిభు ప్రోల నవంకగ విన్న వారికిన్
మనమునఁ దోఁపగాఁ దెలియుమాటలు యచ్చతెనుంగు నాఁ జనున్. ౧౯

## గ్రామ్య లక్షణము

క. ఊసడములు గోగడములు-గా సగలీసకులు నైనకట్టెఁడిపలుకుల్
భాసిల్లు గ్రామ్యములు నా-హాసోక్తులఁ దెగడుచోట నవియును నొప్పున్. ౨౦

సీ. ఊసలు వేసలు వేసాలు దోసాలు గోసలు వేవాలు గాసడాలు
బొందలు సుద్దలు బొక్కలు కుండలు గంతలు మొదలైన కారకములు
దాని గొంచారమ్మ దీని గొంటూ శోకు మేనూను నీవూను యేగనలయు
పాడేము సూసేము పైలురా గాసేము నాసేవు సేసేవు సేసిరాకు
మనెను క్రియలును మొదలైనయట్టి గ్రామ్య-
శబ్దములు శబ్దములుగాఁగఁ జనవు మెచ్చి
కవుల మనుకాను నయ్యార్యకవుల కైపు
వినిన నగుజెప్పె చాళుక్య విశ్వవిభుఁడు. ౨౧

## తత్సమశబ్దపరిజ్ఞానము

గీ. వెలయు సంస్కృతంబు తెలిఁగించు తెలుఁగు సంజ్ఞలు విభక్తినయ విధులు సమాస
తద్ధితములఁ గ్రియలు తగుభంగి నెఱిఁగింతు - నమరశాస్త్రసరణి ననుసరింప ౨౨

## అజంతప్రకరణము

క. నిడు పుడుపవలయు సంస్కృత-మెడపక లింగములు మూఁడు నేకాక్షరముల్
విడిచి యజంతాదుల కీ-నడక యుక్తప్రయోజనము తెనుఁగునకున్. ౨౩

క. బిందువిసర్గంబులు గడ-నందిన పొల్లులను దక్క యంధ్రవిభక్తుల్
పొందుగ సంస్కృతపదముల - ముందటి కెస నిలుప నంపముగఁ దెనుఁగయ్యెన్. ౨౪

క. స్థావరతిర్యక్పదములు - దేవమనుష్యాదికములఁ దెనిఁగించునెడన్
వావిరి నజంతములకుఁ-గావించు ముకారమును డుకారము నునికిన్. ౨౫

గీ. దానకల్పకుజము దర్పోగ్రసింహమ్ము - రజనికరుఁడు కాంతి విజయుఁ డాజిఁ
దనర విశ్వనాథుఁ డన నకారాంతశబ్దములఁ దెనుఁగుపఱుచు భంగులయ్యె. ౨౬

క. రవి యరితిమిరాపహతిం - బవి పరగిరివిహతి రసవిభావప్రతిభం
గవి విశ్వేశ్వరుఁ డనఁగా - భువినీశ్వయమునకు నిదియపో తెనిఁగింపన్. ౨౭

గీ. ఇల నకారాంతపదములఁ దెలుఁగుసేయఁ - గడ వుకారంబునుండు డుకారముండు
రాజనారాయణుఁడు నృపప్రభు వనంగ - విశ్వనాథుండు నృపులకు విభుఁ డనంగ.

క. మనుకటుపటుశబ్దాదుల - నొనరింప డుకార మెపుడు నుండదు కవితం
దెనిఁగించి చెప్పుచోటం - దనరు వుకారంబ యర్థదాయక మగుచున్. ౨౯

గీ. మనువు ధర్మశాస్త్రమతిమున మిక్కిలి - కటువు విరుదవినుతి కర్ణములకుఁ
జాలఁ బటువు ధరణి సంగీతసాహిత్య - పరణి విశ్వనాథచక్రవర్తి. ౩౦

క. కలయ ఋకారాంతపదాదులఁ దెనుఁగుగఁ జేయుచోటఁ దుదినిడుపులు గు
జ్జులు సేయందగు నృపులకుఁ - జలుక్యపతి కర్త భర్త సంహర్త యనన్. ౩౧

క. స్త్రీలింగంబుల నిడుపులు - వాలాయము నుడుపఁ దెనుఁగువచనము లగు నం
దాలోల స్త్రీ హ్రీ శ్రీ ధీ లనులపితములు దక్కఁ దిక్కనవల్లన్. ౩౨

క. స్త్రీలకు మదనుఁడు విదయ - శ్రీలకు రఘురాముఁ డెపుడు హ్రీలకు నుచితా
వాలము నిజపాలితధూ - ధీలకుఁ దగుపదము రాజదేవేంద్రుఁ డిలన్. ౩౩

క. శ్రీవిష్ణువర్ధనాఖ్య - క్ష్మావరుభూవిరచపుడును మాకు వనంగా
భానుఁ నేకాక్షరశబ్దావలి యప్పిలుఁగ నొకరుఁ డంటకయున్నన్. ౩౪

క. వనితా యనుచో వనితయు - జననీ యని పలుకుచోట జననియును వధూ
యనుచోట వధువు తెనుఁగున - జనునాయియాలుదలఁ జను పలుకులకున్.

క. ఐకారాంతము లౌకారకారాంతములుఁ దెనుఁగులైనప్పుడు పూ
ర్వాకృతితోడన యుండును - నోకారాంతంబుపై బహుత్వము నొందున్. ౩౬

క. రై వరఁగును నడుగోవున - గోవులు విదుకంగ గ్లానికులనృపతులు ధ
ర్మావిమృతిఁ బడయుదు రనఁగా - వలయుఁ గవిప్రయోగగతిఁ దెలియంగన్.

వ. ఇది యజంతంబులు తెనిఁగించు తెఱం గింక హలంతవిధియు నెఱిఁగింతు. ౩౮

## హలంతప్రకరణము

క. భూభుగ్విరాడ్వరంబులు - శోభితముగఁ దెనుఁగుపఱుచుచోఁ దుదపొల్లున్
బ్రాతివమతివర్ణములగు - భూభుజులు విరాజు లనఁగఁ బోలుపై యునికిన్. ౩౯

క. బలవన్మతిమత్పదముల - తలకున్న నకార మెసలుఁ దగఁ దెమఁగగుచో
బలవంతుఁడు మతిమంతుఁడు - చతురక్షపతి యనఁగ సర్వశాస్త్రములందున్. ౪౦

గీ. ద్విట్పదంబు వేదవిత్పదంబును త్రిక్కుదమునుబూర్వవర్ణ తను ధరించు
విద్విషుండు నాఁగ వేదవిదుండనఁ - దూర్పుదిశ యనంగ నేర్పరింప. ౪౧

క. చేరు నకారాంతముల దు-కారముఁ దెనిఁగించుచోటఁ గతినాత్ముఁడనన్
దారుణాత్ముఁ డనంగను - మేరుమహోన్నుఁడన నమృతధాముఁ డనన్. ౪౨

గీ. వలసిన పురుషు శర్మవర్మశబ్దంబుల - పైదుకార మెక్కుఁ బాసిపోవు
రామశర్ముఁ డనఁగఁ గామవర్ముఁడనంగ - వసుధశర్మ యనఁగ వర్మ యనఁగ. ౪౩

## సంధిపరిచ్ఛేదము

వ. ఇది సంస్కృతపదంబుల కాంధ్రీకరణం బింక నజంతహలంతసంధు లనంగ రెండు దెఱంగు లయ్యె నందు నజంతసంధి యెట్టి దనిన. ౪౪

గీ. అతిశబ్దాంతవర్ణంబు సంస్కృతశబ్దపూర్వవర్ణంబుతోఁ గూడఁ బొత్తుచేయు
సంధి యగుఁ గాంక్రియాసంగతములు - వెక్కురూపంబు లవి గానిపింతుఁ దెలియ.

గీ. తెలుఁగుఁబలుకులు వలిగాఁగ దివిజభాష-లమరఁ దెనిఁగించినప్పుడు నచ్చుతోడి
వ్యక్తులై యుండునయ కాని నాతితోడి - వర్ణవర్ణక భావంబు వలను గాదు. ౪౫

క. అచ్చుతుదియచ్చు పట్టున - వచ్చి యకారంబు నిలుచు వలసినయెడఁ దా
నచ్చయి యిత్వోత్వంబులఁ-దెచ్చు ప్రచితార్థవాదసూచక మగుచున్. ౪౬

క. వేయిచ్చుట యావులయొప్పఁ-జీయునుపమి యురుల యొలమి సిదుములయిలయం
బాయక రేలుట యేచుట - యీయధిపతి కొనరు నాఁగ నవి లక్ష్యంబుల్. ౪౭

క. పోయితి వపుడప్పుడునీ-వీయని కేతెంచి యేయ మేయ మనంగాఁ
బాయక యేయేయనఁగా - నీయంధియుముఁ జెల్లుఁ గ్రియల నిడ నొక్కచోన్.

గీ. ఒనర సంబుద్ధి నోతండ యనఁగ నోతఁ-డనఁగఁ బూనిన వీని కవర్ణ మగున
యర్థమిమ్మమ్మ కొమ్మమ్మ మనెడుచోట-నూఁదు చెప్పఁబడెనుఁగున నుచిత మరయ.

గీ. అట నుకారాంతషష్ఠిపై నచ్చుమొదల - నొనరఁ బొల్ల నకారంబ యుండవలయుఁ
బోతునూ రేతునాలు నాఁబోలుఁగాని - వగియుఁబోతూరు నేతాలు నాఁగఁ జనదు.

గీ. అచ్చుకారాంతషష్ఠిపై నడఁగుఁ బోడము - నింటి దెంటిది యనఁ జెల్లు నల్లకడల
నర్థదర్ధిది యననొప్పు నంధ్రకవితఁ - గవులయనుమతి నదియును గానవలదు. ౫౨

క. అచ్చులపై హల్లుండిన – నచ్చుండినఁ దద్ద్వితీయ కపుడు నకారం
బచ్చుఁడిగి హల్లులుండిన – మచ్చికమైఁ బోవు నచ్చు మతియొక్కొకచోన్. ౫౩

క. భువి సైనికగంటి ని కెఁగు–రువునకు నంధునకు బిరుదదూరు నకారం
బివి అంతంబులపైనం – దవిలిన బహువచనయుక్తిఁ దనరక యున్నన్. ౫౪

క. ........................................................................
..........ంటికి సంధినకారం – బంటదు యసన్మార్గమునందురు ప్రాంతములన్. ౫౫

క. నిడుపున జకారభావము – వడసియు హ్రస్వమున నల్లపట్టున నత్వం
బడరు నకారపుఁ బొల్లకు – నిడఁ దగుఁ బూర్వప్రయోగ మెఱుఁగ కవీంద్రుల్. ౫౬

క. నేను బనరింతు నీవలెఁ – గానము విశ్వావనీశు కడ నను నేనం
దానాడను నభిమతి మగు – నానసుఁ గా నేను నేను గా నేనోక్తిన్. ౫౭

గీ. అచ్చు పరమైనపట్టునఁ బ్రాణిపదము – కర్మమగుచోటఁ దక్క నుకారయుక్తి
వాడుకొనరు నకారభావమున దాని – ననుచరింపుదురు కవిత్రయానుగతిని. ౫౮

క. రిపు నోర్చె రిపుని నోర్చెను – రిపునాజి జయించె నుగ్ర రిపుని జయించెన్
నిపుణతఁ జళుక్యవిశ్వా-ధిపుఁ డనఁగాఁ దెనుఁగుసంధి తెలుఁగౌ వ్రాతన్. ౫౯

గీ. తద్ద్వితీయావిభక్తి సాంతలఁ జరించు – కద్దిగల సున్నసోఁకునఁ గచటతపలు
గజడదబలగు నొఁదుటగలుగుఁ గవుల – యనుమతింగాన నొక్కయనసరమున. ౬౦

గీ. జడులఁ గరుణించుఁ జతురులఁ జాలఁ బ్రోచు – వాజిపనికాయసంబున నేమి సేయు
భటులఁ బనియించుఁ బ్రజలకుఁ బాడినడపు – శ్రీసహితయుండు చాళుక్యచక్రవర్తి. ౬౧

క. అలఁతులఁ గుదిహల్లులకును – నలవడు వామమున నుండి యచ్చోటులచేఁ
బలుముఱుఁ దేలుచు నూఁదుచు – విలసిల్లుల గలుగు లక్ష్యవిధి నెలుఁగఁదగున్. ౬౨

క. తనుఁబొగడుఁ దిన్నఁ బొగడును – జనుఁడు జనుండనఁగఁ దనరుఁ జాడలు గలుగున్
మనవాఁడు వీఁడు నాఁగాఁ–జను నిడుపుల వలవ దూఁది సరిశేతలౌదున్. ౬౩

క. మొల్లమ్ముగ నెల్లెడలను – హల్లులపై నిడుపు లగుచు నాయీ రేఫో
ల్లసితాకృతి నిలుపం – బెల్లం బ్రశ్నానునయాదిశేషములందున్. ౬౪

క. రారా నాగారీ మ–న్నారె కర్ణాటదాత లిట్టివరానో
దారత విన మందిలు నట – పోరో విశ్వేశు వేఁడ బుధులన నెప్పుడున్. ౬౫

క. రుచిరముగఁ బలుచుచోటను – బ్రచురంబుగఁ బ్రథమ పాంతఁబడియుండెడున
క్కచటతపంబుల పట్లను – బ్రచురించుఁ గసడదవలు పరిపాటి మెయిన్. ౬౬

గీ. విశ్వవిభుఁడు గడిది వీరుండు సరసుండు - దక్కుఁ బ్రదక్కు లేని చొక్కులాఁడు
సత్త్వనిధుఁడు పరవిదారణశీలుండు - ననఁగఁ దెనుఁగు సంధి యలరునిట్లు. ౬౭

క. కులు ఋణులను నీవర్గ తు-తులు మొదలుగఁ గొన్ని గొన్ని తుదహల్లులతోఁ
గలసూనెడఁ గూడు విధుచుం - దెలుఁగునకగుసంధి దీనిఁ దెలియఁగవలయున్. ౬౮

గీ. వేడ్క వేడుక ప్రేల్మిడి ప్రేలుమిడియు - మార్మల సెమ్ము లనుల సెను మాన్పమాను
పుము విరోధము సంక్రాంతిఁ బోలుచునిట్టి - సంధిలక్షణ మెంతయుఁ జను సెలుంగ.

క. ఇది సంధిక్రమమునియుఁగఁ - దను విలిసంధానవిధులు లెఱ చెలుఁగుఁ డిలన్
నిచితవిభక్తులగతిఁ జె-ప్పెదఁ దెలియన్వలయుఁ బూర్వబుసకృతసరణిన్. ౭౦

## విభక్తి ప్రకరణము

వ. ప్రథమయు ద్వితీయయుఁ దృతీయయుఁ జతుర్థియు బంచమియు షష్ఠియు సప్తమియు సంబోధనంబును నన నెనిమిది తెఱంగుల విభజింపం గారణంబు గాన విభక్తులనం బరఁగుఁ దత్ప్రకారం బెట్టి దనిన. ౭౧

క. తెలుఁగుం బ్రాకృతభంగిన్ - బలియుట వే నేకవచన బహువచనపదం
బులకాని ద్వివచనంబులు - గలుగవు తత్ప్రత్యయులఁ గానికంబులయందున్. ౭౨

క. ముకులు కులుఁ గలుగుశబ్దము-లవరుం బ్రథమావిభక్తు లవి కర్తలనుం
గను నొసఁగు నిష్టములు నరఁ - బొంపమిననల్పకము విశ్వనాథుఁ డనఁగన్. ౭౩

క. నుచిషర్గంబులు నుది నొం-దిన కర్మపుఁ బదము దా ద్వితీయ యనంగాఁ
జనుఁ జాటుకృష్ణరీ-పుని విశ్వేశ్వరుని సిరులు వొందు ననంగన్. ౭౪

క. చేత ననుపలుకు నుసులఁ బ్ర-తీతం బగు నేని యది తృతీయ యగుం బ్ర
ఖ్యాతంబుగ విశ్వేశ్వరు-చేతం బ్రభవిల్లు నెల్లసిద్ధు లనంగన్. ౭౫

క. పలుకులతుదఁ గై శబ్దం-బలవడ నిలిచినఁ జతుర్థి యగు విశ్వసుహృ
ల్లలనకై యలఘునకై - చెలువారం గృతులు కవులు చెప్పుదు రనఁగన్. ౭౬

క. పదముతుద వలన నగియెడు-పద ముండినఁ బంచమీవిభక్తియ పుష్ప
ప్రదరుఁ డరు విశ్వభూవర-సుదనువలనఁ దొలఁగు ననలనూనం బనఁగన్. ౭౭

క. అమరి కుశబ్దము పాదాం-తమునం దున్నిని షష్ఠితప్పదు విద్యా
సముదయము విశ్వనసుధా-రమణునకుం బొలుచు నిల నిరంతరము ననన్. ౭౮

క. పలుకుతుద నందు నను న-ప్పలు కుండిన సప్తమీవిభక్తియగు న్నా
శ్చలితచతుర్దశవిద్యా-విలసనములు పొలుచు విశ్వవిభునం దనినన్. ౭౯

గీ. ప్రథమగావించు మూడులను బాయఁజెట్టి-కట్టెదుగఁబల్కఁ సంబుద్ధి కడుఁదనర్చు
విక్రమాటోప చాళుక్యవిశ్వభూప-పటుగుణావాల గండగోపాల యనిన. ౭౦

క. కోరి ముకారముమీఁద డు-కారముపట్టునను దగ లుకారము నిడఁ జెం
పారుఁ బహువచనంబులు-హారము లంగములు విబుధు లమరు లనంగన్. ౭౧

క. కడల ముకారడుకారము-లడఁపఁగఁబడు నచ్చతెనుఁగుటుక్తులయందుం
గడ గడలు గొడుగు గొడుగులు-బడుగు బడుగు లేకవచనబహువచనములన్. ౭౨

క. చింతింపఁగ నవ్విధిని హ-లంతంబులు చెల్లు నిలఁ గ్రియావంతులు శ్రీ
మంతులు ధీమంతులు గుణ-వంతులు భూభుజులు వైరివర్గవిదు లనఁగన్. ౭౩

క. ధర బాలుమీఁదిడుత్వము-పరువడి రుత్వంబునొందు బహువచనము బా
లురు భూపాలురు కరుణా-పరులోలు రనంగఁ నగునుదాహరణంబుల్. (?) ౭౪

గీ. వాఁడు వీఁడను నవి బహువచనములను-వారు వారలు వాండ్రును వీరు వీండ్రు
వీరలును నాఁగ నెందును విస్తరిల్లు-గాఁడునకు గారు గాండ్రును గలుగు సంద్రు. ౭౫

గీ. కొఱను నెఱను బ్రమాను కోల నను నివియెల్ల-బహువచోనియుక్తిఁ బరఁగునోట
వెలయుఁ దత్పదములఁ గులు జనియించుఁ బై-వరుస నచ్చు లేనుఁగునావనములకు. ౭౬

క. కొఱఁకులు నెఱఁకులు బ్రమాఁకులు-జీఱుఁగోలఁకులు నయ్యెఁ జేను జేనును మీనుం
గొఱపేలఁ జేలు మీలన-నురువగు నిల నచ్చతెనుఁగు లూహింపంగన్. ౭౭

క. పల్లు వి ల్లిల్లు నాఁ జనుపలుకులెల్ల-బండ్లు విం డ్లిండ్లు నాఁజను బహుత నొడువఁ
బాడుఁ గుండేలు గో రనుపలుకులెల్లఁ-బాట్లఁ గుండేళ్లు గోళ్లు నాఁబడు ధరిత్రి.

గీ. వరుస నేయి చేయి వా యనుపలుకుల-తుదలఁ జెక్కఁ జెప్పఁ గలు జనించు
బ్రీతి నేతు లనఁగఁ జేతులు వాతులు-నాఁగఁ జెల్లు నెల్లనాల సంద్ర.. ౭౯

గీ. చేయి తాయి దో యనియెడి వీనిబహుత-నోలిఁ దుద లుత్వ మొనఁగూడు వేలు తాలు
దోలు నా దుత్వమబ్బు నెద్దునకు వరికి-నెడ్లు వడ్లును నాఁ జను నెఱుఁగవలయు. ౮౦

క. శ్రీ లేకవచన మరయఁగ-బాలును డెమ్మెరలు సహజబహువచనంబుల్
మూలాఖ్యమున్నగాఁ జే-కొక్కులోపడు నిట్లు ధాన్యకులముల కెల్లన్. ౮౧

గీ. కొఱ్ఱ లాట్లు వడ్లు గోదుమ లనుములు-కొల్లు లనెడు వీనికల్ల నిట్లు
ప్రకటితంబు లయ్యె బహువచనంబులు-నేకవచననియతి యెపుడు లేదు. ౮౨

గీ. ప్రాణిపదములు కలిగాఁగఁ బ్రథమ మైన-నరయ నొక్కొక్కచో ద్వితీయార్థము లగు
రా బలంకారములు వ్రాన రాచకొడుకు-వస్త్రములు దాల్చెనన నెందు వలెరఁగాన.

క. ఒనరఁ దృతీయయుఁ బంచమి-యును సప్తమియును దలంప నుచితనిమిత్తా
ర్థనియతిఁ జెల్లుం దెలియఁగ-ననిరి విభక్త్యర్థవేదు లైనకవీంద్రుల్. ౯౪

గీ. విశ్వవిభుని చేత విలసిల్లు సిరి కర-వాలధారవాంకువలనఁ గలుగు
భూరిసిద్ధి రాజనారాయణునియందుఁ-బొడమెఁ గవుల కరివిభూతి యనఁగ. ౯౫

క. పోక చతుర్థీషష్ఠులు-నేకార్థమునందుఁ బలుక నిత్తురు విశ్వ
క్ష్మాకాంతునకుం గృతు లరి-భీకరునకు నిత్తు రి గవులు ప్రసనీతు లనఁగ. ౯౬

వ. మఱియు సంస్కృతభాషావిభక్తులకుం గల నానార్థంబులు తెలింగింతు, స్థావర తిర్య
ఙ్మనుష్య పదసక్తి యగు ప్రథమావిభక్తికిం గ్రమంబున ముకారంబును డుకారం
బును, ద్వితీయకు నుకారనికారంబులును, తృతీయకుఁ జేత తోడ యనునవియుఁ,
జతుర్థికిం గై కొఱకు ననునవియుఁ, బంచమికి వలన పట్టి యుండి కంటె యనునవి
యును షష్ఠికిం గికుకారంబులును యొక్క లోపల యనుపదములును, సప్తమికి
నందు న యనుపదంబులు నయ్యేదత్ప్రకారంబునకు విభక్తినిరూపణంబు లలవరింతు.

క. ద్రుమమే చె ద్రుమముఁ జూచెను-ద్రుమమ్ము చేసొప్పె నదియు ద్రుమమునకై యా
ద్రుమమువలన ఫలము ల్బెను-ద్రుమమున కెన లేదు పువ్వు ద్రుమమునం దొప్పెన్. ౯౭

వ. ఇది యేకవచనవిధి. ౯౯

క. ద్రుమములు ద్రుమములఁ గదిసెను-ద్రుమములచే నీడగలిగె ద్రుమములకై గం
ధ మమర ద్రుమములవలనన్-ద్రుమముల కెలరాఁ గేఁ దాను ద్రుమములయందున్.

వ. ఇట్లు తిర్యక్పదంబులకు యోజించునది. ౧౦౧

క. తనయుఁడు తనయుని గనియెను-తనయునిచేఁ దనయుకొఱకుఁ దనయునివలనన్
తనయునకు ధనము దొరకెను-తనయునియందెల్ల సంచితనములు గలుగున్. ౧౦౨

క. తనయులు తనయులఁ బడసిరి-తనయులచేఁ దనయులకయి తనయులవలనం
దనయులకు మేలుగలిగెను-తనయులయం దనఁగ నివి యుదాహరణంబుల్. ౧౦౩

క. కవి యొప్పఁ గవి భజింపుఁడు-కవిచేఁ గృతు లొప్పు సిరియుఁ గవియ గవులకై
కవివలనఁ గల్గుఁ గీర్తులు-కవికిత్తుం జేరు విలయుఁ గవివరునందున్. ౧౦౪

క. కవులు నుతింతురు కవులం-గవులచేతఁ (?) గవులకొఱకుఁ గవులవలనఁ ద
త్కవులకుఁ బ్రసిద్ధి యలవడుఁ-గవులందుం గాక కావ్యకల్పన గలదే. ౧౦౫

క. గురుఁ డధికుఁడు గురుఁ దలఁపుము-గురుచేతం దెలిసి భక్తి గొలువు గురునకై
గురువలన మేలు చేకుఱు-గురునకు సరిలేదు విద్య గురునం దుండున్. ౧౦౬

మ. తనసత్యవ్రత శీలంబుఁ దన విద్యాతంత్రనిర్మాణముం
దనవిఖ్యాతనకీర్తనంబుఁ దనసత్ప్రస్తుత్యసంతానముల్
తన తేజోమహిమోదయంబుఁ దనయుద్యత్కీర్తివిస్ఫూర్తియుం
దనరం జేర్చుఁ జతుర్వ్యవిశ్వనృపమందారంబునా నల్లెడన్. ౧౩౪

క. శ్రీరాగ్ణవమాఁదుర సం-సారార్ణవ ఘోర శుభ మొసఁగు మీకనఁగా
వైరిపదం బగుఁ దెనుఁగున-గూరని సంస్కృతముఁ దెనుఁగుఁగూర్పఁ జేతన్. ౧౩౫

గీ. అరయ నానీలు హల్లుతో నడుకుచోట - నొసర నుగ్గును నిశుపయియున్న నుండు
గవులయనుమతి నిజ కృతిఁ గానవలయుఁ - జాలవర్ణంబుగ జనీన జడ్డయగును. ౧౩౬

క. ఆకరి యక్కరి యనఁగా - నాకర యక్కరము నాఁగ నక్రికసకం
బాకీకసకం బన భా-షాకరము సమాసముల కుదాహరణంబుల్. ౧౩౭

గీ. సంస్కృతము లస్యఁ దెనుఁగులై నాఁగఁ గొన్ని
శబ్దములు వానిచందంబుఁ జను నెఱుంగఁ
బనసపండును గుండెలోపలనసంగ
గందమంపలు నాదీరకఱ్ఱయనఁగ. ౧౩౮

క. సుమతి నికారోకారాం-తము పై సంస్కృతపదంబు తనుఁ గూర్పఁగ వే
డిమరీములు వాఁడితీరం - బమరు మనుష్యాంపుఁ జేర్చు నవ్వంబనఁగన్. ౧౩౯

క. తెనుఁగూర్ప నికారాంతఁ-బగుసంస్కృతపదముమీఁదఁ నచ్చతెనుఁగున
న్నిగుడాఱు పంటితొమ్ములు - జగమెఱుఁగ నరిదిపారు దంపంబనఁగన్. ౧౪౦

గీ. అత్తమామ నాఁగ నాలుమగం డనఁ - గొడుకుగోడలనఁగఁ గొఱనుజీలు
నాఁగ రాత్రిపగలు నాఁగ నిట్టి సమాసములును గాంచుఁ గవులు చెలియవలయు.

## తద్ధితప్రకరణము

క. అది యాఁడి కాఁ గాఁడితయన - గరలో నొకకొన్ని చెల్లుఁ దద్ధితపదముల్
పరువడి వాని నెఱుంగుట-పరిపరిజ్ఞాన మంధ్రభాషాకవితన్. ౧౪౨

సీ. మూఁడవది ముందవరి తూఁపరి కల్లరి కాలరి క్రేలరి కష్టుఁ డనఁగ
నుప్పఁడి ప్రాయిఁడి చప్పిడి గ్రేసిడి తన్నిడి బిక్కిడి చాకయనఁగ
నీటుకాఁ డెడకాఁడు పోటుకాఁ డుదురులాఁ డించులాఁ డెప్పుడు నీరుఁ డనఁగఁ
దక్కులాఁ డెక్కువ నిక్కులాఁ డదరులాఁ డెఱుకు దురాత్మకుం డీలిఁడనఁగఁ

దనరు దిఙ్మాత్ర చిందలిందముయనంగఁ - బరఁగు పలుకులు తద్ధితపదములయ్యెఁ
దెనుఁగునను వీనిచందంబుఁ దెలియఁ గవుల-నాద్యులఁజేయు రాజనారాయణుండు.

## క్రియాప్రకరణము

గీ. అరయ వాక్యకదంబోత్తమాంగమునకు - నమితసృష్టులు జగతిఁ గ్రియాపదములు
వాని తెలుఁగులు కవులకు వలయుఁ దెలియఁ - గడఁగి కాలత్రయప్రసంగములనలన. ౧౪౪

క. ధరఁ బ్రథమమధ్యమోత్తమ - పురుషాఖ్యలఁ గ్రియలు మూఁడు పొలుచుం గాల
స్ఫురణలను వర్తమానాం - తరభూతభవిష్యదర్థతలఁ ద్రివిధంబుల్. ౧౪౫

గీ. ప్రథమపురుషాఖ్యయన్యార్థపటిమఁ జెప్పు - నగ్రసంస్థితుఁ జెప్పు మధ్యమపురుషము
దగిలి యుత్తమపురుషంబు తన్నుఁ జెప్పు - నేకబహువచనంబుల నెల్లకడల. ౧౪౬

గీ. అగుచునున్న కర్తవ్యము వర్తమానంబు - భూతమనఁగ నయినపూర్వకృత్యము
కడఁగి యింత మీఁదఁ గానున్న యది య భ-విష్యదర్థమనఁగ విస్తరిల్లు. ౧౪౭

క. ఉచితవిధి విధియు నాశీ-ర్వచనమునను గ్రియలు రెండుఁ బ్రథనోక్త్యుక్తియై
ప్రచురించుం బురుషత్రయ-వచనంబుల వీని తెలుఁగు వలయుం దెలియన్. ౧౪౮

క. తెలుఁగు క్రియాపదములకును - నలఘోను ధాతువులు జనపదవ్యవహారో
క్తులు గాన వానిఁ జేర్చి-న-వలదు ప్రయోగములఁ దెలియవలయుఁ దెలుపుదున్. ౧౪౯

వ. ప్రథమపురుషంబునకు వర్తమానార్థంబునందు నేకవచనబహువచనంబులందు నెడి నెద
రులును మధ్యమపురుషంబున నెదవెదరులును, నుత్తమపురుషంబున నెద నెదములును
గ్రమంబున నాదేశంబులయ్యెఁ దన్నిరూపణంబు లెఱింగింతు. ౧౫౦

క. అరిగెడి నరిగెద రనఁగాఁ - నరిగెద వరిగెద రనంగ నధిపతి పురికి
యరిగెద నరిగెద మనఁగా - బరువడి నిదివర్తమానఫణితార్థమగున్. ౧౫౧

వ. ప్రథమపురుషంబునకు భూతార్థంబునందు నేకవచనబహువచనంబుల నెన్నిరులును
మధ్యమపురుషంబునకు తివితిరులు, నుత్తమపురుషంబునకు తినితిములును నాదేశంబు
లగుఁ దన్నిరూపణంబు లెట్లనిన. ౧౫౨

క. చేసెం జేసి రనంగాఁ - జేసితి చేసితిరి మీరు సిరి మా కనఁగాఁ
జేసితిఁ జేసితి మనఁగా - భూసురభూతార్థకథనభజనమ్మయ్యెన్. ౧౫౩

వ. ప్రథమపురుషంబునకు భవిష్యదర్థంబునందు నేకవచనబహువచనంబులకు నుదురులును
మధ్యమపురుషంబునకు వుదువురులును, నుత్తమపురుషంబునకు దునుదుములు నరుస
నాదేశంబులయ్యెఁ దన్నిదర్శనం బెట్టిదనిన:— ౧౫౪

క. చేయుం జేయుదు రనఁగాఁ - జేయుదు చేయుదురు మీరు చిత్తంబలరం
జేయుదుఁ జేయుదు మనఁగా - నాయతముగ నివి భవిష్యదర్థముఁ జెప్పున్. ౧౫౫

క. మొదలం జెప్పిన యది తుద - యది గూడ దేశంబు విధికి నన్వాననములం
బొదలి ప్రథమమధ్యములకుఁ - దుద నుత్తమపురుషమునకుఁ దొంటట్లయగున్. ౧౫౬

క. చేయునది బాహుజుఁడు ధర్మము - సేయునది బుధులు విశేషసిద్ధక్రియలం
జేయునది నీవు దర్పము - సేయునది తపంబు మీరు శివునకు ననినన్. ౧౫౭

గీ. ఉనుదురులకుమీఁద నొగిఁ గాఁతయున్న నా - శీర్వచనమునకును జెల్లనగియు
శివము చేయుఁగాత శివుఁడు శోభనము చే - యుదురుగాత మీకుఁ ద్రిదశులనఁగ. ౧౫౮

క. కారయితృ సేయుకృతి నల - రారు ణిజంతంబు దాని కాదేశంబుల్
ధారుణి నింపును నించును - సారముగా నేకవచనసరణికి నయ్యున్. ౧౫౯

క. తుదబహువచనమునకు నిం - పుదురును నింతురును నయ్యెఁ బాడమియొడల నిం
చుదురును గలుగుఁ బ్రయోగా - స్పదములు దేశీయసరణిఁ జనుఁ దెలియంగన్. ౧౬౦

సీ. శ్రీవిశ్వభూపతి చేయించుఁ గ్రతువులు సేయింపుదురు తదాశ్రితులు సురలఁ
బండంగ నింద్రుండు పరఁగించు వానలు హాలికులు పరగింతు రర్థనయము
నెసఁగించు నగర శ్రీల నేపారు తద్వృత్తి నరభటు లెసఁగింపుదురు జయంబు
నలయింపుకీర్తి యవ్విధినె యింపుదు రర్థులెల్లెడఁ బ్రతాపాతిశయము
ననెడు పల్కులచేత ణిజర్థములకు - నేకవచనబహువచనవాక్యమెలుఁగ
వలయు నవి పెక్కువిధముల వసుధఁ దెలియ - నఖిలభాషావివేకులై నెగడుకవులు.

క. మహితస్థావరతిర్య - క్స్త్రీహీశాదిక్రియలవర్తమానార్థమున
న్విహితమగు నెడుడు కారము - సహజంబుగ నేకవచనసంజ్ఞలచోటన్. ౧౬౨

క. పండును భూజము విరువులు - పండెడు రాచిలుక యొప్పఁ బలికెడుఁ జిలుకల్
గండాడెను సతిపతిపైఁ - బండెడుఁ జెక్కిళ్ళంట సతులు పండెదు ననఁగన్. ౧౬౩

క. నిగుడను భూజము సింగము - బెగడెదు విటు నాగసతి పిలువ ననెడుచోఁ
దగుభూతార్థంబున నదు - లగు నాదేశంబు క్రియల నయ్యైయెడలన్. ౧౬౪

గీ. ఒనర నింపు నించు ననియెడు వీనిపై - నుటుతలొందెనేని నొక్కచోటఁ
బరఁగుఁ గారకాఖ్యపదములై తెనుఁగున - వాని తెలఁగఁ దెలియవలయు బుధులు.

క. కోపింపు కోపించుట - కాపించుట - పసుల నొప్పఁ గాయించుట నా
నేపారు నిట్టిపలుకులు - లోపుగ బహుళములు జగతిలోఁ దెలుఁగఁదగున్. ౧౬౬

సీ. తెలుఁగుఁబలుకులు పునరుక్తిఁ బలుకుచోట - గదిసి రెండవపదమున మొదలివ్రాలి
పసరు గిత్వంబు ప్రాసంబు చెప్పుకుండు - వర్గములు దీర్ఘహ్రస్వప్రవర్తులనుచు. ౧౬౭

క. పులిగిలి యనఁ గదిగిరి యన - నలిగిలియన నోడగీడ యనఁగా బరఁగున్
నలులు గిలు లనఁగ బలుసం-తులు మతి గిలవంతు లనఁగఁ దున పరియనుమాన్. ౧౬౮

క. స్మరధరనగధరపదములు - పరఁగఁ గ్రియాపదము నొందుపట్టులనెల్ల
న్వగుప రకారములోపలఁ - బొరినిత్యముపంబుఁ గాక పొసఁగిన బోడమున్. ౧౬౯

క. స్మరియించె సంస్మరించెను - హరియించె హరించెఁ బూవునం బోఁ జరించెం
జరియించె నల్లభువిపతి - సరియించె నరించెనాఁగ నలనైయునికిన్. ౧౭౦

క. ఇది తెనుఁగున కల్లను జన - పదవిదితం బైన తెలుఁగుపట్టింగుక రయో
ల్లిదముగఁ జెప్పితి నంతయు - మది నెలుఁగుం డొగసి గూర్చి యంగు లితరముల్. ౧౭౧

మ. లలినన్యోన్యముఖావలోకనము లీలం జేయఁగా లేని యా
విలసత్ప్రాక్కళానుత్తమయము లుర్విం బరగ్ నేకనలిం
గలిగించెం బదవాక్యవేదియనలంకారగ్రంథసుమ్ భూపతో
జ్జ్వలవిద్యావిభవోన్నతుండు నగువిశ్వాత్మవిభుం డిమ్ములన్. ౧౭౨

మ. కవివాత్సల్యకళావరిష్ఠుఁడు జగత్కల్యాణచరిష్ఠుఁ డు
త్సవసంపుష్టసుపర్వగర్వుఁడు జయశ్లాఘాప్రగంధర్వుఁ డా
ర్జవశీలాదివిశుద్ధవృత్తుఁడు విరాజద్విక్రమాయత్తుఁ డు
ష్ఫవిశాలామలకీర్తిపూరుఁడు సుతేజస్స్ఫూర్తి డెల్లప్పుడున్. ౧౭౩

క. శ్రీమత్పురుషోత్తమపౌత్త్ర - డుమ్మసుందరవిభుఁడు సకలసంగ్రామజయ
శ్రీమంతుఁడు సంతతనత-సామంతుఁడు కామినీవసంతుఁడు లీలన్. ౧౭౪

తరళ. విరుదమిత్రుఁడు భిన్నశత్రుఁడు దేవేంద్రపుత్రుఁడు ధామినీ
శ్వరకులేశుఁడు మానవేశుఁడు వాహినీశుఁడు విక్రమ
స్ఫురణరాముఁడు మూర్తకాముఁడు పూర్ణసోముఁడు కీర్తులం
బరఁగుచుండెడు మా సుధాకరభానుతారకవిశ్రుతిన్. ౧౭౫

గద్యము

ఇది శ్రీమదుమారమణచరణారవిందవందన గోవిందామాత్యనందన
వివిధబుధవిధేయ విన్నకోట పెద్దయనామధేయవిరచితంబైన
కావ్యాలంకారచూడామణి యనునలంకారశాస్త్రంబు
నందు నంధ్రభాషావిశేష సంధిసమాసదేశీయ
ప్రయోగక్రియానిరూపణలక్షణ సముద్దేశం
బన్నది నవమోల్లాసము.

---